# యతిరాజవిజయము



దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి

ఓం.

# యతిరాజవిజయము.

దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి

విరచితము.



శ్రీ పీఠికాపురప్రభువరులగు

శ్రీ శ్రీ శ్రీ మహారాజా

శ్రీరావు వేంకటకుమారమహీపతిసూర్యారావు బహద్దరువారిచేఁ

ప్రకటితము.

పీఠికాపురమున

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1941

 [వెల రు 0—10—0

ఓమ్!

# పరితోషభాషితము.



స్వసుఖనిరభిలాషులై పరపరితోషభాషులై సౌహార్ద్ర ముతో లోకకళ్యాణమును సమకూర్పఁ బాటుపడు మహితాత్ముల జీవితచరితములు పరమపావనములు; శ్రేయస్సాధనములు; అవశ్యపఠనీయములు.

నిజామలపరిపాలననైపుణ్యముచే మానవసమితికిఁ బ్రవృత్తిసౌఖ్యముల నందఁజేయువారలు క్షితీంద్రులు. స్వీయవరేణ్యకారుణ్యముచేఁ బ్రజాసమూహమునకు నివృత్త్యానందముల సమకూర్చువారు యతీంద్రులు. సంసారులీయుభయైహికాముష్మికాభీష్టసంధాతలబోధల నేమఱక భక్తిప్రపత్తులతో ననుసరించునాఁడే, ఇహాముత్రసౌఖ్యములఁ బడయఁగలుగుదురు. అట్లొనర్పక స్వేచ్ఛావిహారులై మెలఁగునాఁడు గౌరవానందముల నందఁజాలక వ్యర్థజీవను లగుదురు.

మన యార్యవాఙ్మయమున ధైర్యౌదార్యాదిగుణభూషితులగు నృపసింహులయొక్కయు, శమదమాదిగుణశోభితులగుయతిపుంగవులయొక్కయు మహితచరితబింబములు కవీంద్రులచేఁ గావ్యముకురములఁ జక్కఁగాఁ బ్రతిబింబింపఁజేయఁబడి యున్నవి. వాని నామూలాగ్ర మాసక్తితో నవలోకించు

వారలకు జతుర్విధపురుషార్థములును జేకూరుట నిక్కువము. మానవసంఘమును సుగుణసంపన్నమునుగాఁ జేయఁజాలినది సచ్చరిత్రపఠనమేకదా !

పురుషార్థములలో నుత్తమపురుషార్థము మోక్షము. మోక్షప్రాప్తి కీశ్వరభక్తి ప్రధానసాధనము. భక్తిసంపదను సమకూర్చినది స్వదేశికావతంసుల సుబోధామృతపానమే. సందియము లేదు. కాని యట్టిగురురాట్టులపూతజీవితచరితములఁ గరతలామలకమట్టు విదితము సేయఁజాలినకావ్యరాజములు మనతెనుంగుబాసలో నంతగాఁ గన్పట్టకున్నయవి. అట్టిలోటు నెడఁబాటు సేయుటకే యీకృతికర్తలు పాటుపడి రని తోఁచెడిని.

## —• కృతికర్తృప్రశంస •—

శ్రీ శ్రీ పీఠికాపురభూపాలమహాళుల ప్రోత్సాహోదరములచే ననేకాష్టావధానశతావధానాదిమేధావైభవప్రదర్శనములఁ గావించి యసమానయశోధనమును బడయుటయ కాక మధురాతిమధురములగు కావ్యరాజముల విరచించి నిరుపమానకీర్తిచంద్రికల దిగంతముల వ్యాపింపఁజేసి, శాశ్వతసుఖావహ మగు శ్రీరావునృపాలకల్పశాఖి నాశ్రయించి హృదయంగమము లగు నిజకవితాకూజితగరిమలచే శ్రోతృమానసము లువ్విళ్ళూరునటుల మధురగాన మొనర్చిన దేవులపల్లికవిసోదరకోకిలయుగళము నెఱుంగని తెలుంగువా రీయాంధ్రవసుంధర నుండఁబోరు. ఈకవి

సోదరద్వంద్వములోఁ బెద్దలు సుబ్బరాయశాస్త్రిగారు, పిన్నలు వేంకటకృష్ణశాస్త్రిగారు. లోకమున వీరికే తమ్మన్నశాస్త్రిగారని ప్రసిద్ధి. ఈతమ్మన్నశాస్త్రిగారు నవయావనమున నయనోల్లాసాది కృతులఁ దెలుంగుబాసలోఁ బాఠకులయుల్లములు పల్లవించునటుల విరచించియున్నారు. ఈకవిశిఖామణి భగవానునియాహ్వానసమయమునకు నొకకొంత ముందుగా, ఏదయాజలధి నిజసుబోధామృతధారలచేఁ దాపత్రయతప్తులగు సంసారులకు జాతికులభేదముల గణింపక కేవలవాత్సల్యముతోఁ దుల్యగతినిఁ గైవల్యసంపదల నందఁజేయ నిజజీవితమును ధారవోసి కృతార్థుఁ డాయెనో, అట్టి శ్రీరామానుజాచార్యగురువర్యుని పావనజీవితమును "యతిరాజవిజయము" అనుపేర నాంధ్రభాషలో మృదుమధురశైలిని గద్యరహితపద్యకావ్యముగా సమకూర్చి యద్దానిని నిజోదారగౌరవామరతరుచ్ఛాయను నిండుమనసుతోఁ బండితకవిమండలిని బోషించు "నాంధ్రభోజు"లని ప్రతిభ గాంచిన పీఠపురసంస్థానప్రభువరులగు శ్రీ శ్రీ రావు వేంకట కుమార మహీపతి సూర్యారావుబహదూరు మహారాజావారికిఁ గృతిగా నొసంగిరి.

సుగుణమణిహారమునకుఁ గృతజ్ఞతాగుణము మేరుపూసగా వఱలుచున్నయది. ఆగుణతేజ మీకవిశిఖామణి యందుఁ బరిపూర్ణకలాకలితమై వెలయుచున్నది.

చ. ఎలమిని చిన్ననాఁడు మొదలే విభుసూనుమహాభివృద్ధికై
కొలిచితిమో స్వదైవములఁగూరిమినాతఁడు కీర్తికాముఁడై
వెలయుచు సత్కవిత్వరసవేదియునై కృతిసేయుమీ యనెన్
దలఁపఁగ నింతకంటె మఱి నా కిఁక వేఱొకభాగ్య మున్నదే.
[ ఆ. 1-33. ]

మఱియు నీకవిగారిమణికి వేంకటేశ్వరారాధనముపై నస్ఖలితభక్తిప్రపత్తు లున్నటుల వ్యక్తమగుచున్నది.

క. ఒకయేలిక నొకవేలుపు
నొకరీతిగ నమ్మియున్న నొదవక యున్నే
ప్రకటమగు నైహికాము
ష్మికసౌఖ్యపరంపరల్ సమృద్ధిగ వరుసన్. [ ఆ. 1-37 ప. ]

ఈ కవితిలకుఁడు సదా శ్రీరామచరణారవిందమిళిందాయమానమానసుఁడగుటవలననే భక్తిపారవశ్యముతో నీభాగవతావతంసుని పావనచరిత్రము నింత రసవంతముగాఁ జిత్రింపఁగలిగెను. దైవభక్తిలేనివాని వాణిని స్నేహహీనమగు వేణిని వలె పసందగు పొందిక చూపట్టదు.

ఇట్లొకకవిరాట్టుచే విరచింపఁబడి వేఱొకసామ్రాట్టునకుఁ గృతిగా సమర్పింపఁబడిన యీ యతిరాడ్విజయకావ్యరాజమునకు నాబోఁటివాఁడు పీఠికను వ్రాయఁబూనుట మహాసాహసము కాకుండునా ? కాని నేఁటిసారస్వతనభోవీథి నీరీతి విరుద్ధకార్యతరంగపరంపరలు పెక్కులు చెలరేఁగుచుండుటచే నిదియంత వింత గాదని తలంచెద.

## — కృతిపతి ప్రశంస —

కవివరుఁ డీయతిరాజవిజయకావ్యమున వర్ణించిన శ్రీరావు వేంకట కుమార మహీపతి సూర్యారాయధరారమణుల గుణవివరణము సత్యదూరము కాక యాథార్థ్యభాసురమై వెలయుచున్నది. కవివరేణ్యుఁడు కావ్యాదిని సర్వాభీష్టప్రదుఁడగు జగదీశ్వరుని నుతించుట యెట్లు సౌభాగ్యప్రదమో యటులనే భాషాపోషకుఁడగు పుడమియొడయునిఁ బొగడుట కూడ శ్రేయస్కరము.

కవినృపతిసంబంధ మవినాభావగుణశోభితము. ఘనుఁడు మధురోదకధారలచే లోకము నానందింపఁజేయుటకుఁ గారణము సాగరనీరసారమే. కవిఘనుఁడు హృద్యసాహిత్యరసవర్షములచే సరసుల నలరింపఁజేయుటకు హేతువు భూపవరోదారాదరవారిపూరమే. మఱియు భాస్కర తేజము చందమామయందుఁ బ్రతిబింబించి చల్లనివెన్నెలగా మారునట్లు భూపవరరవిగౌరవరశ్మి కవిసుధాకరునియందుఁ జేరి సరసమగు కవితాకౌముదిగాఁ బరిణమించును.

కావుననే యుత్తమాంధ్రకావ్యనిర్మాత లెల్లరును బరమేశ్వర స్తవముతోఁ బాటు కృతిపతిగుణవర్ణనమునుగూడఁ జేసియున్నారు. ఇట్లొనర్చుట భావిలోకమున కెంతయు మంగళావహము. నన్నయభట్టారకాదికవిసింహులు విద్యాపోషణచణు

లగు రాజరాజనరేంద్రాదిభూరమణులఁ గావ్యాదిని సంస్తుతింప కున్నచో నాసారస్వతసంరక్షణదక్షులగు క్ష్మాపతుల ఘనజీవితము లీవలివారు తెలిసికొని యానందించుట యెట్లు పొసఁగును? కావుననే సారస్వతతత్త్వవేత్త లీక్రిందిరీతిని నృపతికీర్తిని బ్రస్తుతించియున్నారు.

"ఆదిరాజయశోబింబ మాదర్శం ప్రాప్య వాఙ్మయం
తేషా మసన్నిధానేపి న స్వయం పశ్య నశ్యతి."

అనఁగా ఆదిరాజులయశోబింబము వాఙ్మయ మను దర్పణమును జేరి వా రెదుట లేకున్నను కీర్తిబింబముమాత్రము నశ్యముగాక దృశ్య మగుచుండు నని భావము.

## — కృతి ప్రశంస. —

ఈకావ్యమునందుఁ బెక్కుతావుల నీతిబోధలు చక్కఁగాఁ జేయఁబడినవి. అం దొకపద్యము నుదాహరింతును.

సీ. శరణాగతత్రాణబిరుద మూనుటకంటె
వసుధ నింకొక మహావ్రతము లేదు
దీనరక్షాదీక్షఁ దేజరిల్లుటకంటెఁ
దలపోయ నొండొకతపము లేదు
ఆడి తప్పనిసూనృతాప్తి నొప్పుటకంటె
నిర్ణయింప మఱొండునియతి లేదు

పరవధూన్వైముఖ్యపరత నుండుటకంటె
మతి వేఱె యాచారగరిమ లేదు
సమధికస్ఫూర్తి సర్వభూతములయందు
దయగనుటకంటె నీక సుకృతంబు లేదు
అలయహింసానిరూఢిచే మెలఁగుకంటె
లెక్కఁగొన నొండుధర్మంబు లేదు లేదు.

[ 3 ఆ-128 ]

ఇందువర్ణించిన భగవద్గుణగరిమల గమనించిన నాస్తికులకుఁగూడ భక్తి మొలకెత్తుననుట సత్యము.

సీ. అరకంటి చూడ్కిచే నఖిలసంపదలిచ్చు
చెలువతో బంగారువలువతోడ
మిసమిస మనుకప్పుపస నొప్పుచక్కని
రూపుతో దయఁ జిల్కుచూపుతోడ
మాణిక్యమయదివ్యమకుటప్రశస్తమ
స్తంబుతో నభయహస్తంబుతోడఁ
గమ్మకస్తురిబొట్టుగల ఫాలభాగంబు
గోముతోఁ జిఱునవ్వుమోముతోడ
సురుచిరానంతనిస్తులశుభగుణుండు
గర్భసంభృతనిఖిలజగద్గణుండు
రవిశతనిభుండు పార్థసారథివిభుండు
కరుణఁ గనుపట్టె నతనిముంగలను గలను.

[ 1 ఆ. 137 ]

ఈపద్యమునందుఁ గవితాప్రౌఢియు, భక్తిరసప్రవాహపు వడియుఁ జక్కఁగఁ జూపట్టుచున్నవి.

భాగవతమునందు గురుపుత్రీనృపపుత్రికలు వలువలకై తగవులాడిన ఘట్ట మింపుగా వర్ణింపఁబడినట్లే యీకావ్యము నందు గురుసతీశిష్యసతులు జలములకై వాదులాడుట మనోహరముగఁ జిత్రింపఁబడినది. కనుఁడు.

క. నాపై నీవీపగిదిన్
గోపింపఁగఁ దగునె నీకు గురుసతినిగదా!
నాపాదతీర్థమేనియు
నోపుఁ జుమీ నీదు పాపమొయ్యనఁబాపన్.

ఉ. అవునే నీకులమేడ? జూడఁగ మదీయంబౌ కులంబేడ? నీ
నవ్వుఁబొల్లంబడు భాగ్యమేడ? ఘనమానాన్వై భవంబేడ? న
న్నవివేకంబు దలిర్ప నిక్కరణి నత్యంతావలేపంబుచే
నవమానం బొనరింపనేల? యిది నీకర్హంబుగాఁ దోఁచెనే.

[3 ఆ. 56]

కవియొనర్చిన తిరువళిక్కేణి వర్ణనము నేటితిరువళిక్కేణి నీటునకు (ఫొటోగ్రా) ఛాయాబింబముగా వఱలుచున్నది.

సీ. శంఖచక్రాంకభాస్వరబహిఃకుడ్యసుం
దరమందిరంబులఁ దనరుదాని
వెడలుపు పొడువు నిండడరంగ రంగారు
కళ మీరు తిరువీథు లలరుదానిఁ

గొలలను దొలగించుసలిలంబుచే మించు
మొదటికైరవిణిచేఁ బొదలుదాని
రంగవిమానంబురహిఁ గాంచి దీపించు
ఘనమైనకోవెల గలుగుదానిఁ
జెన్నగరీసదేశవిస్తీర్ణనిఖిల
వాటికలలోన మేటి నా వాసికెక్కి
కీర్తిఁ గనుదానిఁ దిరువల్లికేణిఁ గాంచి
సన్నుతించిరి వారలీచందమునను. [ పు 115 ]

మఱియు నీపుత్త్రమున నత్తింటఁ గ్రొత్తయల్లునిగోటు తీరెట్లుండునో యాఘక్కి సక్కఁగ వర్ణింపఁబడినది.

సీ. తనకు విందుగఁ బొందుగను గూర్చుభక్ష్యభో
జ్యంబులం దనృతంపుటరుచిఁ దెలుపు
గట్టనంబుగ మేలిపుట్టంబుల నొసంగ
దర్పానఁబలె నిరాదరము సూపు
స్వాంతవాక్యంబు లచ్చపుఁగూర్మి నుడువుచోఁ
బ్రతికూలకుటిలభాషితము లాడు
బహుకాల మందుండి పండుగ లేతెంచు
నపుడు ప్రయాణంబు నభినయించు
నల్లుఁ డనుమాత్రమున నెట్టియాతఁ డైన
నట్లు కాక మెలంగుదు రతుల మైన
ప్రేమ నత్తింటఁ గేశవసోమయాజి
కమలనయనభట్టారకు లమలవృత్తి. [ పు 94 ]

చ. వరముని పూజితా! చిఱుతప్రాయమునన్ మృదువైన
వెన్నయుం। బెరుగును గొల్లయిండ్లకడ వేడ్క హరిం
చుచు నంతకంతకున్। హరణ మొనర్చుఁజాలిత్రి మహో
కఠినంబగు పాతకంబులన్। స్థిరకరుణానిధీ! విమలధీ! సుగు
ణోదధి పార్థసారథీ."

[ ప 128 ]

ఈపార్థసారథిస్తుతిలోని ముద్దుపలుకులు చిన్నిపూఁదేనె చిన్నపలుకులువలె వీనులకు విందుసేయుచున్నయవి.

ఈ యతిరాజవిజయమున వర్ణితములైన తురకచేడియ, మాలదాసరి, శూద్రభక్తులు, బ్రాహ్మణభాగవతులు లోనగు వారి జీవితగాథలవలనఁ దెలియనగు పరమార్థమేదియన, దయాలవాలుఁడగు భగవానుని సేవించుటకు జాతికులభేదము లాటంకములుగాక సర్వమానవు లెట్లర్హులగుచున్నవారలో యటులనే సదాశయశోభితులగు భాగవతుల నారాధించుటలోఁ గూడ జాతికులాది తారతమ్యము లంతరాయములు కాఁజాలవను నదియే.

## —• కృతినాయకప్రశంస •—

ఈకావ్యమునందుఁ బ్రధాననాయకుఁడగు రామానుజ గురుఁడు శాంతరసపూరితుఁడగు పరమభాగవతోత్తముఁడు. కవి యాయుడయవరునిఁ బ్రశంసించుపట్లఁ దెలిపిన పద్యములకొన్నింటిని నుదాహరింతును.

ఉ. దీనదయాళుఁ డూర్జితుఁ డుదీర్ణగుణప్రకరాంబురాశి ప్రి
జ్ఞానిధి సత్యసంధుఁడు ప్రశాంతుఁడు దాంతుఁడు ధీరుఁ డుత్తమ
జ్ఞానధురీణుఁ డార్యనుతచర్యుఁ డుదారుఁడు నై యెసంగు రా
మానుజువర్తనంబుఁ గని యందఱును గొనియాడకుందురే?

[ ప్ర. 158 ]

శ్రీమద్రామాయణనాయకుఁడగు రాముఁడు సతిని విడనాడినట్లే యీకావ్యనాయకుఁడగు రామానుజుఁడుగూడఁ బడతి నెడబాసినట్లు వర్ణితమైయున్నది. ఇట్టి ఘట్టములు తగు పరిశీలనము చేయఁజాలని చదువరులకు వెగటుగాఁ గన్పట్ట వచ్చును. కాని ధర్మాధర్మనిర్ణయమునఁ బూర్వాపరసందర్భము లఁ జక్కఁగ నవలోకించువారలకు దోసము గోచరముగాదు.

## — రస ప్రశంస —

ఈకావ్యము శాంతస్వాంతులగు భాగవతోత్తముల పూతజీవితముల వర్ణించునది యగుటచే భక్తిరసమునకేగాని శృంగారాదిరసముల కంతయవకాశ ముండదు. అయిన నట నటశృంగారాదిరసములు స్ఫురింపఁజేయు పద్యములు లేకపో లేదు. గ్రంథవిస్తరభీతిచే వాని నుదహరింపనైతి.

వేంకటకృష్ణశాస్త్రిగా రీకావ్యములోఁ జతుర్థాశ్వాస మునఁ బదునాలుపద్యములవఱకును వ్రాసి యవశిష్టభాగమును బూర్తి సేయకమున్నే కీర్తిశేషులైరనియు నటుపిమ్మట నిజానూన

మోహనకవితాలతాసుమసౌరభములచే శ్రీ పీఠికాపురాధీశ్వరులమానసము నలరింపఁ జేసి యామహారాజులయాస్థానమున విద్వత్కవీంద్రులై గురువరులై వన్నె గాంచిన రామకృష్ణకవులు విస్పష్టార్థమును సంఘటించి కావ్యమును బూర్తి చేసి రనియుఁ దెలియవచ్చుచున్నది. కాని, ఈతత్త్వ మెఱుంగనివారి కీకావ్యమంతయు నొకరికవితగానే యవగతమగునుగాని భేద మావంత యువిదితము కానేరదు. ఇట్లభేదగతిని మనోహరముగాఁ గృతిని బూరించుటచే రామకృష్ణకవులకవితానైపుణియు మేధాశక్తియు వ్యక్త మగుచున్నవి.

ఇట్లనుపమానకావ్యనిర్మాణప్రవీణము లగు కవిపండితరాజహంసల కావాసనిలయమై వినిర్మలప్రేమవారిపూరితమై పద్మనాయకవంశకుసుమాకరాలంకారమై పీఠికాపురిని విరాజిల్లుచున్న శ్రీరావునృపాలకులకమలాకర మా లోకబాంధవునికరుణావలోకనముచే నిత్యాధికవైభవానందసుందరమై యాచంద్రార్కముగా నిల నలరారుగావుత!

శ్లో: కళ్యాణగుణసంపన్నా
కరుణామయమానసా
యతిరాజధరారాజా
పూజ్యేతాం భూతలే సదా.

ఓం తత్సత్ !

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి
పీఠికాపురాస్థానవిద్వాన్.

శ్రీ

# యతిరాజవిజయము.

## ప్రథమాశ్వాసము.



శ్రీ మహిళాలలామ తనచెన్నగు పెన్నురమందుఁ బొందుగం
బ్రేముడి మీఱ నిల్వఁగను బీఠపురీవరరాజ్యలక్ష్మి ను
ద్దామతఁ బ్రోదిసేయుచు సతంబు హితం బిడుకుంతిమాధవ
స్వామి యభీష్టసంపద లొసంగుత సూర్యనృపాలమౌళికిన్.

ఉ. చారుమణీమయాభరణజాలవిభూషిత చూడికుద్తనాం
చారు వ్యపోహితాశ్రితవిచారుఁడు సూరిజనస్తవార్థసం
చారుఁడునైనరామవిభుచంద్రునిసూర్యమహీతలేంద్రుపై
స్ఫారకృపాకటాక్షముల సంతతముం బ్రసరింపఁ జేయుతన్.

చ. అనుపుగ దేనిఁ బూని వనజాక్షుఁడు సజ్జనరక్షణంబు దు
ర్జనగణశిక్షణంబును నిరంతరముం బొనరించుచుండు న
య్యనుపమతేజ మౌబుధజనైకసుదర్శన మైనశ్రీసుద
ర్శనమొనగూర్చుసూర్యమహిజానికనూనజయోచ్ఛ్రియంబులన్

క. అరిదరకలనాస్పద మై
హరియైదవకరసరోరుహాంబువితానం
బరఁగెడునలకౌమోదకి
నిరతముఁ గృతిపతి కొసంగు నిఖిలశుభంబుల్.

క. బృందారకబృందావన
సందర్భవినిర్భరైకశక్త్యాకర మౌ
నందకము విహితమహితా
నందక మగుఁ గాత సూర్యనరనాథునకున్.

చ. ఇలను భరించు నెవ్వనియహీనఫణాఫలకంబు లేనిమే
నలరులనెజ్జ యై యలరు నాహరి కట్టియనంతమూర్తి ని
స్తులతరకీర్తిపూర్తి నిడి తోరపుఁగూరిమిఁ బ్రోచుఁగాత ని
ర్మలసుగుణాంకు వేంకటకుమారమహీపతిసూర్యరాడ్విభున్.

క. ధన్యం బై హరిపూనుట
మాన్యం బై సకలసకలమండలికి నసా
మాన్య మగుపాంచజన్యము
జన్యములం గెలుపు సూర్యజనపతి కొసఁగున్. 7

మ. అరవిందప్రభవాండభాండనికరం బబ్రంబుగం దుందకం
దరమం దూని మెలంగుశ్రీరమణు నుద్యల్లీలమై వీపునన్
సరవిం దాల్ప ననల్పశక్తి గలయాఛందోమయాకారుఁడౌ
గరుటామంతుఁడు సూర్యరాయధరణీకాంతాగ్రణిం బ్రోవుతన్.

చ. ధృతిసెడ నాత్మచిత్తము జయించినకల్మలవాలుగంటిభ్రూ
లతికలసామ్యముం గని చెలంగుట గెల్పు ఘటించు నంచు సం

తతమును శౌరి కోరికను దాలుచుశార్ఙ్గ మురుప్రతాపదీ
పితుఁడు గఁ జేయుఁగాత సుకవిస్తవనీయుని సూర్యరాయనిన్.
చ. అమరవిరోధు లెవ్వనికరాంబురుహంబున డంబు గాంచువే
త్రము చలియించుమాత్రమునఁ దల్లడమంది చలించుచుందు రా
సుమహితశక్తిశాలి యగుసూత్రవతీశుఁడు సూర్యరాయభూ
రమణునకుం గడంగి చతురంగబలోన్నతిఁ గూర్చుఁ గావుతన్.
క. అల కమలాకౌస్తుభముల
కలయిక నలరారి శౌరిగాత్రరుచులతోఁ
దులఁదూఁగెడుశ్రీవత్సము
కలుముల దయచేసి మనుచుఁ గాతఁ గృతిపతిన్. 11
మ. హరిబాహాంతరసీమఁ దామరసగేహం దాల్చుపీతాకృతిం
బరిపూర్ణద్యుతిఁ బొల్చుకౌస్తుభము శుంభల్లీల నెల్లప్పుడున్
సిరు లెల్లన్ సమకూర్చి ప్రోవుత సుధీజేగీయమానక్రియా
భిరతాత్మం డగుసూర్యరాయధరణీబృందారకగ్రామణిన్.
క. మురహరుని పేరురంబుం
బరువడి వాసింపఁజేయువనమాలిక భా
సురగుణముల నలరించుత
సరసుం డగుసూర్యరాయజననాయకునిన్. 13
శా. శ్రీరామారమణాంఘ్రిపద్మయుగళీసేవానుభావైకవి
స్ఫారస్వాంతులు భట్టనాథముఖు లై భాసిల్లు పన్నిద్ద ఱా
ళ్వారు ల్గూర్తురు గాత భూరిసుగుణాలంకారుఁ డై యొప్పుసూ
ర్యారాయాగ్రణికిం బ్రపన్నజనముఖ్యస్తోత్రపాత్రత్వమున్.

సీ. బహుకావ్యకర్త యై పరఁగినవేంకటాం
తర్వాణి యెవనిముత్తాతతాత
యఖిలశాస్త్రధురీణుఁ డగుజగన్నాథధీ
మంతుఁ డెవ్వనిపితామహునితాత
సంపూర్ణవైదుష్యశాలి వేంకటసూరి
యేమహామహుప్రపితామహుండు
విద్వత్కవీంద్రుఁ డై వెలసినరామవి
ద్వాంసుఁ డేఘనునిపితామహుండు
పృథుకళాఢ్యుండు వేంకటకృష్ణనామ
కార్యజనవర్యుఁ డేసదయాత్ముతండ్రి
యతని నస్మత్పితామహు నభినుతింతు
సద్యశస్కు సీతారామశాస్త్రివరుని. 15

ఉ. పంకజవాసినీగరుడవాహనపావనపాదసేవనా
లంకృతమానసాంబురుహులన్ మహనీయుల శైలకన్యకా
శంకరతుల్యులన్ సకలసద్గుణసాంద్రుల వేంకమాంబికా
వేంకటకృష్ణకోవిదుల వేఁడెద నాతలిదండ్రులన్ మదిన్. 16

ఉ. నన్నయసూరనాదికసనాతననూతనసత్కవీంద్రులన్
సన్నుతిచేసి వాసిగను జారుకవిత్వకళాపటుత్వసం
పన్నతఁ గాంచి సూర్యవిభువర్యకృపం జెలువొందుచున్న మా
యన్నను సుబ్బరాయవిబుధాగ్రణి నిచ్చలుఁ గొల్చుచుండెదన్.

క. అని యిష్టదేవతావం
దనమును గురుకవిజనాభినందనమును నే

నొనరిచి యొకఘనకావ్యము
మనమున రచియించుతలఁపుమై నుండునెడన్. 18

సీ. సకలజన స్తవాస్పదనిత్యసత్యసం
భాషణుం డరిలోకభీషణుండు
హితపురోహితసమాశ్రితభృత్యసందోహ
పోషణుం డుచితసంతోషణుండు
బహుదీనమానవప్రసరత్కృపారసో
న్మేషణుం డురుఖలద్వేషణుండు
ప్రత్యయాకరకవీశ్వరభూరిదారిద్ర్య
శోషణుం డపగతదూషణుండు
భోజనృపకృష్ణరాయేంద్రముఖ్యపూర్వ
సత్కృశారసవిద్రాజసదృశతాది
శుభగుణవిశేషణుండు శ్రీసూర్యరాయ
భూమినాయకజనతావిభూషణుండు. 19

ఉ. చెన్నపురంబునందు నివసించి వినీతి గ విద్య నేర్చుచో
మన్నన నవ్విభుం గనఁగ మక్కువ యెక్కువ నెక్కొనంగ మా
యన్నయు నేను గూడి చని యచ్చట ముచ్చట దీర నుండ వి
ద్వన్నుతగోష్ఠిచే మెలఁగు పట్టున నన్గని యాతఁ డిట్లనెన్.

క. దేవులపల్లి కులోద్భవ!
యోవేంకటకృష్ణకోవిదోత్తమ! వింటే
మీవారలు హరిసేవా
పావనులుం బరమభాగవతశేఖరులున్. 21

క. ఇది మామతంబు గొప్పది
యది వారిమతంబు కొద్ది దనుచుం గడు దూ
ఱెద రదిరా ! పెఱమతముల
నెదలోఁ బరమార్థమార్గ మెఱుఁగనివారల్. 22

గీ. మీర లటు గాక సమబుద్ధి మీఱ నరయ
స్మార్తులయ్యును వైష్ణవసంప్రదాయ
ముల నెఱుంగుదు రాబాల్యముగఁ ద్వదీయ
వంశభవు లెల్ల శ్రీరామభక్తు లగుట. 23

క. కావున రామానుజగురు
భావుకచరితంబు నాంధ్రభాషాకృతిగాఁ
గావింపు మసమతరప
ద్యావళి యతిరాజవిజయ మనియెడిపేరన్. 24

చ. సనయత దోఁప సర్వమతసమ్మతవర్తనకీర్తనీయతం
గని యనివార్యభూతదయ గ్రమ్మ ఘనమ్మగురాజభక్తిచేఁ
దనరెడుమీకె చెల్లునుగదా సముదారమతిన్ మదీయశా
సన మొనరించి శాశ్వతయశంబును గాంచుట కృష్ణధీమణీ !

చ. వదలక పెక్కు లౌశ్రమలఁ బాల్పడియు న్జలదోదయాప్తికై
యుదకము లెన్నియో విడిచి యోరిచి యుండెడిచాతకంబుల
ట్లదిర ! యవార్యధైర్యమతి నన్యుల వేఁడఁగఁబోక మామకా
భ్యుదయమెయాత్మఁగోరికొనియుంటిరిమీసహజన్ములిర్వురున్.

ఉ. నాగురుఁడున్ లసద్గుణసనాథుఁడు నౌభవదగ్రజన్మవి
ద్యాగరిమంబు మజ్జనకుఁ డర్మిలి నారసి సింహపీఠిపై

బా గగుభక్తిమై నునిచి "ప్రాజ్యతరం బగురాజ్య మెల్ల నీ
దే గద సుబ్బరాయసుకవీ!" యని మిక్కిలి గారవింపఁడే ?

క. ఎన్నఁగ నతనికిఁ దమ్ముఁడ
వన్నిట నోకృష్ణశాస్త్రి ! యని మఱియు నినున్
మన్నింపఁడె వంశావళి
సన్నుతగతిఁ గృతిని జెందుసమయమునందున్. 28

సీ. పదునాలుగేఁడులఁ బొదలుప్రాయమునాఁడె
కడఁగినాఁడవుగదా కవిత సేయఁ
బదునెన్మిదవయేఁట వాక్రుచ్చితివిగదా
సకలేశశతక మాశ్చర్యఫణితి
నిరువదైదవయేఁట విరచించితివిగదా
రావుసత్కులచరిత్రప్రబంధ
మెడనెడ వేనవే ల్నుడివినాఁడవుగదా
యసమపద్యముల నత్యాశులీల
నేఁడు వేడుకఁ జేయుచున్నాఁడ వమ్మ
దనుమతిని నయనోల్లాస మనెడుకృతిని
క్షితిని బరికింప నతిశీఘ్రగతిని బూని
సుకవితను గూర్చునేర్పు నీసొమ్ముగాదె ? 29

క. అని యానతిచ్చి హెచ్చిన
వినయంబున గౌరవంబు విశ్వాసంబున్
మనమునఁ బెనఁగొన నెన్నేఁ
దనరెడుమన్ననల నన్నుఁ దనిపి యనిపినన్. 30

సీ. గ్రంథావలోకనకలన వివేకంబు
గలుగు నం చెప్పుడు తెలిసెనొక్కొ
తెలిసి మహాకవీంద్రులు ప్రస్తుతియొనర్చు
సరసకావ్యము లెప్డు చదివెనొక్కొ
చదివి యందలివిశేషంబు లెంతేఁ బ్రౌఢి
పరిఢవిల్లఁగ నెప్డు డరసెనొక్కొ
యరసి యాచంద్రార్క మగుకీర్తి నిడఁ జాలుఁ
గృతు లంచు నెపుడు దా నెఱిఁగెనొక్కొ
యౌర! యితఁ డింత వింతప్రజ్ఞాతిశయముఁ
గలఁడె యని యెన్నఁగానేల ఘనత మెఱయఁ
బిన్నతనమున నుండి యీవిభుకుమారుఁ
డసమకవితారసైకలాలసుఁడు గాఁడె?

సీ. తొలియేఁటనే కృతార్థుం డయ్యెఁ దప్పక
ప్రథమపరీక్షలోఁ బ్రతిభ మెఱయ
నసమవైఖరి నుపన్యాసంబు లిడఁజాలె
నుభయభాషలలోన సూక్తు లలరఁ
గృతుల నయ్యెచమత్కృతుల నారసి తెల్పఁ
దొడఁగె సత్కవులు సంతోష మంద
సతతసత్యవ్రతాచరణదీక్షాముఖ్య
ఘనగుణస్ఫురణ విఖ్యాతికెక్కె
నహహ! యొకకొంత చిన్నప్రాయంబు తనకు
వదలునాఁటికె యిమ్మహీవరతనూజుఁ

డిట్టిసత్కళాశాలి కృతీశుఁ డగుట
భూరితరపుణ్యపరిపాకమునను గాదె ? 32

చ ఎలమిని బిన్ననాఁడుమొద లేవిభుసూనుమహాభివృద్ధికై
కొలిచితిమో స్వదైవములఁ గూరిమి నాతఁడు కీర్తికాముఁడై
వెలయుచు సత్కవిత్వరసవేదియునై కృతిసేయుమీ యనెన్
దలఁపఁగ నింతకంటె మఱి నా కిఁక వేఱొకభాగ్య మున్నదే.

ఉ. చెప్పిన సచ్చరిత్రములఁ జిత్రముగాఁ దగుభవ్యకావ్యమే
చెప్పవలెం బ్రసిద్ధతను జెందఁగఁ దత్కృతి నిచ్చ నిచ్చినం
దప్పక మెప్పుఁ గాంచు సుగుణప్రకరంబుల కాలవాలమౌ
నిప్పృథివీంద్రచంద్రునకె యీవలెఁ గేవలకౌతుకంబునన్. 34

చ. అతులితకీర్తిశాలు లన ఖ్యాతి వహించినఁగృష్ణరాయభూ
పతిముఖు లెల్ల నీయవనిపాలునికంటె రసజ్ఞులా ? కళా
దృతియుతులా ? మ ఱెవ్వ రన నీతనిరీతిఁ గవిప్రకాండస
మ్మతలసమానదానగుణమానితచర్యులు గారె యారయన్.

చ. అకలుషమిత్త్రిజాతహృదయాంబురుహప్రియకారి పద్మనా
యకకులశేఖరుండు సుమనోవనశీలుఁడు నై మెలంగుమా
మకమహిపాలనందనుఁడు మాయిలువేలుపుఁ బోలియుండుటం
బ్రకటముదం బెలర్పఁ గృతిభర్తనుగా నొనరించు టొప్పదే.

క, ఒకయేలిక నొకవేలుపు
నొకరీతిగ నమ్మియున్న నొదవక యున్నే
ప్రకట మగు నైహికాము
ష్మికసౌఖ్యపరంపరల్ సమృద్ధిగ వరుసన్. 37

క. కృతికన్యకుఁ గన్యకు న
ప్రతిహతవిద్యావివేకవైభవవినయా
ద్యతులితగుణమణిఖని యగు
పతి యబ్బుటకంటె వేఱుభాగ్యము గలదే. 38

క. యతిపతిచరితం బఁట ! కృతి
క్షితిపతియానతిఁ గడంగి చెల్లించుటయే
హిత మగుపని యఁట ! దానం
గృతకృత్యుఁడ నగుట యబ్రమే ? మహిలోనన్. 39

క. మనమున ని ట్లనుకొని నే
ననితరసులభైకసుగుణుఁడై తగునస్మ
జ్జనపాలసుతున కంకిత
మొనరింపఁగ నిశ్చయించి యుత్సాహమునన్. 40

షష్ఠ్యంతములు

క. దీనావనబిరుదాంకున
కానతజనతాచకోరహరిణాంకునకున్
దానకళానిశ్శంకున
కానాకచరద్యశోనిరాటంకునకున్. 41

క. సత్యవ్రతదీక్షారత
నిత్యవిశుభ్రాంతరంగనీరేజునకున్
బ్రత్యయనయవినయాస్పద
భృత్యజనానీకనాకపృథివీజునకున్. 42

క. స్మితపూర్వకమితభాషా
న్వితముఖునకు నన్యభామినీవిముఖునకున్
వితతానుగ్రహకలనా
వితసంశ్రితముఖ్య సత్కవిప్రముఖునకున్. 43

క. అకలంకమంగయాంబా
ముకురముఖీగర్భశుక్తిముక్తామణికిన్
సకలధరావరశేఖర
నికరనితాంతాభివర్ణ్యనీతిసరణికిన్. 44

సుకృతికినిరహంకార
ప్రకృతికి సంలబ్ధరామరాయవిలాసా
దికసత్కృతికిం గృతికిం
బ్రకటితశుభలక్షణైకభవ్యాకృతికిన్. 45

క. పరమనిరాధారజన
స్ఫురదురుతరవరదయాసముద్రునకు నభం
గురవైభవపీఠపురీ
నిరుపమరాజ్యాధికారనిస్తంద్రునకున్. 46

క. సరసకళాటోపునకున్
గురుతరవిఖ్యాతరావుకులదీపునకున్
వరచరితరామరాడ్భూ
వరవిరచితమహితసుకృతఫలరూపునకున్. 47

క. శ్రీలునకు సుశీలునకు ద
యాళునకు నితాంతసత్కృతానేకసుధీ

జాలునకున్ సత్కీర్తివి
శాలునకున్ సూర్యరాయజనపాలునకున్. 48

క. అతులాభ్యుదయావాప్తిగఁ
జతురతమై నే నొనర్ప సమకట్టినశ్రీ
యతిరాజవిజయ మనియెడి
కృతి కరయఁ గథావిధాన మెట్టు లనంగన్. 49

శా. శ్రీవైకుంఠపురీవరం బలరు లక్ష్మీనాథసర్వేశ్వర
త్వావిర్భూతమహత్త్వతత్త్వనిరవద్యోత్కృష్టసంస్థాపక
శ్రీవాదానుపదప్రసక్తశుకశారీభూరికోలాహలా
రావాటోపనితాంతకౌతుకకరప్రత్యాలయాళిందమై. 50

చ. హరిపదపూజనైకనిరతాత్మకులై వినివృత్తకాములై
పరమవిరాగశీలు రయి భాగవతానుమతప్రచారత
త్పరు లగునట్టిజ్ఞానులకుఁ దక్క మ ఱెవ్వరి కెన్నఁడేని త
త్పరమపదంబుఁ జెందఁదగుభాగ్య మొకింతయుఁ గల్గనేర్చునే.

క. ఇరువురు నొకగతి నలరుట
హరి యాతఁడు భక్తుఁ డీతఁ డని యెవ్వరికిం
బరికింప నలవి గా ద
ప్పురి సిరి బాహాంతరాళమునఁ గనుదనుకన్. 52

సీ. పటువజ్రకీలితప్రాకారములతోడఁ
మణిమయధ్వజపరంపరలతోడఁ
దులలేనిపచ్చలతోరణంబులతోడఁ
బవడంపుఁబనిమంటపములతోడ

గోమేదకస్ఫురద్గోపురంబులతోడ
దృఢపుష్యరాగవేదికలతోడ
మెఱుఁగారుముత్యాలమేలుకట్టులతోడ
వరనీలరుచిరవప్రములతోడ
మహితవైడూర్యఖచితసద్మములతోడఁ
బరమపద మొప్పుఁ గన్నులపండువుగను
శౌరి యఘటనఘటనైకశక్తిశాలి
యగుట నప్పుర మటు లుండు టబ్బురంబె? 53
ఆత్మభూముఖ్యుల కప్రాప్య మయ్యు భ
క్తులకు సుప్రాప్య మై యలరు నెద్ది
వరయోగితతి కగోచర మయ్యు సుజ్ఞాను
లకు గోచరం బై చెలంగు నెద్ది
యతివరేణ్యుల కదృశ్యం బయ్యు నధ్యాత్మ
విదులకు దృశ్య మై పొదలు నెద్ది
యఖిలసూరుల కగమ్యం బయ్యు నిత్యసూ
రులకు సుగమ్య మై వెలయు నెద్ది
స్వప్రకాశాభిరామ మై పరఁగు నెద్ది
మఱియు నాద్యంతరహిత మై వఱలు నెద్ది
యట్టివైకుంఠనగరమాహాత్మ్యగరిమ
మలవియె నుతింప నీశ్వరాదులకు నైన? 54
ధాళధళ్యప్రభాధారహీరోపలో
జ్జ్వలసహస్రస్తంభసంభృతంబు

చారుగారుత్మతస్థగితతోరణగణ
పరిచురచతుర్ద్వారభాసురంబు
ప్రథితముక్తాఫలగ్రథితశుభ్రాదభ్ర
పట్టాంశుకవితానభాసమాన
మతులనిర్మలతరద్యుతికాంతశశికాంత
మాణిక్యమయకుట్టిమస్థలంబు
నగుచుఁ దగు చుక్కిఁ గోటిసూర్యప్రకాశ
మైనయొకదివ్యమంటపాభ్యంతరమున
భోగిపర్యంకమున రమాభూమినీల
లర్మిలి భజింప నలరు నారాయణుండు. 55

చ. నిరుపమసత్కృపాగరిమ నివ్వటిలన్ భువనోపకారవి
స్ఫురణమునం దలంపు గడుఁ జొప్పడ నొప్పురమావధూటి హ
చ్చరిక యొనర్ప శేషమయశయ్యపయి న్వసియించి యున్నశ్రీ
హరి కుదయించె డెందమునయందు నొకానొకచింత యీగతిన్

క. ఒందొరులసిరుల నారసి
మెండుగ నెద నోర్వలేక మెలఁగుటచే భూ
మండలమున నుండెడు జన
కాండము బహుగతుల వెతల గాసిలు నకటా! 57

ఉ. ఆర్యుల మంచు నెంచికొని యన్యులపట్లను లేనిపోనిమా
త్సర్యముఁ బూని యెల్లరకుఁ జక్కనివిద్యలలో నెసంగుతా
త్పర్య మెఱుంగఁజేయక వృథాగతి వారును దారు నాదుకైం
కర్యవిదూరులై జనులు కష్టములం బడుచుండి రయ్యయో!

క. నరమాత్రుఁడె యితఁ డనియెడి
పెఱమార్గముఁ బట్టి నన్ను బృథివీస్థలిలోఁ
బరమాదృతిఁ గనుఁగొనమిం
గర మార్తిం గుందు జనము ఘన మగువెతలన్. 59
క. ఔరా ! ఘోరాఘాకూ
పారంబున మునుఁగుజనుల వైకుంఠపురం
బేరీతిఁ జేర్పఁగల నని
శ్రీరమణీరమణుఁ డిట్లు చింతిలుచుండన్. 60
క. తల్పాకృతి యగుశేషుఁ డ
నల్పాదృతి మీఱ శ్రీరమాధీశసుధీ
కల్పకుని నసమకరుణా
కల్పకుని వినీతి గదురఁ గని యనియె నిటుల్. 61
క. శ్రీలానీలాలోలా
యేలా చింతిల్ల నీకు హేతువు గలదే
పాలింపు నన్ను విన్నప
మాలింపుము దయ వచింపుమయ్యా ! దానిన్. 62
వ. అనవుడు శ్రీనివాసుఁ డురగాధిపునిం గని పల్కె నిట్లు నా
ఘనమగు చింతకుం గలుగుకారణమున్ వచియించువాఁడ నే
జనముల నుద్ధరించుటకు స్వాంతమునం దనుకంప పెంపుగం
దనరఁగ నిన్నుఁ గూడి యవతారము లెన్నియొ తాల్చితింగదా!
క. భూపాలుఁడు గాఁగన్ మఱి
గోపాలుఁడు గాఁగఁ దలఁచికొనెఁ గాని జనం

బాపురుషోత్తముఁ డగుహరి
యీపగిది జనించె నంచు నెంచెనె నన్నున్. 64

గీ. శంఖచక్రాదికాయుధసంచయంబు
సైన్యనాయకముఖభృత్యసముదయమును
నాదుప్రేరణమున వసుంధర జనించి
పాపభూయిష్ఠమై యొప్పుప్రజను గాంచి. 65

క. లోకమ్ము తమ్ముఁ గనుఁగొని
ప్రాకృతపూరుషులుగాఁగ భావించుటచే
వ్యాకులత నొంది వారు త
దాకృతి విడి మరలఁ జెంది రాత్మపదంబున్. 66

మ. స్థిరలో మానవు లెల్ల జన్మమరణాధివ్యాధిభేదాపదు
త్కరసంసర్గమునం గలంగుచు మెలంగం గాంచి నే వారలున్
దరియింపం గృపమీఱఁ బెక్కుగతులన్ యత్నించితిం గాని యో
యురగాధీశ్వర! మత్ప్రయత్నములు నోహో వ్యర్థమయ్యెం గదా.

చ. హరి యటు లానతిచ్చి మఱి యాయురగేంద్రునితోడ ని ట్లనెం
బరమకృపామతిన్ జనులపాపములం బెడఁబాపఁజేసి క్ర
మ్మఱఁ దరియింపఁ జేయఁగ సమర్థుఁడ వీ వొకరుండవే కదా
యొరులకుశక్యమే ప్రజలనొయ్యనఁ బ్రోవఁగనీకుఁదక్కఁగన్.

క. అనవుడుఁ జిలువలఱేఁ డా
వనజాక్షునితోడఁ బల్కె భక్తి దలిర్పన్
వినవయ్య నాదుమనవిం
గనవయ్య కృపాకటాక్షకలనన్ నన్నున్. 69

క. జగముల సృజియింపఁగఁ బెం
పఁగ నణఁపఁగఁ గర్త వీవ భావత్కంబై
దగుమాయచే విమోహిత
మగు నీయఖిలప్రపంచ మంబుజనాభా! 70

క. అంబుజసంభవుఁ డాదిగ
స్తంబావధికంబుగాఁగఁ దగునెల్లప్రపం
చంబు భవన్మాయాని
ఘ్నం బగుఁ ద్వన్మహిమ దురవగాహంబుగదా! 71

క. దేవర కశక్యముం గల
దే? వరకారుణ్యబుద్ధి ని ట్లంటివిగా
దే? వరదా! మహిమాస్పద!
దేవ! రమావర! నిను న్నుతింపం దరమే. 72

ఉ. ఏలికయాజ్ఞ నౌదల వహించి యొనర్చుటకన్న నున్నదే
మేలిఁక సేవకావళి కమేయసుఖోన్నతి దానఁ గల్గదే?
పోలిక లేని కైవడిని బొందుగ నందును నిందునున్, జగ
త్పాళి కధీశ్వరుండ వయి భాసిలు నీయెడఁ జెప్ప నేటికిన్. 73

క. స్వామి విభూతిద్వయముం
బ్రేమఁ బ్రసాదింతువేని వెలయించెద నే
నీమహనీయతరాజ్ఞన్
భూమిస్థలి నవతరించి బుధులు నుతింపన్. 74

క. అన విని వనజోదరుఁ డ
య్యనంతునకు బహుదయామయస్వాంతునకున్

మనమున నాదర మెంతేఁ
బొనరఁ బ్రసాదించె నవ్విభూతిద్వయమున్. 75
క. వెండియుఁ గుండలివిభుతో
నండజహాయుఁ దనియె నాదునాజ్ఞన్ మును భూ
మండలిని బొడమి కొందఱు
మెం డగుమద్భక్తిఁ గలిగి మెలఁగుదు రెలమిన్. 76
శా. వార ల్జ్ఞానయుతు ల్జనావనపరు ల్భవ్యాత్మకు ల్పంచసం
స్కారాన్వితులు నయ్యు భూజనులయజ్ఞానంబు నాత్మోపదే
శారూఢిం దొలఁగింపఁ జాల రయి ర ట్లౌట న్నిను న్లోకర
క్షారీతి న్వెలయింపఁజేయుటకు నాజ్ఞాపించితి న్నావుడున్. 77
క. పరవాసుదేవపదపు
ష్కరములకు నమస్కరించి కరము దదాజ్ఞన్
శిరసా వహించుకొని యి
ద్ధర నురగవిభుండు పొడముతలఁపున నుండెన్. 78
శా. జంబూద్వీపకలాప మై బహువిశేషప్రాభవాడంబరా
లంబక్షేత్రకలాప మౌచు విబుధశ్లాఘాస్పదాఖండల
క్ష్మం బెంపొందెడుచోళదేశమునఁ గాంచీమండలిం గారవం
బుం బెంపుంగనునొక్కగ్రామముపెరుంబూదూరు నా భాసిలున్.
క. భూతపుర మనఁగ మఱియుఁ బ్ర
భూతగతిం దప్పురంబు పొగ డొంది స్వయం
భూతరుణికి నెల వగుచున్
భూతలమున నతులగతుల నుతులు వహించున్. 80

ఉ. శ్రీ విలసిల్ల నప్పురి వసించుధరామరచంద్రు లెల్లఁ బుం
భావసరస్వతుల్ నృపతివర్యు లమానుషపౌరుషాస్పదుల్
భావుకవిత్తసంగ్రహణపారగు లూరుభవుల్ ద్విజైకసం
సేవనపావనాత్మకు లశేషజఘన్యజలోకసత్తముల్. 81

క. పటుగతిఁ దగునరదంబులు
చటులత నలరొందుద్విరదసముదయము సము
త్కటజవముగలుగుహరు లు
ద్భటభటపటలంబు నచట భాసిలు నెపుడున్. 82

చ. ఉరుతరసౌధయూధము లనూనసముచ్ఛ్రియసాలజాలముల్
సురుచిరదేవతాలయములున్ వరమౌక్తికరంగవల్లికల్
మరకతరమ్యతోరణకలాపకలాపకము ల్దలిర్చుటన్
సిరులకు నాటప ట్టనఁగఁ జెన్నగు నన్నగరీవరం బిలన్. 83

చ. ఫలభరనమ్రకమ్రతరుపాళికలం దగుకేళికావనుల్
పొలుపు వహించి మించువలపు ల్వెదచల్లెడుపుష్పవాటికల్
జలజపరిభ్రమద్భ్రమరఝాంకరణాంకము లౌకొలంకులుం
గలయలవీటిసాటి గనఁ గన్నులపండువు గాదె యేరికిన్. 84

చ బలరిపుమంత్రిసన్నిభుఁ డపారతపోనిధి వేదశాస్త్రకౌ
శలకలనాసముత్థితవిశాలయశోలలితుండు శౌరిప
జ్జలరుహసేవనైకపరతంత్రుఁడు కేశవసోమయాజి నాఁ
గలఁ డొకధారణీసురశిఖామణి యన్నగరీవరంబునన్. 85

క. హరితసగోత్రప్రవిదిత
నిరవద్యాచార్యవంశనీరధిశశి యై

హరిపాదకమలసేవా
పరతంత్రుం డగుచు నతఁడు భాసిలుచుండున్. 86

చ. అరయఁగ దివ్యదేశములయందు మహామహిమాభిరామ మౌ
తిరుమలలో వసించుసముదీర్ణలసద్గుణరత్నపాళి యా
తిరుమలనంబినామకసుధీజనమౌళికి భూపిరాట్టియుం
బెరియపిరాట్టి నాఁ గలరు పేర్మి సహోదరు లిర్వు రిద్దరన్.

క. ఇంతులలో నెల్లన్ మే
ల్బంతు లనం దనరునన్నెలంత లిరువురున్
గాంతిమతీద్యుతిమతు లన
నెంతయు ఖ్యాతిఁ గనుచుండి రింకొకపేరన్. 88

చ. తిరుమలనంబి యాతనిసతీమణియుం గడుఁగూర్మిఁ బ్రోవ న
య్యిరువురు చిన్నికన్నియలు హెచ్చినముచ్చట దీర నచ్చటం
బెరుఁగుచుఁజూచువారలకునెయ్యమొసంగుచునుండిరెంతయున్
మురిపెముగుల్కుమాటలను ముద్దులఁ జిల్కెడునాటపాటలన్.

చ. క్రమముగ నంతకంత కతికౌశలముం బ్రభవింప విద్యలన్
సుమహితనిష్ఠచేఁ జదువుచున్ సుజనస్తవనైకపాత్ర మై
యమరెడువర్తనంబుఁ గని యగ్రజుఁ డుల్లసిలన్ మెలంగునా
యమలకుఁ జేకుఱెం బరిణయార్హసమగ్రకళావిలాసముల్. 90

క. ఆకరణిఁ బరిణయార్హ
శ్రీకలనం దనరునట్టిచెలువలలోనన్
జేకొనె భూమిపిరాట్టిన్
శ్రీకేశవసోమయాజి నెయ్యపుసతిగన్. 91

క. ధర మళలమంగళపురీ
వరమునఁ గలకమలనయనభట్టారకుఁ డా
దరమున మఱి రెండవ దగు
పెరియపిరాట్టిన్ వరిఁచెఁ బ్రేయసి గాఁగన్. 92

క. ఆతెఱఁగున వా రిరువురి
చేతన్ వరియింపఁబడినచెల్లెంబ్రను సం
ప్రీతిగను తదనుమతి నిడి
యాతఁడు ధన్యుండ నైతి నని సంతసిలెన్. 93

సీ. తనకు విందుగఁ బొందుగను గూర్చుభక్ష్యభో
జ్యంబులం దనృతంపుటరుచిఁ దెలుపుఁ
గట్టనంబుగ మేలిపుట్టంబుల నొసంగ
దర్పానఁబలె నిరాదరము సూపు
సాంత్వవాక్యంబు లచ్చపుఁగూర్మి నుడువుచోఁ
బ్రతికూలకుటిలభాషితము లాడు
బహుకాల మం దుండి పండుగ లేతెంచు
నపుడు ప్రయాణంబు నభినయించు
నల్లుఁ డనుమాత్రమున నెట్టియాతఁ డైన
నట్లు కాక మెలంగుదు రతుల మైన
ప్రేమ నత్తింటఁ గేశవసోమయాజి
కమలనయనభట్టారకు లమలవృత్తి. 94

చ. తఱచుగ నేఁగఁగాఁ దగు సదా వసియింపఁగ రాదు చొక్క మై
వఱలెడుమక్కువన్ మెలఁగవచ్చును లోకువఁ జెందఁగూడ దా

దరణ మెలర్ప నొప్ప వలెఁ దద్దయు మోహము చూప లోపమౌ
నరయఁగ నత్తవారినిలయంబుల నల్లుర కివ్వసుంధరన్. 95

క. తనపట్టిమేలికై య
వ్వనితామణివరునివంకవారియెడ మహా
ఘనుఁడైన నడఁకువం దగు
మునుకొని పాలకయి రాయి మోసినకరణిన్. 96

క. ఎలమిన్ భూమిపిరాట్టిం
గలసి మహాభోగభాగ్యగౌరవలీలల్
దులఁదూఁగ నిఖిలసౌఖ్య
మ్ములఁ గేశవసోమయాజి వొదలుచు నుండెన్. 97

మ. అతులాచారసమేతుఁడై జపతపస్స్వాధ్యాయనిష్ఠాగరి
ష్ఠత మీఱ న్నిగమోక్తపద్ధతి ననూచానక్రమం బొప్పఁ గాఁ
గ్రతువు ల్పెక్కు లొనర్చి భాగవతకైంకర్యాప్తి వర్తించుచున్
క్షితిపై ఖ్యాతి వహించునాద్విజకులశ్రేష్ఠుండు సామాన్యుఁడే.

చ. అతనిగృహాంగణంబున నిరంతరమున్ విన నౌ శ్రుతిస్మృతీ
రితములు బాదరాయణసరీసృపనాథకణాదగౌతమో
దితఫణితిప్రసంగము లుదీర్ణతరార్ణవశాయిసత్కథా
తతులు సమస్తసత్ప్రచురధర్మములు న్నిగమాంతతత్త్వముల్

క. హరిభక్తాగ్రేసరుఁడై
హరిదివ్యాకార మాత్మయం దిడి యెపుడున్
హరికథలను సాయించుచు
హరికైంకర్యాప్తి నామహామహుఁ డలరున్. 100

క. అలతిరుమలనంబికి నిల
నలరున్ శ్రీశైలపూర్ణుఁ డనువేఱొక పే
రలఘుప్రజ్ఞానిధులకుఁ
గలుగుఁ గదా పౌరుషాఖ్య కడుఖ్యాతిమెయిన్. 101

ఉ. శ్రీమహిళామణిం బురుడుచెందెడుచారుగుణాభిరామ యౌ
భూమిపిరాట్టితోఁ గలసి భూరితరం బగుభోగవైభవ
శ్రీ మెఱయంగ సౌఖ్యములఁ జెందెడుకేశవసోమయాజికిన్
గామితసిద్ధు లన్నియును గల్గియు సంతతి లేకయుండుటన్.

మ. అతఁ డాత్మీయసతీవతంసమును నెయ్యం బార నీక్షించి యి
ట్లతిచింతాకులచిత్తుఁ డై పలికె నోయంభోజపత్రేక్షణా
సతతాభంగురభోగభాగ్యములు విస్తారంబుగా నున్న సం
తతి లేకున్న నిఁ కేమిలాభము గృహస్థశ్రేణి కీసంసృతిన్.

క. కానన్ జలనిధిలోనం
దానం బొరింప నేఁగఁ దగు నద్దానన్
మానక లభియించును సం
తాన మటంచును వచించెదరు కొంద ఱిలన్. 104

క. అని ప్రాణనాథుఁడు వచిం
చినవాక్యము లాలకించి చెలువునితో నా
తనివనిత వినయవినమిత
వనజోపమవదన యగుచుఁ బలికెన్ మరలన్. 105

క. ధీనిలయ ! భవాదృశసు
జ్ఞానుల కిటు లాడఁ దగునె ? జనులకు నలదై

వానుగ్రహగతి గా కిల
స్నానము గీనంబు నిడునె సంతానంబున్. 10(

గీ. వయసు మరలఁజొచ్చెఁ బ్రాణనాయక ! యింకఁ
గలుగు టెట్లు మనకుఁ గాన్పుకలిమి
జలజబంధుఁ డవ్విశాఖ దాఁటినవెన్కఁ
గొమరుమిగుల వాన గురియు టెట్లు ? 10'

క. అసమానవ్రతదీక్ష
లసమానత నింతదనుక లలి మసలితి నౌ
విసువుదల దోఁచె నాకున్
నిసుఁగులు గలుగ రనుమాట నిక్కవ మింకన్. 10(

శా. ఐనన్ దైవసమాను లై మెలఁగుమీయాజ్ఞానుసారంబుగన్
నే నానీరధిలోన మున్క లిడఁగ న్మీతోడ నేతెంచెదన్
దానం గోర్కె లభింపదే విసువుచేతం బల్కితే నట్టిచం
దానం దానికిఁ గోప మూన కపరాధంబుల్ గృపన్ సైఁపుఁడీ.

చ. అనవుడు నాతఁ డి ట్లను నిజాంగనఁ గన్గొని మానినీమణీ
యెన యగువర్షము ల్గురియవే తపనుండు విశాఖ దాఁటినన్
వనజదళాక్షికిన్ వయసు వ్రాలఁగఁ జొచ్చినయంతమాత్రనే
తనయులు గల్గరే యవి సదా హరిలీల కధీనముల్ గదా !

చ. ఇలపయి లేక లేక జనియించినబిడ్డలు భాగ్యశాలు లై
యలరుచుఁ దల్లిదండ్రుల కుదారముదావహలీలఁ బొల్తు రం
చెలమిని మున్ను నీ వెఱుఁగవే? కనవే? యితిహాసగాథలన్
వెలఁదిరో!పుత్త్రునిన్ మనకు వెన్నుఁడటుల్ దయ సేయు నేమొకో!

క. వననిధిలో నవగాహన
మొనరింతము రమ్ము నాఁగ నువిదయు నిజనా
ధుని యాజ్ఞ నౌదలం గొని
చనె సాధ్వులు మగనిమాట జవదాఁటరు గా. 112

చ. అటఁ జని కాంచి రయ్యురువు రర్మిలి చెన్నపురీవరంబుచెం
గటఁ దిరువల్లికేణి యనఁగాఁ దనరారెడునొక్కగ్రామమున్
స్ఫుటతరసత్ప్రభావపరిశోభితతీర్థలలామమున్ సము
త్కటవిభవాభిరామహరిధామనిరంతరదివ్యధామమున్. 113

క. ఇల దాల్చినపేటలచే
నలరెడుచెన్నపుర మనెడుహారంబునకున్
దుల లేనిశోభ నొసఁగుచు
నలువగుఁ దిరువల్లికేణి నాయకమణి నాన్. 114

సీ. శంఖచక్రాంకభాస్వరబహిఃకుడ్యసుం
దరమందిరంబులఁ దనరుదాని
వెడలుపు పొడువు నింపడరంగ రంగారు
కళ మీఱుతిరువీథు లలరుదానిఁ
గొలలను దొలఁగించుసలిలంబుచే మించు
మొదటికైరవిణిచేఁ బొదలుదాని
రంగవిమానంబురహిఁ గాంచి దీపించు
ఘనమైనకోవెల గలుగుదానిఁ
జెన్ననగరీసదేశవిస్తీర్ణనిఖిల
వాటికలలోన మేటి నా వాసికెక్కి

కీర్తిఁ గనుదానిఁ దిరువల్లికేణిఁ గాంచి
సన్నుతించిరి వార లీచందమునను. 115

సీ. పట్టణం బెయ్యది పార్థసారథిదివ్య
సారంగమున కబ్జకోరకంబు
పుటభేదనం బెద్ది భూరితైర్థికహంస
సంఘంబులకు మానసహ్రదంబు
పురవరం బెయ్యది పరమభాగవతోత్త
మామూల్యమణులకు నాకరంబు
నగర మేయది నిరంతరవైభవస్ఫుర
ణాతిరేకంబున కాటపట్టు
దాని విబుధప్రశస్తవాస్పదం బైనదాని
నరయుమాత్రాన నఘముల నడఁచుదాని
మహిమమున రంగనగరసామ్యంబు గలిగి
నెగడుదానిని దీని వర్ణింపఁ దరమె ? 116

చ. నిరుపమనిత్యభోగముల నిత్యమహోత్సవవైభవంబులన్
సరగున నెల్లవారలకు సంతసమున్ ఘటియించి యాదటం
బరమవిభూతిఁ గూర్చి మనుపం దగురంగపురంబు దక్క ని
ర్భరమహిమోన్నతిం బెఱపురంబులు దీనికి సాటివచ్చునే. 117

సీ. కలశార్ణవతరంగములలీల విమలచం
చలపటాంచలపతాకలు దలిర్పఁ
జిలువరాపడగలచెలువు రాణించెడు
కడువెల్లనగుగొప్పగొడుగు లొప్ప

సందర్శింపుహోరు నా స్వస్తి వాచకవిప్ర
సముదాయవేదఘోషము లెసంగఁ
దత్రత్యమణివిభాతతులు నా నతులనా
నావిధవహ్న్యంత్రములు దనర
నడుగడుగునకు నుడునాయకాస్య లెలమి
నసమసుమఫలకర్పూరహారతుల నొ
సంగఁ దిరువీథులకు నేఁగుసమయమునను
స్వామిఁ గనుఁగొన్నఁ గన్నులపంట వగును. 118

చ. అని కొనియాడి యాద్విజకులాగ్రణి యాత్మవధూటిఁగూడి గం
గను దలఁపించునమ్మొదటికై రవిణిం జలకంబులాడి పా
వనుఁ డయి యచ్చోటున్ వెడలివచ్చిగుడిన్ వెసఁ జొచ్చిభక్తిదా
ర్కొనఁగఁ దదీయపై భవనిరూఢికి మెచ్చి యనంతరంబునన్.

క. వెల లేనిసిరులఁ దగుకో
వెలలోనికి నేఁగి యేఁగి వినయ మెలర్పన్
వలగొని గర్భాలయ మ
వ్వలఁ గని చని దానిమధ్యభాగములోనన్. 120

సీ. అసమానసౌందర్యలసమానవదనసా
రసమునఁ బెనుగంటు లెసఁగువాని
వరశంఖచక్రంబు లిరుకేల నిరుకేల
మునికోలయును వాగె లొనరువాని
జలరుహంబులడంబు గెలువంగ నోపుచూ
పుల భక్తవాత్సల్య మొలుకువాని

నీలమేఘచ్ఛాయ నెగడుకాయంబున
మెఱుఁగారురవణము లెృఱయువాని
ఘనతరాఖండదివ్యప్రకాశలీల
నెల్లకడలను గడు వెలయించువాని
బవరమున నిందరిజుని తేరివారువములఁ
బూని నడపినయలవేల్పుఁతేనిఁ గనియె. 121
గీ. అట్టు లత్యుత్కటప్రభావైకజన్మ
భూమి యగుపార్థసారథిస్వామి నతఁడు
గాంచి సాష్టాంగనతులఁ గావించి యిట్టు
లెలమి దైవారఁ గైవారముల నొనర్చె. 122
క. నీమహిమలు గనుఁగొన నే
నీమహిమండలములోన నెంతటివాఁడన్
సోమసమర్చిత! ముఖజిత
సోమ! సమస్తప్రశస్తసుగుణస్తోమా! 123
ఛ. కరివరదా! సదా భవదఖండతరస్మరణప్రసక్తిచేఁ
బరువడిఁ గాలముం గడపువానిరసజ్ఞ రసజ్ఞ గాని యు
ర్వర మఱియొండురీతిఁ దగువానిది గాదు గదా గదాధరా!
స్థిరకరుణానిధీ! విమలధీ! సుగుణోదధి! పార్థసారథీ!
చ. నిరుపమలీల నీచరణనీరజసేవ రజోగుణైకవి
స్ఫురణ మణంచు టర్హమగుఁజుమ్ము భవన్ముఖపంకజాతసం
స్మరణము పంకజాతగరిమం బడఁగించుట చిత్ర మౌఁజుమీ
స్థిరకరుణానిధీ! విమలధీ! సుగుణోదధి! పార్థసారథీ! 124

చ. సరసల నాల్గుబాహువులచాడ్పున నయ్యనిరుద్ధసాత్యకి
స్మరబలరాము లెప్పుడు సమంజసలీల వసించియుండఁ జూ
పఱులకుఁ జాలఁగన్నులకుఁ బండువు సేయుచునుంటి వీ వహో
స్థిరకరుణానిధీ! విమలధీ! సుగుణోదధి! పార్థసారథీ!

చ. వరకరుణావలోకపరిపాలితలోక! సుధాకరప్రభా
కరు లిరుకన్ను లై వెలయఁగం దగునీ వఱకంటఁ జూచినన్
బరమదురాత్ము లైన నెడఁబాయదె యెట్టితమఃప్రకర్షమున్
స్థిరకరుణానిధీ! విమలధీ! సుగుణోదధి! పార్థసారథీ!

చ. వరమునిపూజితా! చిఱుతప్రాయమునన్ మృదు వైనవెన్నయుం
బెరుఁగును గొల్లయిండ్లకడ వేడ్కహరించుచు నంతకంతకున్
హరణ మొనర్పఁ జాలితి మహాకఠినం బగుపాతకంబులన్
స్థిరకరుణానిధీ! విమలధీ! సుగుణోదధి! పార్థసారథీ!

చ. చిఱుచెమట ల్ముఖాబ్జమునఁ జెమ్మగిలంగ రణాంగణంబునం
దరదపువారువంబులకు నంబులు వెట్టుచు నేదఁ దేర్చి గ్ర
మ్మఱ నమరించుచున్ విజయుమన్ననఁ గాంచినవేల్పు వీవె కా
స్థిరకరుణానిధీ! విమలధీ! సుగుణోదధి! పార్థసారథీ!

చ. దురమున నేఁడు భీష్ము నిదె త్రుంచెద; మంచెదఁ బార్థు నంచు భీ
కరగతిఁ గేలఁ జక్రమును గైకొని వీఁక నిలాతలంబుపై
కుఱుకుట కై కడంగుభవదుజ్జ్వలమూర్తియ కీర్తనీయ మౌ
స్థిరకరుణానిధీ! విమలధీ! సుగుణోదధి! పార్థసారథీ!

చ. సిరి కిది పుట్టినిల్లు బహుజీవనరాశికిఁ బ్రాపు భూమిభృ
ద్వరతతి కున్కిపట్టగుట వారిధి యంచుఁ దలంచియో చుమీ

పరమకుతూహలంబునను వాసము సేసితి విస్ఫురంబునన్
స్థిరకరుణానిధీ ! విమలధీ ! సుగుణోదధి ! పార్థసారథీ !
చ. సిరివిరిబోణి పాణిసరసీజయుగంబున మెల్లమెల్లనం
జరణము లొత్తఁగా నమృతసాగరమధ్యమునందుఁ జిల్వరా
పఱుపునఁ బవ్వళించియుఁ బ్రపంచము నేలెదు జాగరూకతన్
స్థిరకరుణానిధీ ! విమలధీ ! సుగుణోదధి ! పార్థసారథీ !
క. అని వా రనివారితభ
క్తిని వారక పార్థసారథిస్వామి నిటుల్
గొనియాడి యభీష్టము లి
మ్మని వేఁడి ముదబ్ధి నోలలాడిరి మిగులన్. 133
క. లోచనములు దవియఁ దదా
సేచనకాకార మెలమిచే మఱి మఱియున్
జూచుచు నటనుండి మహీ
ఖేచరదాంపత్య మెట్టకేలకు వెడలెన్. 134
చ. వెలువడి వారు చేరువను బేరువహించినయొక్కసత్రమం
దలరువితర్ది మత్కుణగణావృతవేణుకలింజకోపరి
స్థలమున నాత్మబాహు లుపధానముగా నిదుర న్మరంగి రాఁ
కలి రుచిసొంపు నిద్దుర సుఖస్ఫురణంబు నెఱుంగ నేర్చునే ?
క. అలయుటచేఁ బయనంబున
సొలయుటచేఁ దీర్ఘసేవఁ జొక్కుచు వారల్
దెలుపఁగ రానిసుఖోన్నతి
వెలయఁగ నిదురింపుచుండ వేకువవేళన్. 136

సీ. అరకంటిమాడ్కిఁజే నఖిలసంపద లిచ్చు
చెలువతో బంగారువలువతోడ
మిసమిస మనుకప్పువస నొప్పుచక్కని
రూపుతో దయఁ జిల్కుచూపుతోడ
మాణిక్యమయదివ్యమకుటప్రశస్తమ
స్తంబుతో నభయహస్తంబుతోడఁ
గమ్మకస్తురిబొట్టు గలఫాలభాగంబు
గోముతోఁ జిఱునవ్వుమోముతోడ
సురుచిరానంతనిస్తులశుభగుణుండు
గర్భసంభృతనిఖిలజగద్గణుండు
రవిశతనిభుండు పార్థసారథివిభుండు
కరుణఁ గనుపట్టె నతనిముంగలను గలను. 137

క. కల నిటులు శౌరి వారికిఁ
గలయఁగఁ గనుపట్టి మీకు ఖ్యాతి నెసంగం
గలకొమరుఁ డొకఁడు గలుగం
గలఁ డని వచియించి యపుడె కన్మొఱఁగుటయున్. 138

క. మేల్కాని సతిఁ గని ముద మెదఁ
గీల్కొన మన కింకఁ గడలికిం జన నేలా ?
చిల్కలకొల్కి ! యనుచుం
బల్కి యతఁడు మరలెఁ దనదుపట్టనమునకున్. 139

క. ఇంటికిఁ జని ద్విజమణి వా
ల్గంటిం గని యనియె నిటులు గమలదళాక్షిం

గంటిమి కద మున మొదవఁగఁ
గొంటిమి గద యతనివలనఁ గోరినవరమున్. 140

ఉ. కావున నింక శంక విడి కంజముఖీ సుఖలీల నుంద మా
మావిభుఁ డీప్సితం బిడక మానఁ డటంచు వచించి వైభవ
శ్రీ వెలయన్ మెఱుంగునెడఁ జెచ్చెర నచ్చపలాక్షి కయ్యెడన్
వేవిళు లంకురించెఁ బృథివీసురశేఖరుఁ డుల్లసిల్లఁగన్. 141

సీ. శేషాంశ ముదరసంస్థిత మౌటఁ దెల్పుకై
వడి నాననము దెల్లఁబాఱఁ జొచ్చె
హరిమతం బిటమీఁద నంతకంతకును వ
ర్ధిలు నాఁగ నడుము పెంపలరఁ బూనెఁ
గుటిలవాదులమోము లిటు లుండఁ గలవు నాఁ
జనుమొనల్ నలుపెక్కఁ దనరఁ దొడగెఁ
బ్రజ కిట్టు లిఁక భక్తిపారవశ్యము తోఁచు
ననుమాడ్కిఁ గూర్కు దార్కొనఁ గడంగె
నఖిలలోకైకకవినుతదివ్యప్రభావ
శాలి యగుపార్థసారథిస్వామివారి
వరము సఫలత నెనయ గర్భమును దాల్చి
రహిని బొల్చెడుభూమిపిరాట్టి కపుడు. 142

క. ఒడలికి బడలిక లెంతేఁ
గడలుకొనెన్ జిలుఁగువలువ కడు బరువయ్యెన్
నడవఁగ నోపిక యైనం
బడఁతికి లేదయ్యె నెలలు మసలుటకతనన్. 143

గీ. అంతకంతకు నిర్భరం బై తనర్చు
గర్భభరణాలసత్వంబు గడలుకొనఁగ
నన్నిపనులకు విన్న నై యతివ మెలఁగె
నెలలు తొమ్మిదియును నిండి నెగడుచుండ. 144

సీ. వసుచంద్రవసుమతీవనధిసంఖ్యాక మై
దనరారుకలియుగాబ్దంబునందుఁ
జనెడుపింగళనామసంవత్సరమునందు
మధువేళఁ దగు చైత్రిమాసమునను
శుద్ధపంచమినాఁడు సురగురువారంబు
నను గర్కటాఖ్యలగ్నంబునందు
హిమధాముఁ డార్ద్రియం దమర భూరిశుభావ
హంబు లై యెల్లగ్రహంబు లెసఁగ
నఖిలవేదాంతవిదుఁడు శేషాంశమునను
బొడమె భూమిపిరాట్టికిఁ బుత్త్రిఁ డొకఁడు
జగతిఁ గౌసల్యకును రామచంద్రునట్లు
దేవకీదేవి కలవాసుదేవులీల. 145

శా. ఆవార్త న్వినినంత సంతసముచే నాభూసురాగ్రేసరుం
డావిర్భూతనిరంతరప్రచురరోమాంచప్రపూర్ణాంగుఁ డై
కావించెన్ వసుధాసుధాశనులకుం గన్యాహిరణ్యాలయ
క్ష్మావస్త్రాన్నసువర్ణగోధనవిభూషాముఖ్యదానంబులన్. 146

క. నానావిధకల్యాణా
నూనాసమదివ్యలక్షణోపేతుం డౌ

యానందమునిం గనుఁగొని
యానందరసాబ్ధి నోలలాడిరి వారల్. 147

గీ. ద్యుమణితేజుండు భాగినేయుండు దనకుఁ
బొడమె నని విని శ్రీశైలపూర్ణుఁ డపుడు
కదలి శ్రీభూతపురికి సమ్మదము గదుర
నేఁగుదెంచెఁ గుటుంబసమేతముగను. 148

క. చెల్లెలిగృహమున కాద్విజ
తల్లజుఁ డేతెంచి బాలతపనునిగతి శో
భిల్లెడుమేనల్లుని గని
యుల్లమునను సంతసిల్లి యుప్పొంగెఁ గడున్. 149

ఆ. పురుడు పురుడులేనిభూరిసౌఖ్యస్ఫూర్తిఁ
గడవ నుడువరాస్య కడరువేడ్క
జాతకర్మవిధులు ఖ్యాతధర్మవిధాన
లీల సలిపి రపుడు బాలకునకు. 150

క. శ్రీమల్లక్షణలక్షితుఁ
డై మెఱయుట సత్కళాఢ్యుఁ డై శోభిలుటన్
రామానుజుఁ డని విప్ర
గ్రామణి తనయునకు నామకరణ మొనర్చెన్. 151

శా. అన్నప్రాశనచౌలముఖ్యవిధు లయ్యైవేళలన్ వేడుకల్
చెన్నారన్ నిగమోక్తపద్ధతి నొనర్చెన్ సర్వబంధూత్కరం
బెన్నం జిన్నికుమారరత్నమున కెంతే భూరిసాద్గుణ్యసం
పన్నత్వంబున మించునద్ధరణిగీర్వాణాగ్రగణ్యుం డొగిన్.

క. ద్విజరాజవాహసదృశుఁడు
ద్విజరాజకళావిలాసవిభ్రాజితుఁడున్
ద్విజరాజాంశజుఁ డగునా
ద్విజరాజాత్మజుఁడు వరుస ద్విజత వహించెన్. 153

క. జలరుహహితతేజుం డై
యలఘూజ్జ్వలదివ్యలక్షణాస్పదుఁ డై భా
సిలులక్ష్మణాఖ్యుఁడు గడుం
దలిదండ్రులకున్ ముదం బొనర్చుచు మఱియున్. 154

చ. పలుకఁగఁ బూనునాఁడె మధువైరిమహామహిమానుభావముం
బలుకఁగఁ బూనె నివ్వసుధపై నడువంగఁ గడంగునాఁడె కే
వలనయమార్గమందు నడువం గడఁగెం గడు వేడ్క నెమ్మది
న్దలకొన నాడనేరిచిననాఁడె హరిం గొనియాడ నేరిచెన్.

సీ. గోవిందభక్త్యనుగుణములు గుణములు
మహితభాగవతానుమతము మతము
పరమశాంతరసానుభావంబు భావంబు
పృథులవిష్ణుస్తవావృత్తి వృత్తి
హరిసపర్యావిధాకరములు కరములు
వైకుంఠభజనానుభవము భవము
వరతీర్థసేవనాచరణముల్ చరణము
లురుతరన్యాయసంయుక్తి యుక్తి
గలుగు నెవ్వాని కట్టియీకందు కనఁగ
నహివరేణ్యుండొ ? సైన్యనాయకుఁడొ ? యనుచు

నెల్లచూపఱు గొనియాడ నెసఁగుచుండె
నన్యరామానుజుండు రామానుజుండు. 156

క. మాతాపితృశాసనము వి
నీతిగ నౌదలను బూని నెఱపుచునుంటన్
ఖ్యాతి గనుచుండె నాతఁడు
భూతలమున జామదగ్న్యముఖ్యులకంటెన్. 157

ఉ. దీనదయాళుఁ డూర్జితుఁ డుదీర్ణగుణప్రకరాంబురాశి ప్ర
జ్ఞానిధి సత్యసంధుఁడు ప్రశాంతుఁడు దాంతుఁడు ధీరుఁ డుత్తమ
జ్ఞానధురీణుఁ డార్యనుతచర్యుఁ డుదారుఁడు నైయెసంగురా
మానుజువర్తనంబుఁ గని యందఱునుం గొనియాడకుందురే?

మ. మృదుపూర్వస్మితభాషణంబునకు గాంభీర్యోచ్ఛ్రయంబున్ స్తవా
స్పదమై యొప్పుకలానిరూఢికిని బ్రజ్ఞాచాకచక్యంబు శో
భ దగం గూర్పఁగ నోయగంబునకు లావణ్యంబు సుశ్రీ నిడం
బదియాఱేఁడులప్రాయ మాతని కౌగిం బ్రాప్తించి దీపించుటన్.

క. కనుఁగొని జననీజనకులు
తనయునకుం బెండ్లి సేయఁ దగు నిప్పుడె యం
చనుపమకులరూపాదుల
ననువగుకన్నియ నొకర్తు నారసి వేడ్కన్. 160

క. కలదానికొలఁది వైభవ
మలరఁగఁ బరిణయ మొనర్తు నధికంబుగ న
ప్పులఁ జేసి పరుగులిడఁ దగ
దలవియె తుదముట్టఁ దీర్ప కవి పోఁగొట్టన్. 161

క. అప్పులును శత్రుగణములు
నిప్పులు నిశ్శేషలీల నిర్మూలముగాఁ
జొప్పడఁగింపనిచో నవి
ముప్పిరిగొని ప్రబల కున్నె మఁన్నిటికంచెన్. 162

క. మనమునయందిట్లనుకొని
తనకుం గలకలిమిఁబట్టి తగువైభవముం
దనరఁగఁ గొమరునిపరిణయ
మొనరిచె నాసోమయాజి యుత్సాహమునన్. 163

క. లక్ష్మణుఁడు రక్షమాంబా
పక్ష్మలనేత్రన్ వరించి పదపడి విద్యల్
సూక్ష్మసమబుద్ధి నశే
షక్ష్మవరవరులు మెచ్చఁ జదువుచు నుండన్. 164

క. హరికృపచే సౌఖ్యపరం
పర లెల్లం గని గృహస్థభావోచితస
త్కరణీయంబులఁ దీరిచి
స్మరణీయావస్థ నతనిజనకుఁడు గాంచెన్. 165

క. తనయుని గాఁగ ననంతునిఁ
గనియుండుట సోమయాజి కడు సులభముగం
గనియె ననంత మనాద్యం
బనఘంబును శాశ్వతంబు నైనపదంబున్. 166

చ. పదపడి లక్ష్మణార్యుఁ డటుపైఁ దనచింతను జ్ఞానవైభవా
స్పద మగుసద్వివేకపరిపాకమునం బెడఁబాపికొంచుఁ ద

త్తదుచితకృత్యము ల్విధివిధానమున న్నెఱవేర్చి యాదటం
గదలక కొన్నినా ళ్లచటఁ గాలమువుచ్చెఁ గుటుంబయుక్తిగన్.

క. సంతతము నచటిసంఖ్యా
వంతులకడ వేదములను బహుశాస్త్రములన్
సాంతముగఁ జదివి చదివియు
నంతటితోఁ దృప్తి దీర కాతఁడు పిదపన్. 168

చ. సకలకలాస్పదుం డఖిలశాస్త్రధురీణుఁ డధీతిబోధన
ప్రకటితకీర్తిశాలి బుధవర్గశిఖామణి యాదవప్రకా
శకుఁ డనుపేర నొప్పుయతిసత్తముఁ డొక్కఁడు కాంచికాపురిన్
బ్రకృతిసుశీలుఁ డుండె ననువాడుక వేడుక నాలకించుచున్. 169

క. గురుసదృశప్రజ్ఞానిధి
గురుతరపరతత్త్వబోధకుఁడు కుసుమధను
ర్గురుతుల్యుఁ డై నయాతఁడె
గురుఁడుగ నే విద్య లెల్లఁ గొనసాగింతున్. 170

క. ఈరీతి నిశ్చితాత్ముం
డై రామానుజసమాఖ్యుఁ డతివను దల్లిం
గూరిమిని దోడుకొని శ్రీ
పేరుంబూదూరనుండి వెలువడి పిదపన్. 171

చ. అలఘుకలాకలాపకసమభ్యసనోత్సుకవృత్తి నీగతిన్
వెలువడి లక్ష్మణాఖ్యపృధివీసురమౌళి కుటుంబశాలి యై
బలువిడి నేఁగి యేఁగి యట వారణశైలనితంబకాంచి యై
యలరెడుకాంచిఁగాంచికొనియాడెనిటుల్ పులకాంచితాంగుఁడై.

ఉ. బాపురె గోపురాలపరిపాటి; శబాసు! శతాంగశిల్పనా
టోపకలావిలాసము; పటుస్ఫుటదైవతగేహలీల లౌ
రా! పరిపూర్ణతీర్థనికరస్ఫురణాతిపవిత్రతాప్తి యా
హా! పురి రాజవీథులయొయార మయారె! వినోద మయ్యెడిన్.

సీ. ఏకామ్రనాథుఁ డస్తోకలోకాతిగా
శ్చర్యచర్యాఢ్యుఁ డెచ్చట వసించుఁ
గామాక్షి యక్షీణకవనధాటీప్రదా
నైకసామర్థ్య దా నెచట నుండు
వరదరాజస్వామి వరదయారసలస
న్మానసాంభోజుఁ డెచ్చో నెసంగుఁ
గచ్ఛపేశ్వరముఖ్యఘనదేవతాకోటి
సురుచిరలీల నెచ్చోట నిలుచు
మఱియు నెచ్చోటునందు గంపాస్రవంతి
వేగవతియును బ్రవహించు వృజినహంత్రి
నట్టియిక్కాంచికాపురి నభినుతింపఁ
దరమె నావంటివాని కాదర మెలర్ప. 174

చ. అని కొనియాడియాడి యతఁ డక్కడ నొక్కెడ వాసయోగ్యమై
పనుపడి శుభ్రలీలఁ దగుభాసురభూసురమందిరంబునం
దనవనితావతంసమును దల్లియు నియ్యకొన న్వసించె స
జ్జనులకు నందు నిం దనక సౌఖ్యముచేకుఱుఁ గాదె యెందులన్.

చ. అకలుషశీలుఁ డైనయతఁ డచ్చట నిట్లు వసించియుండి పా
యక సహపాఠులం గలసి యత్యధికుం డగుయాదవప్రకా
శకునిసమక్షమం దఖిలశాస్త్రములం బఠియింపుచుండె బు
ద్ధికుశలతాపరిస్ఫురణ దేటపడం గడు నిచ్చ నిచ్చలున్. 176

క. అతిదీనమనుజరక్షా
వ్రతదీక్షాముఖ్యసుగుణరత్నసముదయా !
వితతదయాన్వితహృదయా !
యతులితనయవినయ ! మంగయాంబాతనయా ! 177

మ. పరకాంతాధననిస్పృహైకహృదయా ! ప్రఖ్యాతనీతిక్రియా !
సరసాశేషవిశేషకావ్యపటలీసంపూర్ణగోష్ఠిప్రియా !
హరిదంభోజముఖీపయోధరతటీహారప్రకాండన్మనో
హరకీర్త్యుచ్ఛ్రయ ! రామరాడ్విభువరేణ్యాగణ్యపుణ్యోదయా !

మాలినీవృత్తము. సకలసుజనపాలా ! సత్యసంసక్తశీలా !
చకితరిపుసమాజా ! సత్కళాభోజరాజా !
ప్రకటగుణకలాపా ! రావువంశప్రదీపా !
సుకవివినుతిపాత్రా ! సూర్యరాయేంద్రపౌత్రా !

గద్యము.

ఇది జానకీరమణచరణారవిందమిళిందాయమానమానసభావుక
రావుకులతిలకసూర్యరాయభూమండలాఖండలసమగ్రాను
గ్రహపాత్రకౌండిన్యసగోత్రపవిత్రదేవులపల్లివంశ
సంభూతసీతారామశాస్త్రివిద్వన్మణిపౌత్రవేంకట
కృష్ణశాస్త్రీంద్రపుత్రసుబ్బరాయసుధీవర
సోదరతమ్మన్నశాస్త్రిప్రసిద్ధాభిధానాం
తరవిబుధజనవిధేయవేంకటకృష్ణ
శాస్త్రినామధేయప్రణీతంబైన
యతిరాజవిజయమునఁ
బ్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ.

# యతిరాజవిజయము.

## ద్వితీయాశ్వాసము.



శ్రీకర ! బహుభాగ్యాతిశ
యాకర ! పీఠపురమండలాఖండతరా
ధీకారకరణనిపుణ !
ప్రాకటనయధుర్య ! సూర్యరాట్ప్రభువర్యా ! 1

క. అవధారు లక్ష్మణార్య
ప్రవరుం డటు లఖిలశాస్త్రపారగుఁ డయ్యున్
బ్రవిమలమతి యాదవయతి
సవిధమునఁ దదర్థములనె చదువుచు నుండెన్. 2

ఉ. ఆయెడ నప్పురీవరము నర్మిలిఁ బాలనసేయుమేదినీ
నాయకలోకమౌళిప్రియనందినినిన్ ధరణీసుపర్వుడై
తేయుఁ దొకండు వట్టికొని దెప్పర మై తగుముప్పుదిప్పులన్
రాయిడిఁ బెట్టుచుండెను గరంబు గనుంగొనువారు చింతిలన్.

సీ. ఘనతపస్థితి నహంకారంబుపోలిక
సంపన్నత నసూయచందమునను
వరవదాన్యతను నిష్ఠురభాషితముభంగి
సరసవిద్యను మేటిగరువమట్లు
వైరాగ్యమును భేదభావంబుమాడ్కిc
బృథురాజ్యరమను దుర్నీతిరీతి
గౌరవోన్నతిని యాచ్ఞారూఢికైవడి
యోగ్యశీలత నసత్యోక్తిలీల
రమ్యసుకుమారగాత్రి యారాజపుత్త్రి
నకట ! విప్రనిశాచరుం డాశ్రయింపc
బెంపు సొంపును జెడి కృశియింపcదొడcగె
నార్తి నొందుచు నానాcటి కవ్వదూటి. 4
శా. ఆవీ డేలునృపాలుc డట్లు తనకన్యారత్న మెంతే పిశా
చావేశంబునc బీడ నందc గని చింతాక్రాంతచేతస్కుc డై
రావించెం బటుభూతశాస్త్రకలనాప్రావీణ్యగణ్యత్వము
న్దైవారంగ మెలంగుమాంత్రికుల నానాదేశసంవాసులన్. 5
క. ఆమాంత్రికవర్యులు నా
నామణిమంత్రప్రయోగనైపుణి ద్విజపూ
ర్వామరుని సముచ్చాటన
మేమియు నొనరింపలేక యేcగిరి లజ్జన్. 6
ఉ. ఎందఱో భూతవైద్యు లిటు లేcగి కడున్ విఫలప్రయత్నులై
కుందుచు వెండియున్ జనుటకు న్వెతనొంది నృపాలుc డాదటన్

బొందుగ వేఁడుకొంచు యతిముఖ్యుని యాదవదేశికేంద్రు నా
నంద మెలర్ప నాత్మసదనంబునకుం గొనిపోయి చయ్యనన్.

క. తనదుకుమారిం జూపఁగఁ
గనుఁగొని యాయాదవప్రకాశకుఁడు మహా
ఘనమంత్రముల జపించుచుఁ
జనె నాసతికడకు శిష్యసంఘముతోడన్. 8

క. చనుఁ గడుదూరముగా నె
వ్వనినామము విన్నతోడ బలుభూతంబుల్
ఘనుఁ డగునయ్యాదవుఁ డొ
య్యన నొనరిచె బ్రిహ్మరాక్షసాహ్వానంబున్. 9

క, అటువలె నాహ్వానంబుం
జటులతఁ గావింప నప్పిసాచి రదంబుల్
పటపటఁ గొఱుకుచు నత్యు
త్కటమగులయసమయమేఘగర్జాస్ఫూర్తిన్. 10

క. హుంకారపూర్వకంబుగ
శంకారహితప్రవత్తి జానొంద నిరా
తంకారభటిం బలికె న
హంకారము మీఱ నిట్టు లయ్యతితోడన్. 11

శా. ఔరా! నీ వన నెంత? నం దొలఁగఁజేయన్ మాంత్రికాగ్రేసరుల్
రారే? పెక్కురు, పోవరే? మరలి వారల్ నిష్ఫలారంభు లై
సారంబుం గలదేని నీమహిమ కస్మత్పూర్వజన్మస్థితిన్
ధీరత్వంబు దలిర్పఁ జెప్పఁగలవేనిం జెప్పుమీ నావుడున్. 12

క. వెలవెలఁబోవుచు వెఱ ప
గ్గల మగుడున్ యాదవప్రకాశపరివ్రా
ట్కులతిలక మూరకుండెం
బలుకంగా లేక మందమందాక్షమునన్. 13

చ. అది పరికించి యాద్విజనిశాటుఁడు యాదవదేశికున్ స్మయం
బెదఁ గదురంగఁ గాంచి మనయిర్వుర కీదృశజన్మహేతు వె
య్యదియొ యెఱుంగ వైతివిగదే యతిశేఖర ! యైన నేను దె
ల్పెద వినవయ్య ! నీ కనుచుఁ బేర్మి వచింపఁదొడఁగె నీగతిన్.

గీ. అలరు మధురాంతకం బనునగ్రహార
మవనిరమణీమణివరాగ్రహార మనఁగ
దానిపడమటిదెసను సొంపూను చుండె
నొకతటాకంబు పథికోపయోగముగను. 15

క. ఆకొలనిగట్టునం గల
నాకువునం దుడుమురూపున న్మెలఁగెడునీ
వాఁకటిచే భుజియించితి
చేకొని భాగవతభుక్తశేషాన్నంబున్. 16

గీ. వేదవేదాంతవిదుఁడును విష్ణుభక్తుఁ
డయినవిప్రునియుచ్ఛిష్ట మలరి తినుట
వలన గోధాస్వరూపంబు దొలఁగి పీకుఁ
బ్రవిమలం బగునిట్టిపుట్టువు లభించె. 17

క. మున్నిటిపుట్టువునన్ బుధు
లెన్నందగునొక్కవిప్రునింటఁ బొడమి నే

నెన్నియొ విద్యల నేరిచి
జన్నం బున్నతి దలిర్ప సలిపెడివేళన్. 18

గీ. ఓయి యాదవ ! విను దైవయోగమునను
మంత్రలోపంబు లమ్మహామఖమునందుఁ
గలుగుటనుజేసి నాకు నీగర్హ్యమైన
బ్రహ్మరక్షస్స్వరూపంబు ప్రాప్తమయ్యె. 19

క. ఇఁక శ్రేయము లందెడుకో
రిక నీకుం గలిగెనేని శ్రీలక్ష్మణదే
శికమౌళి నాశ్రయింపుము
ప్రకటతరానందలీలఁ బరఁగెదు దానన్. 20

శా. నాఁటంగోలె ననేకభూమిభృదరణ్యానీపురానీకముల్
పేఁటల్ దోఁటలుకోటలున్ మొదలుగాఁ బెంపెక్కునెన్నేనియుం
జోటుల్ గాంచి పరిభ్రమించి తుదకున్ జొత్తెంచి వీక్షించితిన్
గాటం బౌసొబ గొప్ప మెప్పుఁగనునిక్కాంచీపురోద్యానమున్.

క. కాంచిపురోద్యాన మటుల్
గాంచి యచట మసలురాజకన్యన్ దీనిన్
మించినమోహమునన్ గా
మించి వెసం బట్టికొంచు మెలఁగుచు నుంటిన్. 22

చ. నను విడిపింప నీయవనినాథునియానతి మాంత్రికాగ్రణుల్
పనివడి వచ్చి బీతుకొని పాఱి రనేకులు విప్రయత్నులై
మునుకొని నీదుమంత్రమణిముఖ్యము లేమియుఁజేయనోప వో
యనఘచరిత్ర ! యింకవినుమాయనుమానముమాని నానుడుల్.

సీ. ఊషరక్షేత్రమం దునుచుబీజములట్లు
భస్మాన నించుహవ్యమువితానఁ
గడఁగి యపాత్రమం దిడెడుదానముభంగిఁ
జెడువానియెడ సల్పుచెలిమికరణి
నవివేకి కెఱిఁగించుకవితారసములీల
మరుభూమిఁ బడువానమాదిరిగను
గృత మెఱుంగనివానికి నొనర్చుమేలు నా
నెఱిదుష్టునకుఁ దెల్పునీతిరీతిఁ
బేరు కెక్కినఘనమంత్రవేత్త లెల్లఁ
బటిమ వెలయంగఁ బూని నాపైన నెఱపు
భూరిమంత్రప్రయోగముల్ సార మెడలి
వ్యర్థతను జెందు నోయాదవార్యవర్య! 24

క. వాసిగను దావకాంతే
వాసిగణములోన నొక్కబాలుఁ డఘంబుల్
వాసి గణింపఁగ నిప్పుర
వాసి గలం డసదృశప్రభావాస్పదుఁ డై. 25

క. రామానుజుఁ డనునామము
చే మానుగ నొప్పు నతఁడు శ్రీపాదమునన్
నామేను సోఁకుచుం బద
తామరసోదక మొసంగి దయ దఱకొత్తన్. 26

గీ. పొమ్ము పొ మ్మని పలుక నిమ్మద్దుగుమ్మఁ
దక్షణమునందె విడిచి నేఁ దలఁగువాఁడఁ

గాన వేగాన నీవు నిమ్మానవాధి
పతియు నట్టు లొనర్ప నేర్పఱుపవలయు. 27

సీ. అనుడు భూవరుఁడు రామానుజార్యునిచెంత
కరిగి తా నడుగుఁదామరల కెరఁగి
వినయంబు గదుర నవ్వృత్తాంత మంతయుఁ
దెలిపి ర మ్మనుచుఁ బ్రార్థింప నతఁడు
సహపాఠులను గూడి సరగున నరుదెంచి
కనికరంబు కరంబు గడలుకొనఁగఁ
దనపదాబ్జముల నత్తరుణిమై నోఁకుచు
శ్రీపాదతీర్థ మర్మిలి నొసంగి
గచ్ఛ గచ్ఛ యటంచుఁ బల్కఁగనె బ్రహ్మ
రాక్షసుఁడు తొంటితనువును రాజసుతను
వదలి దివ్యశరీర మేర్పడ విమాన
మెక్కి దివి కేఁగె నచ్చర లెలమిఁ గొలువ. 28

సీ. ఋణబాధ దొలఁగినగృహమేధితెఱఁగున
నిరులు పాసినవిభావరివితాన
రాహుముక్తుండైనరాకావిధునిమాడ్కి
క్షామంబు విడినదేశంబుపగిదిఁ
బ్రతికూలుఁ డగుమంత్రి వదలిననృపురీతి
భవబంధరహితుఁ డౌప్రాజ్ఞుకరణి
దారిద్ర్య మెడలినదానశీలునిలీల
నపవాద ముడిగినయార్యుభంగిఁ

గాలసముఁ డైనబ్రహ్మరాక్షసునివలన
విడువఁబడినట్టియమ్మహీవిభునిపట్టి
యనుపమం బగుస్ఫురణచే నలరఁ జొచ్చె
నంతకంతకు నుల్లాస మతిశయిల్ల. 29

చ. అపుడు వసుంధరాధిపుఁడు స్వాంతమునం గడుసంతసిల్లుచున్
విపులతరాదరస్ఫురణఁ బెంపువహింపఁగ లక్ష్మణాఖ్యుఁ జొ
క్కపుఁగనకాభిషేకమున గౌరవముం దొలుదొల్తఁ జేసి ని
ష్కపటమనీష యాదవునిఁ గ్రన్నన మన్ననచేసె నాదటన్.

క. రామానుజసుజనౌఘ
గ్రామణి తనపారితోషికముఁ గూడ సము
ద్దామ మగుభక్తి యాదవ
నామకగురుసార్వభౌమునకు నర్పించెన్. 31

క. అదిరా ! య ట్లొసఁగిననుం
బదపడి యాదవుఁడు స్వావమతి కోర్వమిచే
నది మొదలుగ లక్ష్మణుపై
మదిఁ బూనుచునుండె దీర్ఘమాత్సర్యంబున్. 32

సీ. అంతట రామానుజార్యచర్యావిశే
షాదు లాలించి నెయ్యమున నతని
పినతల్లి యైనట్టిపెరియపిరాట్టికి
నందనుం డైనగోవిందమిశ్రుఁ
డనువాఁడు జనయిత్రియనుమతి వడసి చ
య్యనఁ గాంచికాపురి కరిగి యచటఁ

ప్రతిభ మీఱఁగ యాదవప్రకాశకునొద్దఁ
దత్త్వవిద్యాసాంప్రదాయములను
దెలిసికొనుచున్నదనయన్న నెలమిఁ గాంచి
వానికడలేనిప్రేమకుఁ బాత్రుఁ డగుచుఁ
దాను నగ్గురువరుసన్నిధానముననె
కడు వినీతిగ శాస్త్రముల్ గఱచుచుండ. 33

క. సత్యశ్రుతికై యాదవ
యత్యగ్రణి యొక్కనాఁ డపార్థము దెలుపం
బ్రత్యయరహితుం డై యిటు
లత్యుద్ధతి లక్ష్మణార్యుఁ డనె నాతనితోన్. 34

శా. శ్రుత్యర్థప్రతిపాదకంబు లగునాసూక్తు ల్వినంగాఁ దగున్
సత్యజ్ఞానముఖంబు లౌవచనము ల్సర్వేశునుద్యద్గుణౌ
న్నత్యంబుల్ విశదైకలీల నెపుడు న్వాక్రుచ్చు నీ కేల యో
యత్యగ్రేసర ! వేదవాక్కుల కపార్థాపత్తిఁ గల్పింపఁగన్.

క. రామానుజుఁ డి ట్లాడిన
యామాటల నాలకించి యాదవగురుచూ
డామణి కలిసమ్మోహితుఁ
డై మరల వచించె ని ట్లహంకారమునన్. 36

క. ఓరి గురుద్రోహపరా !
యోరి శఠస్వాంత ! యోరి యురుదుర్మతి ! మా
కోరి ! గురుండవా ? కా కీ
వోరీ ! మఱి శిక్షకుండవో ? తెలుపుమురా ! 37

క. ధూర్జటిగతిఁ దగుయాదవుఁ
దూర్జితమతి యైనలక్ష్మణోర్వీసురునిన్
దుర్జనునింబలెఁ జూచుచుఁ
దర్జనభర్జన మొనర్చెఁ దద్దయుఁ గినుకన్. 38

క. పిమ్మట రామానుజగురుఁ
డుమ్మలికము మాని స్వగృహ మొగిఁ జొచ్చి యజ
స్రమ్మును మును చదివినకో
శమ్ములఁ దా మరల మరలఁ జదువుచునుండెన్. 39

మ. అనఘుండై తగులక్ష్మణాఖ్యుఁడు స్వకీయాచార్యుఁ డౌయాదవా
ర్యునియాగారము నప్పుడిప్పగిదిఁ దా నొక్కుమ్మడిన్ వీడి యొ
య్యనఁ బ్రజ్ఞాతిశయం బెలర్పఁగను వేదాంతార్థతత్త్వవలో
డనలోలాత్మకుఁ డౌచు నుండెఁ దనయింటన్ స్వస్థచిత్తంబునన్

ఉ. అంతట నొక్కనాఁ డనుపమాగమధుర్యుఁడు యాదవార్యుఁ డే
కాంతమునందు నాప్తవరులై తగుశిష్యులతోడఁ గూడి య
త్యంతవిషాదఖిన్నమతి యై యతి యయ్యును మత్సరత్వమున్
స్వాంతమున న్వహించుచు నొనర్చెను మంతన మివ్విధంబునన్

చ. అనువుగ నొప్పుశిష్యవరులార ! సుధీవరకోటిలోన నే
ననుపమకీర్తిశాలి నయి ఖ్యాతిగ నుండుట వాదగోష్ఠులన్
బనుపడ గెల్చి కాని యవమాన మొకప్పుడు లేక వీకమై
వినుతి వహించి మించుటయు వేడుక మీఱఁగ మీ రెఱుంగరే.

సీ. వేదవేదాంతప్రవీణు లంతర్వాణు
లెల్ల పెద్దగఁ జూతు రల్ల మలర

నెవ్వాని నట్టిసే నేమిచెప్పెడువాఁడ
నల బ్రహ్మరాక్షసువలన నాఁడు
వేడుక నెల్లరు వీక్షించుచుండఁగాఁ
గాంతిమతీసూనుకట్టెదుటను
బరిభవింపఁగఁబడి తరయ నంతటికంటె
వంత యున్నదె మానవంతులకును
స్వల్పవిద్యాన్వితుండును బాలుఁడు నగు
నాదుశిష్యునిగౌరవోన్నతియు మామ
కావమతియును గనుఁగొని భావమునను
సతము వెత నందుచుంటి నోచ్ఛాత్రులార! 43

క. ప్రతిభ వెలంగఁగ గ్రంథ
ప్రతతుల లక్ష్మణుఁడు నాదుపజ్జఁ జదివియున్
శ్రుతుల కపార్థంబును బ
ల్కితి నని నను దూఱుచుండుఁ గృత మేమరుచున్. 44

క. అహరహ మిటు లొప్పటచే
నహహా! యోశిష్యవర్యులారా! వినుఁ డి
మ్మహిఁ గేశవమఖితనయుఁడు
సహజప్రత్యర్థి యయ్యెఁ జయ్యన నాకున్. 45

ఉ. ఆతతవాక్పరిగల్భత ననంతుఁడు తేజున భాస్కరుండు ప్ర
జ్ఞాతిశయంబునన్ గురుఁడు నై యలరొందెడులక్ష్మణార్యుఁ డ
ద్వైతమతైకఖండనవిధాన మొనర్పఁగఁ బూనియే కదా
భూతలమందుఁ బుత్త్రుఁ డయి పుట్టెను గేశవసోమయాజికిన్.

క. వానికి హాని యొనర్పఁగఁ
బూనితి నది యిప్పు డెట్లుపొసఁగునొ యని నే
మానసమునఁ జింతించెద
నా నుడివిరి శిష్యులందునం గొంద ఱిటుల్. 47

క. ఓయాదవ ! యేదేనియు
పాయము నొకదానిఁ బన్ని వానికి హానిం
జేయఁగల మేల వగవఁగ
నీయెడ మావంటిశిష్యు లేర్పడి యుండన్. 48

చ. అనవుడు యాదవార్యుఁ డిటు లాడెను శిష్యులతోడ లక్ష్మణుం
బనిఁగొని యెద్దియే నొకనెపంబునఁ బిల్వఁగఁజేసి కాశికిన్
మునుకొని వానిఁ దోడుకొని పోయి త్రివేణికలోనఁ ద్రోసి వై
చినఁ బని తీరు దాన నిఁకఁ జేకుఱ దించుక యైనఁ బాపమున్.

ఉ. ఆపలుకుల్ ద్విజాత్మజులు సాంతముగా విని యాదవు న్నృశం
సాపరుఁ డౌదశాననునిశాచరులట్ల ప్రశంసనేసి స
ల్లాపకపూర్వకంబుగను లాలనముం బొనరించి లక్ష్మణుం
బాపవిదూరుఁ దోడికొనివచ్చి రొగిన్ గురుమౌళిపాలికిన్. 50

ఉ. వచ్చినలక్ష్మణార్యుఁ గని వంచకుఁ డౌయతివర్యుఁ డిట్లనెన్
మచ్చిక మీఱ నోద్విజకుమారక శిష్యుఁడ వౌట నిన్ను నేఁ
జెచ్చెర దూఱ నీకరణిఁ జేయఁగ నాయమె యింక నాకడన్
ముచ్చట దీర శాస్త్రములఁ బూర్తిగ నేర్చి సుకీర్తిఁ గాంచుమీ.

శా. అంతేవాసులలోన ముఖ్యుఁడవు నా కశ్రాంతమున్ స్వాంతమఁ
దెంతే నీపయిఁ గూర్మి కల్గుఁ గద నీ విచ్చోట లేనప్పు దే

సంతాపంబును జెందియుంటివిజుమీ సత్యమ్ముగా నమ్మి నా
చెంతన్ వీడక వేడుకన్ మెలఁగుమీ చింతావిహీనుండ వై.

గీ. ధరణిజంబులలోఁ గల్పతరువుకరణి
ధేనువులలోన నలకామధేనువట్లు
గిరులలోపల మేరుభూధరములీల
నెల్లశిష్యులలో ఖ్యాతి నెసఁగఁ గలవు. 53

గీ. క్షితిఁ బయోముఖవిషకుంభగతి మెలంగు
యాదవార్యునివిషమిశ్రితామృతోప
మంబు లగునన్నుడు ల్నమ్మి మరలఁ దొంటి
యట్ల పఠియించుచుండె రామానుజుండు. 54

మ. అనువొప్పన్ యతిసార్వభౌముఁ డొకనాఁ డాలక్ష్మణార్యాగ్రణిం
గని ప్రాక్రుచ్చె నిటు ల్ప్రయాగమున మాఘస్నానముం జేసినం
తనె యింతిం తన రానిపాపములు విధ్వస్తంబు లౌఁ గాన మే
మనఘా! పోయెదమయ్య! నీకభిమతంబై నన్వెసన్ రాఁదగున్.

గీ. అనుడు జనయిత్రియాజ్ఞఁ గైకొని యతండు
తనదువెనువెంట రాఁగ యాదవుఁడు వేగఁ
దరలె నప్పుడు శిష్యసంతతులతోడ
జగతి నుతికెక్కు కాశికానగరమునకు. 56

శా. ఆరీతిం దగ నందఱున్ వెడలి వింధ్యక్ష్మాధరప్రాంతకాం
తారాభ్యంతరసీమఁ జొచ్చి చనుచోఁ దద్యాదవాలోచిత

క్రూరప్రక్రియఁ దెల్పె లక్ష్మణునకున్ గోవిందమిశ్రాఖ్యుఁ డెం
తో రూఢంబగుసౌహృదాప్తి గురుముఖ్యుల్ ముందుపోఁ గాంచుచున్. [చున్.

క. గోవిందమిశ్రుఁ డన్నకు
నావిధముగఁ దెలిపి వారి నదె కలిసికొనం
గా వలయుఁ జాగరూకుఁడ
వై వర్తిలుమయ్య ! యింక నని చనియె వడిన్. 58

క. తా ని ట్లొక్కఁడె ద్యుతిమతి
సూనుం డేతేరఁ గాంచి చొక్కపుఁబ్రేమన్
బూనినగతి నయ్యతి రా
మానుజు విడనాడి వచ్చి తౌరా ! యనుడున్. 59

క. వానన్ మన మందఱ మీ
కానం జెదరితిమికా ! వికావిక లగుచున్
దానఁ దడిసి తడిసినమి
మ్మే మీగతిఁ జేరి తాతఁ డెటు వోయెనొకో ! 60

గీ. వానిజాడ యించు కైన నే నెఱుఁగను
యాదవార్యవర్య ! యనుచుఁ దెలుప
నిలుప రానివగపుగలవానివలె నిట్లు
పలికె గురుఁడు శిష్యవరులతోడ. 61

క. కూ్రిరమృగాధారం బై
ఘోరంబుగ నొప్పువింధ్యకుధరాటవిలో
మీ రెల్లయెడల లక్ష్మణు
నారసికొనివచ్చిరేని యలరెదను జుఁడీ ! 62

క. ఆమాటలు విని శిష్యులు
స్వామి ! యటు లేఁతు మనుచుఁ జయ్యనఁ జని తా
మేమేమో వెదకినయ
ట్లామెయి నటియించి వచ్చి యని రీరీతిన్. 63

క. కానఁ గడు వెదకి వెదకియుఁ
గానఁగలే మైతిమయ్య ఘనగుణుఁ బరభా
మానుజుఁ డై తగుమనరా
మానుజు నని తెలుప యాదవార్యుం డంతన్. 64

క. కుహనాకరుణారసమున్
బహువారము లపుడు పైకిఁ బ్రకటింపుచు నీ
గహనాభ్యంతరమున వాఁ
డహహా ! యే మయ్యెనొక్కొ ! యని చింతిల్లెన్. 65

చ. తనపని యి ట్లయత్నముగఁ దాన్కొనెఁ బేర్కొనఁజాలుగంగలో
మునుకలొనర్పఁగాఁగలుగుపున్నియము న్లభియింపఁబోలుఁగా
యని యతిమౌళి కౌతుకమునందుచు నెమ్మదిఁ బైకిఁ గుందుచున్
దనరుచు నుండె నిట్టివెకదా ! కుటిలాత్ములచేష్ట లెన్నఁగన్. 66

తరళ. అడవిలోఁ గపటాత్మకుం డయి యట్లు లక్ష్మణు నొంటిగన్
విడిచి యాదవసూరి నెమ్మది వేడుకం గడు మించుచున్
గడఁగి పైకి విచార మెంతయుఁ గల్గినట్లు నటించుచున్
గడపె నానిసి నందుఁ జాలసుఖంబుగా నిదురించుచున్.

ఉ. విప్రకులంబునం బొడమి వేదములన్ బహుశాస్త్రగోష్ఠులం
దప్రతిమానుఁ డై మెలఁగుయాదవదేశికువర్తనంబు క్రౌ

ర్యప్రచురంబుగాఁ దగు నహో ! భువి జాతియు విద్య లేల ? శీ
లప్రవిశుద్ధియేకద తలంపఁ బ్రధానము యోగ్యవృత్తికిన్. 68

చ. తనపినతల్లినందనుఁడు తద్దయుఁ గూరిమి నట్లు తెల్పి క్రి
న్ననఁ జనఁ దొంటిదారి విడనాడి యొకానొకభూరుహంబుక్రిం
దను వసియించి లక్ష్మణబుధప్రకరాగ్రణి సావధానుఁ డై
యనుపమభక్తి శ్రీహరిని ధ్యానమొనర్చుచు నుండె నాత్మలోన్.

శా. అంతన్ భక్తజనైకవశ్యుఁ డగునాహస్తిక్షమాభృద్విభుం
డెంతే వత్సలతన్ రమారమణితో నింపొందువ్యాధాకృతిన్
జెంత న్నిల్వఁగఁ జూచి లక్ష్మణుఁడు విస్మేరాప్తినోవ్యాధ! యీ
కాంతారంబునఁ గాంతఁ గూడి తిరుగంగాఁ గారణం బేమి నాన్.

మ. జనసంఘంబులు పేర్కొనం దగినయాసత్యవ్రతక్షేత్రముం
గన మే మేఁగుచు వచ్చినార మిట కీగాఢాటవీవాటి నిం
పెనయంగా వసియింప నేమిటికి నీ వెవ్వాఁడ వెచ్చోటికిం
జనుచున్నాఁడవు చెప్పు మన్న నతఁ డానందప్రపూర్ణాత్ముఁ డై.

క. కరిగిరివరదప్రభుఁ డీ
కరణిన్ శ్రీరమణితోడఁ గాపాడఁగ నన్
సరగున రాబోలును సు
స్థిరకృప నీవ్యాధదంపతీరూపమునన్. 72

క. కాకున్న వివిక్తం బౌ
నీకానకు నిప్పు డెవ్వఁ డేతెంచు నటం
చాకరణిం భావింపుచు
వాక్రుచ్చెన్ లక్ష్మణార్యవరుఁ డెఱుకు కిట్లన్. 73

గీ. కాంచిపురినుండి యాప్రయాగమును గాంచ
వెడలి యొకకారణంబున నడవి నిందు
నిలిచినాఁడను సాహాయ్య మలవడంగ
నెలమి వెండియుఁ గరిగిరి కేఁగువాఁడ. 74

చ. అనవుడు వ్యాధరూపధరుఁ డౌహరి లక్ష్మణుఁ గాంచి కాంచికిం
జనియెదమయ్య మేము నిదె చయ్యన నీవును రమ్మటంచుఁ దో
డ్తోని రవి గ్రుంకకుండఁగనెకోసెఁడుదూరముపోయియచ్చటన్
ఘనమగుమ్రానిక్రిందను సుఖంబుగ నుండిరి వారు మువ్వురున్.

ఉ. అంతటఁ గొంతరాత్రి యగునప్పుడు చెంచెత యైనయిందిరా
కాంత కిరాతవేషము దగం గనుపట్టెడుశౌరిఁ గాంచి నేఁ
గ్లాంతి దలిర్ప దప్పిఁగొని గాసిలుచుంటి జలంబుఁ దెచ్చి నా
కెంతయుఁగూర్మిచేనొసఁగుమీహృదయేశ్వర! యంచువేఁడినన్.

చ. చెలియరో! సజ్జనోత్తములచిత్తములట్లు వినిర్మలంబు లై
యలరుజలంబు లీనికటమందె యెసంగెడు నైన నేరికిన్
బలితపుఁగానలోఁ దిరుగ వచ్చునె యీనిసివేళ వేకువన్
బలువిడిఁ దెత్తు నంచు నలవ్యాధుఁడు పత్నికిఁదెల్పునంతలోన్.

క. వారిం గని లక్ష్మణుఁ డనె
వారిం గొనితెచ్చి వేకువన్ మీకుఁ దృషన్
వారింపఁగఁ దగుగతి న
వ్వారిగ నర్పించువాఁడఁ బ్రత్యుపకృతిగన్. 78

గీ. వార లామాట లాలించి వానిమీఁదఁ
బరమవాత్సల్యము వహించి పవ్వళించి

రచ్చటనె లక్ష్మణార్యుండు నడఁకు వొప్పఁ
దాను శయనించె భృత్యుచందాన నపుడు. 79

సీ. అంతకంతకు నాత్రియామ యామార్ధమా
త్రావశిష్టంబుగా నలరుచుండ
మాయాకిరాతకజాయాపతులు మేలు
కొని లక్ష్మణార్యుని గని వచించి
రదె ప్రభాతప్రాయ మైె రేయి గనుపట్టు
వడి నీవు మాదునీర్వట్టు మాన్ప
మనఁ దా ననతిదూరమున నున్నసలిలాశ
యమునుండి ముమ్మారు లంబువులను
దెచ్చి వారల కిచ్చి యాసచ్చరిత్రుఁ
డెలమి నాలవపరి జలంబులను దేఁగ
వేగఁ జని వచ్చునంతలో వింత గదుర
కన్నొంగ్ఱిరి వా రది గాంచి యతఁడు 80

క. వీరలు పేరిందేవియు
నారాయణుఁ డనఁగఁ దోఁచు నాపైఁ గృపచే
నీరీతిగ శబరాకృతిఁ
గూరిమి సాక్షాత్కరించి ఘోరాటవిలోన్. 81

గీ. తెరువుఁ గానక నే నొకతరువుక్రిందఁ
గుందుచుండంగ నీరేయియందు నన్నుఁ
గరము కృప నిట్లు కాపాడి కనుమొఱంగి
రదుదె యిది భక్తరక్షాపరాత్ములకును. 82

క. మనమున ని ట్లనుకొనునం
తనె యటులిటు లరుగువారి దారి నరసి యా
యనఘాత్మకుండు తోడం
జనుచుం గనె హస్తిశైలసవిధస్థలముల్. 83

మ. అదిగో! క్షీరనదీలలామ! మదె! వేదండాచలోత్తంస, మ
ల్లదె! కాంచీపురగోపురావళి, తదీయారామసందోహ మ
ల్లదెకా! యంచు జను ల్వచింప విని యత్యాశ్చర్యమోదాఢ్యుఁడై
యెద నాలక్ష్మణసూరి శౌరికృప గాదే హేతు వి ట్లౌటకున్.

క. అని మఱి మఱి యావరదుని
యనుపమకారుణ్యకలన కలరొందుచు నా
య్యనఁ బురము సొచ్చి సదనం
బునకుం జని జననిపాదముల కెరఁగి రహిన్. 85

క. తనపట్ల యాదవార్యుం
డొనరించినద్రోహచింతయును వరదుఁ డటుల్
తనకుం దోడ్పడి కాచుట
యును ననువృత్తాంత మంతయును వినిపింపన్. 86

క. చింతాద్భుతసంతోషా
క్రాంతస్వాంతాబ్జ యగుచుఁ గరిగిరివరదున్
గాంతిమతి నుతియొనర్చె ను
దంతం బది యాలకించి యందఱు జనులున్. 87

క. ఆరామానుజుఁ గనుఁగొని
యౌరా! వెండియు జనించె నరయఁగ నితఁ డీ

ధారణి నటంచు నెయ్యం
బారఁ బ్రశంసించి మోదమందిరి మిగులన్. 88

సీ. తరువాతఁ దనకూర్మితనయుఁ డౌలక్ష్మణుఁ
గని భూపిరాట్టి యిట్లనుచుఁ బలికె
నయ్య! తా నెయ్యెడ నెయ్యంబు వాటిల్ల
నిష్పురంబున వసియించి యున్న
తుర్యవర్ణోద్భవుం డార్యవర్ణితచర్యుఁ
డగుచుఁ గాంచీపూర్ణుఁ డనెడుపేర
నిలమీఁద మఱియు గజేంద్రదాసుండు నా
గణుతి గాంచెడుతిరుకచ్చినంబి
శబరియంశంబునను బుట్టి శౌరిచరణ
వనజములయందె డెందంబుఁ బాదుకొల్పి
కేవలతదీయసేవానుభావలీల
నాంతరంగికవృత్తి నింపలరు చుండు. 89

క. ఆమహనీయునిసన్నిధి
కీమెయి నీ వరిగి వాని కీవృత్తాంతం
బామూలాగ్రంబుగ న
త్యామోద మెలర్పఁ దెలుపు మని పనుపుటయున్. 90

శా. శ్రీరామానుజదేశికుండు చని కాంచీపూర్ణునిం గాంచి తా
నారేయి న్సమకూరినట్టియఖిలవ్యాపారముల్ దెల్పఁగా
నారూఢం బగు నాదరస్ఫురణచే నాలించి లాలించి యా
ధీరాగ్రేసరుఁ డానతిచ్చె నిటు లెంతేఁ గూర్మిమై వానితోన్.

శా. ఓయీ! లక్ష్మణదేశికేంద్ర! వినుమీ యుగ్రాటవీసీమ నా
సాయంకాలమునం దటుల్ వరదరాజస్వామి వ్యాధాకృతిన్
నీయందుం గలవత్సలత్వము కడుం బ్రేరేప నీ కెంతయున్
శ్రేయంబున్నమకూర్పఁగాఁదలఁచి లక్ష్మీయుక్తుఁడై తోడ్పడెన్.

క. కరిగిరివరదుఁడు నీపైఁ
గరుణగలం డట్లుకానఁ గాన నీ్ని వా
గురుతరవిపత్పయోనిధిఁ
దరియించితి వౌర! యోయుదారవిచారా! 93

మ. మునుమున్ శ్రేయము నీకుఁ గూర్ప నలవేల్పు ల్దేనిపానీయ మొ
య్యన ముమ్మారులు నీవొసంగఁ గొనిరో యాశ్యాలకూపంబునం
గొని తద్దివ్యజలంబు కాంచనకనత్కుంభంబుతోఁ దెచ్చి మ
జ్జనకైంకర్య మొనర్పఁగాఁ దగుఁ జుమీ సద్భక్తితో వారికిన్.

క. ప్రత్యహ మ ట్లొనరించిన
నిత్యం బగుపదవి నీకు నెలకొను దానన్
సత్యంబుగ నానుడువులఁ
బ్రత్యయమతి నమ్ము మనుచు వచియించె నిటుల్. 95

సీ. నలినగర్భాండభాండప్రకారంబు లె
వ్వనితుందకందరంబునఁ దనర్చు
నసదృశానంతకల్యాణై కరూఢిచే
నేవానిచారిత్ర మింపు నింపుఁ
బరమయోగీశ్వరప్రవరులు నెవ్వాని
యలఘుప్రభావంబుఁ దెలియలేరు

నిర్హేతుకోద్యద్వినిద్రకారుణ్యాప్తి
నెవనికటాక్షంబు లెసక మెసఁగు
నట్టివరదున కీ వాంతరంగికుండ
వగుటచేఁ బ్రాజ్ఞుఁ డెవ్వఁ డీజగతి నీదు
నానతి నతిక్రమించు నం చపుడు లక్ష్మ
ణార్యుఁడు తదాజ్ఞఁ గొని యింటి కరిగె మరల. 96

క. సదనమున కరిగి లక్ష్మణుఁ
డదియెల్లం దల్లి కప్పు డతివిశదగతిన్
సదమలమతి వినిపింపఁగ
మది ముదమునఁ బొదలి కాంతిమతి యిట్లనియెన్. 97

క. శ్రీతనయా! ఖ్యాతనయా!
యాతనియాజ్ఞాప్రకార మనుదిన మీ వా
నూతిజలంబుల వరదుని
స్నాతుం జేయుము శుభాళి సమకుఱు ననుడున్. 98

చ. జనని! మహాప్రసాద మని సాఁగిలి మ్రొక్కి తదాజ్ఞ నౌదలం
గొని యనివార్యభక్తి నలకూపజలంబుల లక్ష్మణాహ్వయుం
డనువుగఁ దెచ్చి యాజలరుహాక్షునకుం బ్రతివాసరంబు మ
జ్జన మొనరింపుచుండెఁ గద సజ్జనముల్ కొనియాడ వేడుకన్.

శ్లో. నాగాచలనివాసాయ నిత్యాయ పరమాత్మనే
వరదాయాప్రమేయాయ గోవిందాయ మహాత్మనే. 100

గీ. అనుచు నీహృద్య మగుపద్య మనుదినంబుఁ
బఠన మొనరించుచును భక్తవరదుఁ డైన

వరదునకు లక్ష్మణాచార్యవర్యుఁ డెలమిఁ
జేయుచుండెను మజ్జనసేవనంబు. 101

గీ. కుజనసాంగత్యమును వీడి సుజనవరుల
సంగతిని గూడి లక్ష్మణాచార్యవర్యుఁ
డలరుట నగణ్యపుణ్యకామ్యైకపరత
నిరత మలరారుచుండె సాదరత మెఱయ. 102

క. అట యాదవప్రకాశుఁడు
చటులాఘనిహంత్రి యైనజాహ్నవిలో సు
త్కటనియతి శిష్యతతితోఁ
దటుకున స్నానం బొనర్చుతఱి నొక్కయెడన్. 103

క. గోవిందమిశ్రుఁ డర్ఘ్యము
వావిరి నిడునపుడు వానిపాణితలమునన్
భావుకగతి నొకలింగము
దైవవశంబునను బడినఁ దడయక దానిన్. 104

క. కొనివచ్చి గురునికిం జూ
పిన నతఁ డనె శిష్యతోడ వినుమీ నీ కీ
ఘనలింగము విశ్వేశ్వరుఁ
డనుగ్రహించెఁ గద నీమహాభాగ్యమునన్. 105

చ. అమలగుణాఢ్య ! య ట్లగుట నాశివలింగ మభంగభక్తి డెం
దమునఁ దలిర్పఁ బూజన మొనర్పుముశ్రేయములబ్బు నంచు నె
య్యమున వచించి యగ్గురుజనాగ్రణి శిష్యులతోడ మాఘమా
సము చనుదాఁక నచ్చటనె స్నానము సేయుచు నుండె నాడటన్.

మాలినీవృత్తము. వెలువడి నిజశిష్యాన్వితుఁడై వచ్చుచో న
య్యలఘుగుణగణుం డౌయాదవాచార్యునొద్దన్
సెలవు వడసి వేడ్కన్ స్వీయ మౌగ్రామముం దా
నలరుచు నెద గోవిందార్యవర్యుండు గాంచెన్.

కవిరాజవిరాజితము.

తనజననస్థల మై తగుసంవస
థంబును ముంగట నిప్పగిదిన్
గనుఁగొని బంధుసఖాదులు రాఁ గడు
కౌతుక మొప్పఁగ నింటికి నా
య్యనఁ జని యాతఁ డపేతపథశ్రముఁ
డై మునిఁగెం బ్రమదాంబుధిలో
ననువుగ మించెడుపుట్టినయింటిసు
ఖాతిశయం బది యట్టిద కా. 108

ఉ. ఆపయి భూరికౌతుకసమన్వితమై హితబంధుకోటి యి
చ్చాపరిపాటిఁ బాటిలుచు స్వాగతముం జనుప్రశ్న నేసినన్
దేపకుఁ దేపకున్ ద్యుతిమతీసుతుఁ డుల్లము పల్లవింపఁగా
నాపయనంబునన్ జరిగినట్టివిశేషము లెల్లఁ దెల్పుడున్. 109

క. విని సంతసపడి వా ర
య్యనఘుని మళమంగళాగ్రహారములో నీ
ఘన మగుశివలింగముఁ బా
యనిభక్తిఁ బ్రతిష్ఠ నేయు మని కోరుటయున్. 110

మ. అవనీనిర్జరమందిరప్రచుర మౌనయ్యాగ్రహారంబులో
వివిధోత్కృష్టగుణాంబురాశి యగుగోవిందాహ్వయుం డాజవం

జవబంధైకవిముక్తి పాటిలుట కై శాస్త్రోక్తమార్గంబునన్
శివలింగంబుఁ బ్రతిష్ఠసేసె విబుధశ్రేష్ఠుల్ ప్రశంసింపఁగన్.

శా. శ్రీమజ్జ్ఞానసుమాంబికాసహితుఁ డై శ్రీకాళహస్తీశ్వరుం
డామోదంబున నొక్కనాఁ డతఁడు నిద్రాసక్తుఁడై యుండఁగాఁ
బ్రేమన్ ముంగిట నిల్చి స్వప్నమునఁ దెల్పెన్ నీవు మాసన్నిధిన్
నేమం బొప్ప వసింప ర మ్మనుచు నక్షీణానుకంపామతిన్. 112

మ. అని యాయీశ్వరుఁ డానతిచ్చి యటపై నంతర్హితుం డైనఁ జ
య్యన మేల్కాంచి ముదంబెలర్పఁగ నతం డాస్వప్నవృత్తాంత మా
ర్యనికాయంబున కెల్లఁ దెల్పుచుఁ దదీయాజ్ఞానుసారంబుగాఁ
జనె నాదక్షిణకాశికాపురికి నుత్సాహంబు వాటిల్లఁగన్. 113

సీ. అన్నపూర్ణాదేవియనువున నలరు నె
చ్చోటునందు జ్ఞానప్రసూనజనని
విశ్వేశ్వరునిమాడ్కి విలసిల్లు నెచ్చోట
వాయులింగాకృతి పరమశివుఁడు
భాగీరథీనదిపగిది నుత్తరముగాఁ
బ్రవహించు నెచట సువర్ణముఖరి
గణపతిప్రభుతులకరణి భాసిల్లు నె
చ్చట నన్యదేవతాసముదయంబు
మఱియు దక్షిణకాశి నా వఱలు నెద్ది
యట్టిశ్రీకాళహస్తిపురాధిరాజ
మందు గోవిందమిశ్రార్యుఁ డధివసించి
యీశ్వరాంఘ్రిసపర్యాప్తి నెసఁగుచుండె. 114

క. గురునిభుఁ డగురామానుజ
గురుఁడు మనోజాతగురునిఁ గొలుచుచుఁ గాంచీ
పురమందు మెలఁగుచుండెన్
బరమపదంబున ననంతుమాడ్కిన్ వేడ్కన్.

సీ. అక్కాలమందు మధ్యమలోకవైకుంఠ
మగునట్టిశ్రీరంగనగరమందుఁ
బంచసంస్కారసంపన్నుండు వేదవే
దాంతవిద్యారహస్యైకవేత్త
శ్రీవిష్ణుపాదాబ్జసేవానుభావుండు
ననుపమసింహాసనాంశభవుఁడు
యామునార్యుం డనుయతివర్యుఁ డొకనాఁడు
శఠజిత్ప్రబంధంబు సలుపునపుడు
నెమ్మది నొకింతసేపు ధ్యానించి శిష్య
జనులఁ గని మీరు నిఖిలదేశముల కరిగి
సకలకల్యాణసుగుణలక్షణసమగ్రుఁ
డైనహరిభక్తు నరసి రం డని వచింప. 116

క. గురునాజ్ఞ నౌదలం గొని
సరభసమున వెడలి వారుజనపదములలోఁ
బురము పురం బిలు నిల్లుం
గర మరయుచుఁ జనిరి తుదకుఁ గాంచీపురికిన్. 117

చ. అకలుషశీలురై యలరునయ్యతిశేఖరుశిష్యు లచ్చటన్
బ్రకటయశోనిధిం బరమభాగవతున్ బరవాదిభీకరున్

సకలకలాకలాపకుని సాధుజనస్తవనీయు నొక్కబా
లకుఁ గని దేశికోక్తగుణలక్షణలక్షితుఁగాఁ దలంచున్. 118

గీ. మఱియు నచ్చటిజనపరంపరలవలన
నతనిమహనీయమహిమాదు లాలకించి
రంగనరికి ముద మలరంగ మరలఁ
జని వచించిరి గురుని కచ్చరిత మెల్ల. 119

గీ. అయ్యుదంతము నంతయు నాలకించి
యామునాచార్యుఁ డాలక్ష్మణార్యుఁ జూడ
నభిలషించియు నరుగ లేఁ డయ్యె నచటి
కపుడు తనమేన సౌఖ్య మింతైన లేమి. 120

క. విను మిటులుండఁగ యాదవ
ముని కాంచీనగరమునకుఁ బునరాగతుఁడై
ఘనుఁ డగులక్ష్మణమునికి
న్వని కించిత్సంశయంబు నెమ్మదిఁ గదురన్. 121

స్రగ్విణి. క్రూరచిత్తంబునన్ ఘోర మౌవింధ్యకాం
తారమం దట్లు నే న్లక్ష్మణార్యాగ్రణిన్
దూరదూరంబుగాఁ ద్రోవఁ దప్పించి రా
శౌరిభాస్వత్కృపాశక్తి ని ట్లయ్యెఁ గా. 122

చ. సొబగగులక్షణస్ఫురణ శోభిలులక్ష్మణదేశికేంద్రుఁ డ
న్నిబిడవనాంతరాళమున నిశ్చలవృత్తి హరిప్రపత్తిచేఁ
బ్రబలుచు నెల్లయాపదలు వాసి మెలంగఁగఁబోలు వాసి గా
నబలుఁడు రక్ష లేకయె మహాటవి వర్ధిలు నన్నకైవడిన్. 123

చ. పలుమరు నిట్లు నెమ్మదిఁ బ్రపాభయవిస్మయము ల్పెనంగొనం
దలఁచి తలంచి లక్ష్మణబుధప్రకరాగ్రణి నొందురీతిగం
గలయఁగ నించు కైనఁ బని గా దటు కావున నేను వానితోఁ
జెలిమి యొనర్తుఁ గాక యని శిష్యులచేఁ బిలిపించె నాతనిన్.

చ. ప్రకటబుధస్తవార్హ మగుప్రజ్ఞ నెసంగెడుయాదవప్రకా
శకగురుమౌళికంటె నిలశాస్త్రములం దగ నేర్పువాఁడు వే
ఱొకఁడు సమర్థుఁడౌపురుషుఁడుండమిలక్ష్మణుఁ డెంచి వానియం
తికమున వేదశాస్త్రముల నేర్చుచు నుండెను తొంటి కైవడిన్.

క. హరిసేవ మాని మానిత
చరితుం డగులక్ష్మణార్యజనమణి విద్యా
పరతంత్రుఁ డగుచు నగ్గురు
సరసనె వేదాంతగోష్ఠి సలుపుచునుండెన్. 126

క. ఒకనాఁ డట యామునదే
శికమణి రామానుజార్యశేఖరుఁ గనుకో
రికచేఁ గాంచీపురి కు
త్సుకుఁ డై తనశిష్యజనముతోడం జనియెన్. 127

గీ. సచ్చరితుఁ డైనయామునాచార్యుఁ డటకు
వచ్చె ననుమాట విని తిరుక్కచ్చినంబి
మచ్చిక నెసంగుహితకదంబంబుతోడ
నచ్చ మగుభక్తి నెదురేఁగి యిచ్చ నపుడు. 128

క. అడియేం దాసోహ మ్మని
వడిఁ దిరువడిఘళ్ల కెరఁగి బహుగౌరవ మే

ర్పడఁ దోకొని చని దాస్యం
బడరించెన్ సుగుణఖనికి యామునమునికిన్. 129

క. జగదభినుతగుణపూర్ణుం
డగుకాంచీపూర్ణుతోడ యామునయతి పెం
పగునియతి మీఱఁగాఁ జనె
నగణితదురితాబ్ధితరికి హస్తిశిఖరికిన్. 130

క. చని యవలఁ గోవెలం గని
యనితరసామాన్యభక్తి నభివాదనముల్
ఘొనరింపుచుఁ బరమపదం
బని యెంచుచు దానిలోని కరుగుచు నెదుటన్. 131

సీ. ఘననీలమణిజాలఘనలీలలను బోలఁ
గను జాలుడాలుచే నొనరువాని
శతపత్త్రసచ్ఛాత్త్రసౌందర్యధుర్యమై
తగుచౌకాటపునేత్రయుగమువానిఁ
బండువెన్నెలతేనినిండుసోయగ మూని
కలకలమనునెమ్మొగంబువాని
సింగారమను జిల్కురంగారుపనిగుల్కు
బంగారువలువచేఁ బఱగువానిఁ
బూలవిలుకాంద్రఁబెక్కండ్రఁబోని వాని
వరదయాస్పదు వందారువరదు వరదుఁ
గాంచి పులకాంచితాంగుఁడై కరము భక్తి
యామునాచార్యవర్యుఁ డి ట్లని నుతించె. 132

సీ. కారుణ్యమయశీల ! కల్యాణగుణజాల !
వరభక్తపాల ! తుభ్యం నమోస్తు
కమనీయతరగాత్ర ! కంజాతదళనేత్ర !
పరమపవిత్ర ! తుభ్యం నమోస్తు
పదనతాఖిలదేవ ! సదమలతరభావ !
భవ్యప్రభావ ! తుభ్యం నమోస్తు
మునిమానసవిహార ! ముష్కరసంహార !
పాపవిదూర ! తుభ్యం నమోస్తు
హస్తిశైలనివాస ! తుభ్యం నమోస్తు
బహుమనోజ్ఞవిలాస ! తుభ్యం నమోస్తు
భరితభువనైకతుంద ! తుభ్యం నమోస్తు
వరదరాజ ! ముకుంద ! తుభ్యం నమోస్తు. 133

క. అని పేర్కొని యామునముని
జనమణి తీర్థప్రసాదశఠకోపములన్
వినయమునం గనుఁగొని యొ
య్యన మరలుచు నేఁగుదెంచునాసమయమునన్. 134

శా. స్వామిం గొల్వఁగ వారణాద్రికిని శిష్యశ్రేణితోఁ గూడి య
త్యామోదంబున వచ్చుపండితవరుం డౌయాదవాచార్యునిం
బ్రేమం గాంచి గజేంద్రదాసుఁ డపు డాశ్రీవైష్ణవార్యైకదీ
క్షామాన్యుం డగుయామునార్యునకు విజ్ఞాపించె నీరీతిగన్. 135

సీ. మొలను గీల్కొల్పినయలమల్లకంబుపైఁ
గావిదోవతిగూడకట్టు దనర

ముసుఁగు గూర్చినశాటి నెసఁగుముండితమైన
శిరమున రుద్రాక్షసరము మెఱయ
నొకకేల దండ మింకొకకరంబున విని
ర్మలతామ్రమయకమండలువు నెలఁగ
మృదులంబు లై యొప్పుపదపల్లవంబులఁ
బలుచనిమెఱుఁగుఁబావలు దలిర్ప
శిష్యు లందఱకంటెఁ జెచ్చెరను ముందు
గడఁగి చిరబిర నడకపెం పడరునటులు
వచ్చునాపూరుషుఁడు యాదవప్రకాశ
యతిజనాగ్రేసరుఁడు చుమ్ము యామునార్య ! 136

మ. స్వమతస్థాపనశక్తి యన్యమతవిధ్వంసక్రియాసక్తి స
ర్వమనీషిస్తవనీయశాస్త్రపటలీపాండిత్యసంయుక్తియున్
యమముఖ్యాఖిలయోగధారణసముద్యత్ప్రౌఢిమవ్యక్తి యా
శమహాభక్తియుఁగల్గి యిగ్గురువతంసంబొప్పుమెప్పొందుచున్.

మ. అదుగో ! చూడుము క్షీరసాగరసముద్యత్ఫేనతుల్యంబు లౌ
మడుగుల్ దాల్చి మృణాళతంతునిభశుంభద్బ్రహ్మసూత్రంబు లే
ర్పడ నాత్మోచితవేషభాష లనువొప్పన్ యాదవాచార్యుతోఁ
గడుభక్తిన్సహపాఠులం గలసి వేడ్కన్ వచ్చురామానుజున్.

సీ. తనవలె నఖిలభూతముల నాత్మఁ దలంచుఁ
బరమకారుణ్యభావమున మించు
వైకుంఠసేవానుభావంబున మెలంగు
నతులితబుధవిధేయతఁ జెలంగు

స్మితపూర్వమితసత్యహితభాషితము లాడుఁ
బరుషోక్తులెన్నఁడుఁ బలుకఁబోఁడు
స్వప్నంబునం దైనఁ బరధనాదులఁ గోరఁ
డపకారు లగువారి నైన దూరఁ
డారితేఱియు వేదశాస్త్రికగోష్ఠి
గరువ మిసుమంత యైనను గాంచఁ డెదను
బాలుఁ డయ్యును వైరాగ్యశీలుఁ డగుచు
నవని నలరొందుచుండు రామానుజుండు. 139

క. అని కాంచీపూర్ణార్యం
డనఘాత్మకు లైనవారి యామునమునికిం
గనఁబఱిచి వింధ్యభూధర
వనవృత్తాంతమును గూడ వానికిఁ దెలుపన్. 140

గీ. వింటి మును లక్ష్మణార్యుని విమలచర్యఁ
గంటి నాతని నిపుడు నేఁ గన్నులార
ననుచు యామునమునివర్యుఁ డాత్మలోన
నద్భుతానందమగ్నుఁ డై యలరి పిదప. 141

క. ర మ్మని చేరం బిలచిన
నిమ్మాడ్కిన్ వీరితోడ నేతెంచునితం
డెమ్మెయి నాచెంగటకున్
గ్రమ్మఱ నరుదెంచునొక్కొ రాఁడొకొ యనుచున్. 142

క. డెందంబున సందియ మిం
పొందఁగ నాలోచనంబు నొనరించుచు వా

నిం దుదకుం బిలువక యే
వందనపూర్వకముగాఁగఁ బ్రార్థించె హరిన్. 143

శా. మూకప్రోక్తము లైనపద్యనికరంబుల్ వేడ్కమై నంధుఁ డ
స్తోకప్రజ్ఞఁ బఠింపఁగన్ బధిరుఁ డెంతోసంతసం బొప్పఁగా
నాకర్ణించునొ యేమహామహానుగ్రహస్ఫూర్తి నా
నీకల్యాణమహత్వ మెన్నఁ దర మౌనే? హస్తిశైలాధిపా!

క. అట్టిఁడ వై తగునీ పీ
పట్టున రామానుజార్యవరు విడువక చే
పట్టి స్వమతాభిమానము
గట్టిగఁ జేకూర్చి ప్రోవఁగావలయుఁ జుమీ. 145

క. అని లక్ష్మణుకొఱకుం బ్రా
ర్థనపూర్వకముగను వరదరాజస్వామిన్
మనమునఁ గొనియాడుచు యా
మునముని సనె రంగనగరమునకున్ మరలన్. 146

శా. శ్రీరంగంబున కేఁగి యామునమునిశ్రేష్ఠుండు లోకోత్తరుం
డౌరామానుజదేశికోత్తమునిక్షేమార్థంబుగా నిచ్చలున్
గారుణ్యాంబుధి రంగనాయకుని వేడ్కం గొల్చుచుండెం దదీ
యారూఢస్తవనప్రసంగముల నెయ్యంబొప్పఁ గావించుచున్.

క. తొల్లిటివలె యాదవముని
తల్లజుకడ లక్ష్మణుండు దగుపూనిక రం
జిల్లంగ నెల్లశాస్త్రము
లల్లనఁ బఠియించుచుండె నసమప్రజ్ఞన్. 148

సీ. అంతట నొకనాఁడు యాదవార్యునకు రా
మానుజాచార్యుఁ డభ్యంజనంబు
నొనరించుసమయంబునను దేశికాగ్రణి
"కప్యాసపుండరీకాక్ష" యనెడు
శ్రుతి కపార్థంబు వాక్రుచ్చ లక్ష్మణసూరి
భూరివిచారాప్తిఁ బొగులుకతన
నతనికన్నులనుండి యశ్రుబిందువు యతి
ప్రవరునితొడమీఁదఁ బడిన నతఁడు
వానిదెసఁ గాంచి యోయి రామానుజార్య !
యిట్లు మిన్నక విలపించె దేల యనిన
శ్రుతి కపార్థంబు దెలుప దుఃఖితుఁడ నైతి
ననుచు శిష్యుండు గురువరేణ్యునకుఁ దెలిపె. 149

మ. ఘనగంభీరజలంబునం బొడమి యర్క శ్రీకరస్పర్శచే
ననువొప్పన్ వికసించుపద్మములసామ్యం బూనుకందోయివాఁ
డనుచుం దెల్పుట మాని యాశ్రుతి కపార్థాపత్తిమై మర్కటా
సనసంకాశవిలోచనుం డనుచు స్వేచ్ఛం బల్కఁగాఁ బాడియే.

మ. అని చెప్పన్ విని యాదవార్యుఁ డతికోపావిష్టుఁ డై యింతకం
టెను యుక్తంబుగఁ జెప్పువారు గలరేనిం గాంతిమత్యాత్మజా!
చనుమీ వారలచెంతకుం దగవు మాసాన్నిధ్యమం దుండఁ బొ
మ్మనియొక్కుమ్మడిఁబెక్కుభంగులనసూయాస్ఫూర్తిఁబోనాడినన్.

మ. ఇలయాళ్వా రది నైఁప నోపక విచారైకాస్పదుం డై సుధీ
తిలకం బైనగజేంద్రదాసుకడ కెంతేఁ గూర్మిచే నేఁగి యం

దలివృత్తాంతము విన్నవించి పిదప న్నాగాద్రివాసుం గృపా
కలితుం గొల్చుచునుండె మజ్జనమహాకైంకర్యలీలారతిన్. 152

సీ. శ్రీరంగమున భక్తి మీఱంగ యామున
సూరి నారాయణస్తోత్ర మొకటి
రచియించి పిమ్మట రామానుజార్యుండు
యాదవుసాంగత్య మవలఁ ద్రోసి
కాంచికాపురిఁ దిరుక్కచ్చినంబిసమక్ష
మం దుండె ననువార్త నాలకించి
ముఖ్యశిష్యుం డగుపూర్ణార్యు నచటికిఁ
జని యిళయాళ్వారుసముఖముునను
దా నొనర్చినస్తోత్రరత్నంబు నెయ్య
మలరఁ బఠియించి ర మ్మని యాజ్ఞ నొసఁగ
నమ్మహాపూర్ణుఁ డపుడు మహాప్రసాద
మనుచు సత్యవ్రతక్షేత్రమునకు నరిగి. 153

క. వరతీర్థస్నాతుం డై
పరిధృతధౌతప్రపూతపట్టాంశుకుఁ డై
తిరుమణికాపు దలిర్పఁగఁ
గరిగిరి నారోహణంబు గావించి రహిన్. 154

క. సురుచిర మగుదేవళమున
కురునియతిఁ బ్రదక్షిణంబు లొనరించి తదం
తరమునకు నరిగి యట ని
ర్భరభక్తి భజించె వరదరాజస్వామిన్. 155

శా. స్వామిన్ సేవ యొనర్చి యామునపరివ్రాడుత్తమప్రోక్తమై
శ్రీమీఱం దగుస్తోత్రరాజమును గూర్మిం దత్సమక్షంబునం
దామూలాగ్రముగాఁ బఠించి శఠగోపాదుల్ వినమ్రాంగుఁడై
యామోదంబు దలిర్పఁగైకొనుచుఁ బూర్ణాచార్యుఁ డాపిమ్మటన్

శా. చంచద్భక్తిని శాలకూపజలముల్ సౌవర్ణకుంభంబునం
గొంచున్ లక్ష్మణసూరి శౌరి నభిషిక్తున్ సల్ప నేతెంచుచోఁ
గాంచీపూర్ణుఁడు దత్పథం బొగి నెఱుంగంజేయ నచ్చో సుధీ
పంచాస్యుల్ కొనియాడ వేడుకఁ బఠింపంజొచ్చె నాస్తోత్రమున్.

క. తత్రత్యవిష్ణుభక్త
శ్రోత్రసుధాప్రాయముగను శోభిల్లెడునా
స్తోత్రము యామునమౌని
చ్ఛాత్త్రజనాగ్రేసరుండు చదువుచునుండన్. 158

క. సరగున నట కిళయాళ్వా
రరుదేరఁగ స్తోత్రరత్నహారంబునకున్
దరళాయమానమై భా
స్వర మగునొకపద్య మిట్లు చదువఁదొడంగెన్. 159

శ్లో. స్వాభావికానవధికాతిశయేశితృత్వం
నారాయణ ! త్వయి న మృష్యతి వైదికః కః
బ్రహ్మా శివ శ్శతమఖః పరమస్స్వరా డి
త్యేతేపి యస్య మహిమార్ణవవిప్రుష స్తే. 160

మ. అని పూర్ణార్యుఁడు భక్తిమైఁ జదువహృద్యంబైనయాపద్యమున్
విని రామానుజదేశికోత్తముఁడు సంప్రీతాత్ముఁడై దీని నే

యనఘాత్ముం డొనరించె నాఘనునినామాంకంబు లై యొప్పుపా
వనవర్ణంబుల నాదుకర్ణములకుం బాత్రంబులం జేయుమీ.
. ఆరీతిన్ వచియింప నాతనికి బూర్ణార్యుం డనెం బంచసం
స్కారాన్వితుఁడు విష్ణుసేవకుఁడు భాస్వద్వేదశాస్త్రైకవి
స్ఫారుండార్యనుతుండతీంద్రియుఁడుసుస్వాంతుండుశాంతుండునై
శ్రీరంగంబున యామునాహ్వయయతిశ్రేష్ఠుండు భాసిల్లెడున్.
ఆమహనీయునిచే నిది
కోమలగతి నే ర్పెలర్పఁ గూర్పంబడె నా
రామానుజుఁ డాతనితో
నామోదపయోధిమగ్నుఁ డై యి ట్లనియెన్. 163
ఓయి మహానుభావ! సుగుణోదధి! పూర్ణసుధీవతంసమా!
నాయెడలం గృపారసము నాటుకొనం గడువత్సలుండ వై
యాయతిలోకశేఖరునియంఘ్రులఁ జూపి కృతార్థుఁ జేయవే
నీయుపకారమున్ మఱవ నే ననిశంబు మనంబులోపలన్.
. తనకుఁ జేసినమేలు దలఁపకుండెడువాఁడు
పరధనాదుల కాసపడెడువాఁడు
శక్తి గల్గియు దీనజనులఁ బ్రోవనివాఁడు
తగవు గానక యాడి తప్పువాఁడు
వ్యసనసమాశక్తి నెసఁగుచుండెడివాఁడు
ఖలులమైత్రికి నోసరిలనివాఁడు
భూతదయాళుతాస్ఫురణ నొప్పనివాఁడు
స్వామిభక్తికిని బాల్పడనివాఁడు

పరమపూరుషనిధ్యానపరుఁడు గాక
మెలఁగువాఁడును సద్వృత్తకలనవలనఁ
దొలఁగువాఁడు మనుష్యమాత్రుండు గాఁడు
భూరిగుణహారి యోమహాపూర్ణసూరి. 165

క. అనవుడుఁ బూర్ణబుధుం డో
యనఘాత్మ! గజేంద్రదాసునసుమతిఁ గొని తో
డ్కొని యరిగెద నన నతఁ డ
ట్లొనరిచి చనె పూర్ణదేశికోత్తముతోడన్. 166

చ. అటువలెఁ బూర్ణనామకబుధాగ్రణితో నతఁ డేఁగి యేఁగి యా
దటఁ గనె నగ్రభాగమునఁ దామరసోదరముఖ్యదేవతా
పటలముహుర్ముహుర్వినుతిపాత్రమహామహిమాభిరామమున్
చటులతరోగ్రగజాగ్రదఘజాలవిరామము రంగధామమున్. 167

మ. కని యాపిమ్మటఁ జెంగటన్ విరజ నాఁగం దోఁచుకావేరిఁ గ
న్గొని తత్తీరమునందు భాగవతసందోహంబు లొక్కుమ్మడిన్
జనుదేరం బరికించి కించిదనుమానవ్యాకులస్వాంతుఁ డై
యనె నాలక్ష్మణదేశికోత్తముఁడు పూర్ణాచార్యమూర్ధన్యుతోన్.

శా. పూర్ణాచార్య! యిదేల వైష్ణవులు గుంపుల్గుంపు లై వేనవే
ల్దూర్ణప్రక్రియ వచ్చుచుండి రనునాలో వారికల్లలనన్
గర్ణాత్యంతకఠోరభంగిగ వినంగన్ వచ్చె సహ్యాత్మజా
భ్యర్ణోర్వీస్థలి యామునార్యమణినిర్యాణాద్యవస్థాగతుల్. 168

మ. సదయుం డై తగుయామునార్యమణితో సద్గోష్ఠి గావింప స
మ్మద మొప్పం జనునంత ని ట్లగుట కాత్మన్ లక్ష్మణాచార్యుఁ డ

య్యదనం జింతిలఁ జొచ్చెనెంతయును గొండంతాసతోనుండఁగా
నది వ్యర్థం బగునేని ప్రాజ్ఞుఁడును జింతాక్రాంతచిత్తుం డగున్
ఇరువురు నవ్వార్త విని
దురపిల్లఁదొడంగి రందు దుర్భరచింతా
పరవశుఁ డై రామానుజ
గురుఁ డెక్కుడుగాఁగ నపుడు కుందుచునుండన్. 171
ధృతిఁ గొని పూర్ణార్యుఁడు ప్రా
కృతపూరుషలీల మెలఁగునిలయాళ్వారున్
వెత దొలఁగ నూరడించెన్
ప్రతిభ నిటుల్ సద్వివేకపరిపాకమునన్. 172
. జననంబున్ మరణంబు మర్త్యుల కిలన్ స్వాభావికంబు ల్గదా
యనవద్యాత్మక ! వానికై వగవ నేలా బేలలీలన్ మహా
ఘనుఁ డౌయామునదేశికోత్తముఁడు వేడ్క న్నిత్యసూరాగ్రణుల్
గనుసారూప్యముఁగాంచి శాశ్వతసుఖైకస్ఫూర్తి మించుంజుమీ.
ఇడుమలఁ బడునెడఁ బ్రాజ్ఞుల
కుడుగనిధైర్యమున మెలఁగు టొప్పగు సిరుల
బ్బెడునప్పుడు కడుఁ దాలిమి
యడరఁగ వర్తించు టుచిత మగు సుగుణనిధీ ! 174
. ఇలపయిఁ బుట్టరే? మనుజు లెందఱొ యుండిరె?కొందఱేనియుం
దలఁపఁగ వారిలో సుమహితం బగువర్తన మొప్ప మెప్పుగా
నలరుమహానుభావులయుదారతరం బగుకీర్తిమాత్రమే
నిలుకడగాఁగ నుండుఁగద నీవు నెఱుంగని దొక్క టున్నదే?

సీ. శాశ్వతంబుగ నుండు సత్కీర్తి సత్కీర్తి
సత్కీర్తి నార్జించుశక్తి శక్తి
శ్రమ మైన విడువనిసత్యంబు సత్యంబు
సత్యంబు వలికెడుజనుఁడు జనుఁడు
పండితు ల్గొనియాడుప్రాజ్ఞత ప్రాజ్ఞత
ప్రాజ్ఞత గలయట్టిప్రభువు ప్రభువు
సర్వజ్ఞుఁ దిలకించుజ్ఞానంబు జ్ఞానంబు
జ్ఞానంబు గలిగించుచదువు చదువు
గావునను నీ వశేషవిద్యావిశేష
కలన నలరుటఁ బటువివేకంబు మెఱయ
ధైర్య మెదఁ బూని మెలఁగుట తగవుగాదె
యసమగుణధుర్య ! రామానుజార్యవర్య ! 176

చ. గణన మొనర్పఁగన్ బ్రదుకుకాలము క్షీణ మగుంగదా యను
క్షణమును భిన్నకుంభగతశంబరముం బలెఁ బ్రాణికోటి క
ల్పణముగఁ బెక్కురోగములపా లయి దేహము లొప్ప నుత్తర
క్షణమున నెట్లు లౌనొ ? యెఱుఁగంబడ దించుక యైన నేరికిన్.

మ. అని పూర్ణార్యుఁడు దెల్ప లక్ష్మణబుధుం డామాట లాలించుచున్
మనమం దించుక ధైర్యముంబొడమ సన్మానార్హుఁడౌయామునా
ర్యునిదివ్యం బగువిగ్రహం బయిన నెంతోభక్తి నీక్షించినన్
జననంబున్ సఫలత్వమొందుటకు నిస్సందేహ మం చెన్నుచున్.

క. కావేరీతీరమునన్
శ్రీవైష్ణవకోటి గొలువఁ జెలువొందుచు నం

త్యావస్థ నొప్పుయామున
కోవిదుకడ కతఁడు పూర్ణగురుతోఁ జనుచున్. 179

మ. చరమావస్థ నెసంగుయామునగురుస్వామిన్ విలోకించి ప
ల్మరుఁ జింతించి మహానుభావుఁ డగునిమ్మౌనీంద్రుతోడ న్నిరం
తర మౌభక్తిని బల్కరించుటకునైన న్నోఁచనై తక్కటా!
తరమే? యట్టు లొనర్ప నాకు భగవత్కారుణ్య మి ట్లుండఁగన్

చ. అనుకొని వానిదివ్యతర మౌతిరుమే నురుమాన్యదృష్టిచేఁ
గనుఁగొనుచుం గృతార్థతను గాంచెద నం చెదలోన నెంచుచున్
వినతు లొనర్చి చూచునెడ వింతగ నయ్యెలయామునవారి కా
ఘనునికరాంగుళిత్రయము గానఁగనయ్యెను గుంచితంబుగన్.

ఆ. ముడిచికొనినవ్రేళ్ల మూఁటి ని ట్లారసి
యస్వభావసిద్ధ మగుట దెలిసి
వినుతిసేయఁ దగినవిజ్ఞానమును గాంచి
యలరులక్ష్మణార్యుఁ డనియె నిట్లు. 182

సీ. ఓయి యామునదేశికోత్తమ! వినవయ్య
వైష్ణవప్రవరు లప్పరమపదముఁ
గడుసులభంబుగాఁ బడయ నిక్కడనుండి
వైకుంఠమునకు సోపానములను
నేర్పు మీఱంగ నే నేర్పఱింపఁగఁ జాలు
దెద దీనికై సంశయింపవలదు
మఱియు నజ్ఞాననిమగ్నులై తగువారిఁ
బంచసంస్కారసంపన్నులుగను

ద్రావిడామ్నాయతత్త్వపారగులు గాఁగ
నిరతముఁ బ్రపత్తిధర్మైకనిరతులుగను
సలిపి రక్షించెద నటంచుఁ బలుకునంతఁ
జాఁపె నొకవ్రేలు యామునాచార్యమౌళి. 183

క. ప్రవిదితముగ శ్రీభాష్యం
బవిరళసుజ్ఞానబోధనైకస్ఫూర్తిన్
భువి నెసఁగఁ జేతు నన రెం
డవయంగుళి గూడఁ దొంటియట్లయ్యె నొగిన్. 184

ఉ. వ్యాసుఁడును బరాశరమహామునియున్ భువనోపయుక్తికై
చేసిరి గా పురాణములఁ జెల్వగువారలనామధేయముల్
వాసికినెక్క భాగవతవర్యుల కిర్వుర కుంచువాఁడ నా
నాసమయంబునన్ మిగిలినట్టికరాంగుళిగూడ నట్లు కాన్. 185

శా. కన్నారం గని యామహాద్భుతము సాక్షాత్పన్నగాధీశుఁ గా
నెన్నన్వచ్చును వీని నంచు జగదుత్కృష్టప్రభావైకసం
పన్నున్ లక్ష్మణదేశికోత్తముని శ్రీమద్వైష్ణవాగ్రేసరుల్
విన్నాణం బగుభక్తిఁ బేర్కొనిరి వాగ్విస్ఫూర్తి కీర్తిం గనన్.

శా. ధన్యాత్ముం డగుయామునార్యునకు నంతన్ వైష్ణవాగ్రేసరు
లామ్నాయప్రక్రియ నర్హకృత్యముల నెల్లం దీర్చి రాపిమ్మటన్
దైన్యం బొప్ప నయామునం బయినయాస్థానంబునం దున్కి నా
కన్యాయం బగు నంచు లక్ష్మణబుధుం డాత్మన్ విచారించుచున్.

శా. కావేరీనదిలోన మజ్జనములం గావించి లోకైకస
ద్భావాచార్యవియోగసంజనితసంతాపాధ్యుఁడై పూర్ణసం

ఖ్యావన్మౌళియనుజ్ఞఁ గైకొని ప్రయాణాసక్తిమై నుండఁగా
నావేళన్ మహనీయవైష్ణవసమూహం బాతనిం గాంచుచున్.

మ. అలఘూద్యత్ప్రతిభావిభాసురవిశిష్టాద్వైతసిద్ధాంతమున్
నిలుపం జాలుదు వీవు భావుకగుణానీకంబు లోకంబునన్
బెలుచన్ మించఁగఁజేతు వంచుఁ గడుగూర్మిన్మంగళాశాసనం
బులఁ గావింప మహాప్రసాద మనుచు న్మోదుప్పొల్లగం గూర్చుచున్.

క. కరిగిరివరదుని మఱిమఱి
పరికించుతలంపు మదిని బాటిల్లంగా
నురువడి వెలువడి యాతఁడు
గర మాదర మెసఁగఁ గాంచికాపురి కరిగెన్. 190

క. ఇలయాశ్వా రావిధమున
నలకాంచీనగరి కరిగి యచ్చో నెలమిన్
దొలుతటివలె హరిసేవా
కలనాకులవృత్తిఁ దనివి గాంచుచు నుండెన్. 191

క. అసమానదానశూరా!
లసమాననయప్రచార! శ్లాఘ్యవిచారా!
వసుధాధరవరధీరా!
రసనిధిగంభీర! సుగుణరత్నాధారా! 192

చ. ఉరుతరపద్మనాయకకులోపధివారినిధిక్షపాకరా!
నిరవధికస్ఫురద్బహువినిర్మలకీర్తిధనార్జనాదరా!
వరకవితారసగ్రహణపాటవసత్ప్రతిభావిభాసురా!
సురుచిరపీఠికానగరసుస్థిరరాజ్యరమాధురంధరా! 193

స్రగ్విణీవృత్తము. దీనరక్షారతా ! ధీరతాశోభితా !
దానరాధాసుతా ! ధర్మకార్యాన్వితా !
జ్ఞానవిభ్రాజితా ! సత్కృపాదీపితా !
సూనృతాలంకృతా ! సూరిలోకస్తుతా ! 194

గద్యము.

ఇది శ్రీజానకీరమణచరణారవిందమిళిందాయమానమానసభావుక
రావుకులతిలకసూర్యరాయభూమండలాఖండలసమగ్రాను
గ్రహపాత్రకౌండిన్యసగోత్రపవిత్రదేవులపల్లివంశ
సంభూతసీతారామశాస్త్రివిద్వన్మణిపౌత్రవేంకట
కృష్ణశాస్త్రీంద్రపుత్రసుబ్బరాయసుధీవర
సోదరతమ్మన్నశాస్త్రిప్రసిద్ధాభిధానాం
తరవిబుధజనవిధేయవేంకటకృష్ణ
శాస్త్రినామధేయప్రణీతంబైన
యతిరాజవిజయమున
ద్వితీయాశ్వాసము.
శ్రీ శ్రీ శ్రీ.



# యతిరాజవిజయము.

## తృతీయాశ్వాసము.



శ్రీజాగ్రదసమవిద్యా
భోజా! కరుణారసైకపూరితహృదయాం
భోజా! దీనచకోరక
రాజా! శ్రీసూర్యరాయరాజబిడౌజా! 1

గీ. అవధరింపుము రామానుజార్యుఁ డట్లు
మరలఁ గాంచికి రంగధామమునుండి
యరుగుదెంచినమఱునాఁ డహర్ముఖంబు
నను దిరుక్కచ్చినంబిఁ గన్గొనఁగ నేఁగె. 2

క. చని జరిగినపను లెల్లన్
వినిపింపఁగ నతఁడు తొలుత వెతయును బిదపన్
మనమున వెఱఁగును గని యా
మునగురునకు శిష్యకృత్యముల నెఱవేర్చెన్. 3

మ. ఇలయాళ్వారును శాలకూపజల మెంతే నిష్ఠతోఁ దెచ్చి ని
చ్చలు నాగాచలవాసుఁ డౌవరదరాజస్వామి కర్పించుచున్
గలయంగా హరి కాంతరంగికుఁ డగుం గాంచీగురుం డంచుఁ గే
వల మౌగౌరవబుద్ధితో నతని సంభావించుచుండెం దగన్. 4

సీ. ఇట్లుండ నొకనాఁడు పృథులవైరాగ్యాప్తిఁ
బొదలురామానుజబుధవరుండు
కుల మేల గుణశీలములె ప్రధాన మటంచు
నిలఁ బ్రపన్నుల కెల్లఁ దెలుప నెంచి
శ్రీకాంతునకు నెన్న నేకాంతభక్తుఁ డై
పరఁగుకాంచీపూర్ణభాగవతుని
భుక్తావశిష్టాన్నమును సాపడఁ దలంచి
యతనిఁ బ్రార్థించి సమ్మతిని గాంచి
స్వగృహమున కేఁగి విమలభావంబుతోడ
మెలఁగుచుండెడునన్నులమిన్న చేత
నసమవై ఖరి నిష్టమృష్టాన్నములను
సొంపుగను వంటకంబుఁ గావింపఁజేసి. 5

గీ. స్నానసంధ్యాద్యనుష్ఠానసమితిఁ దీర్చి
యవలఁ బెరుమాళ్ల నర్చించి యగ్గజేంద్ర
దాసురాకకు నై వేచి తడవు గాఁగ
నతనిఁ దోడ్కొనిచనుదేర నరిగె నపుడు. 6

చ. ఇతఁ డొకదారి నేఁగ మఱియింకొకదారిని వేగ నంతలో
నతఁ డిలు సేరి నే మిగులనాఁకొనియుంటిని నిల్వఁజాల నా

స్తుతగుణ యైనలక్ష్మణునిసుందరి యాహరిభక్తమౌళి కా
దృతి నొనరింపుచుం దనివి దీర నొసంగెను షడ్రసాన్నముల్.

ఉ. ఆఁకొనియున్నమర్త్యునకు నన్నము వెట్టుట లేమి కాకరం
బై కనుపట్టు దీనునకు నర్థ మొసంగుటయున్ విపన్నభా
వాకులుఁ డైనవాని కభయం బిడి ప్రోచుటయుం దలంప నీ
లోకములోనిధర్మములలోనఁ బ్రధానము లై తలిర్పవే. 8

క. సాపడి కాంచీపూర్ణుం
డాపై నాకరిగిరీంద్రుఁ డగుహరికడకున్
వే పోయి యచటఁ దచ్చే
వాపరుఁ డై మెలఁగుచుండె భక్తి దలిర్పన్ 9

మ. కమలాంబాతనుజన్ముఁ డోడుకొనిరాఁగన్ లక్ష్మణాచార్యుఁ డ
ట్లమితాసక్తి దలిర్పఁగాఁ జని యతం డచ్చోటునం గానిపిం
పమిచే వేఱొకదారి నేఁగె నని సంభావించుచుం గ్రమ్మఱన్
విమలాత్ముం డయి యాత్మసద్మమునకున్వేచ్చేయఁగానంతలోన్.

మ. అవశిష్టాన్నము రక్షమాంబికయు భృత్యశ్రేణికిం బెట్టి రెం
డవపర్యాయము పాకము న్నియమ మింపారంగఁ గావించుచుం
డ విలోకించి యతం డి దేల? యన నన్నారీపతంసంబు నె
ల్లవిశేషంబులఁ దెల్పఁగా విని నిరుల్లాసాత్ముఁ డై యాదటన్.

క. రామానుజభాగవత
స్తోమాగ్రణి నియమ మెసఁగఁ దొయ్యలి యొసఁగన్
స్వామికి నైవేద్యం బిడి
యామహనీయప్రసాద మపుడు భుజించెన్. 12

ఉ. సభ్యజనస్తవార్హత నెసంగెడులక్ష్మణదేశికోత్తముం
డభ్యవహారమున్ సలిపి యాయతభాగవతప్రచారవా
ల్లభ్యమునం దనర్చుకమలాసుతుదర్శన మాచరించి స
ర్వేభ్యత నొప్పునావరదు నెంతయు భక్తి భజింపఁ గోరుచున్.

క. కరము వడిన్ గుడికిం జని
కరివరదుని సేవ సేయుకాంచీపూర్ణుం
బరిపూర్ణభక్తితోడం
బరికించుచు నిట్లు విన్నపం బొనరించెన్. 14

చ. పరమకృపానిధీ ! యవనిపై నినుఁబోలెడువిష్ణుభక్తశే
ఖరులను గాన నేనెచటఁ గాన నిదే మదిలోన నమ్మి నిన్
శరణముచొచ్చినాఁడ విడనాడక వేడుక మీఱఁ బంచసం
స్కరణము లాచరించుచు వెసన్ నను ధన్యునిగా నొనర్పుమా.

చ. అనుడు గజేంద్రదాసుఁ డహహా! యిది యేమిటిమాటపాడియే
యను వగువిప్రవంశమునయందు జనించిననీకు నంఘ్రిజ
న్మని నను నిట్లు వేఁడుట గనుంగొనఁగా జగదేకగర్హ్యతం
దనరుచువర్ణసంకరత దార్కొను వైదికరీతి నీనుడుల్. 16

మ. కమలానందమఁ డివ్విధంబునను వక్కాణింప రామానుజుం
డమితప్రాజ్ఞత నొప్పఁగాన నది తథ్యం బౌ నటం చెంచి నె
య్యమున న్వేండియునమ్మహాత్ముఁగనియయ్యా!నాకొగిన్ముక్తిమా
ర్గము సూపం గృపమీఱ నవ్వరదునిం బ్రార్థింపుమీ నావుడున్.

క. నెయ్యమునం దాని కతం
డియ్యకొనన్ లక్ష్మణార్యుఁ డెద నలరుచుఁ దా

నయ్యెడ వెలువడి తనదుని
కార్యంబున కరిగి సౌఖ్యగతి నుండెఁ దగన్. 18

సీ. వరదయాత్మకుఁ డైన వరదరాజస్వామి
తన కిట్లు మది భక్తి పెనఁగొనంగ
నూడిగం బొనరించుచున్నకాంచీమౌని
యాశయంబు గ్రహించి యతనిఁ గాంచి
ఘనతరాఖిలజగత్కారణకారణం
బైనపరబ్రహ్మ మేనె యనియు
జీవేశ్వరవిభేదభావసిద్ధాంతవా
క్యంబు నిస్సందేహ మనియు మఱియుఁ
గడకు భక్తులకును మోక్ష మిడుదు ననియు
నెలమి నలపూర్ణగురు నాశ్రయింపు మనియు
నానుడులుగాఁగఁ దెలుపు రామానుజునకు
ననుచు నానతి యొసఁగ నయ్యనఘమతియు. 19

క. ఆమోదాద్భుతయుతుఁ డై
యామహితోదంత మపుడు సాంతముగాఁగన్
రామానుజార్యమౌళికిఁ
బ్రేమాతిశయం బెలర్ప వినిపించె రహిన్. 20

క. కమలాంబాసుతుఁ డట్లా
కమలాధిపుతలఁపుఁ దెలుపఁ గడు విస్మితుఁ డై
సుమనోన్వితుఁ డగులక్ష్మణ
సుమనోజనమౌళి పూర్వసుకృతవశమునన్. 21

క. హరికరుణ షడర్థంబుల
నరసి మహాపూర్ణసూరి నవలోకింపన్
సరగున శ్రీరంగపురీ
వరమున కరుగంగ యత్నపడి యవ్వేళన్. 22

క. పంచమహాసంస్కార
ప్రాంచితుఁ డై మించఁ దలఁచి బహువినయమతిన్
గాంచీపూర్ణునియనుమతిఁ
గాంచి కుటుంబంబుతోడఁ గదలి వెలువడెన్. 23

సీ. శ్రీరంగపురి నార్తి మీఱంగ యామునా
చార్యశేఖరుశిష్యవర్యు లపుడు
తద్వియోగజమహత్తరదుఃఖవారాశి
మునిఁగి యమ్మునిగుణమ్ములు గడంగి
కీర్తించుచును వానికిని సాటి యగుమేటి
స్వగురుపీఠమునకుఁ దగినవాఁడు
ఘనవిష్ణుమత మేలఁగలధన్యుఁ డెవఁడొక్కొ
యంచు నెంతయు విచారించుచుండ
సన్మతిఁ దదీయదుఃఖోపశమ మొనర్పఁ
దలఁచి కొందఱు వైష్ణవోత్తములు వారి
కనిరి సత్యవ్రతక్షేత్రమందు నొక్కఁ
డెసఁగు రామానుజాఖ్యుఁ డాదృశుఁ డటంచు. 24

చ. అని వచియించి వెండియు నుదారగుణాస్పదుఁ డై తనర్పు వ
య్యనఘుఁడు తప్ప వైష్ణవమతైకసమర్థనదక్షుఁ డుండమిన్

వీను మిదె పూర్ణదేశికమణీ! రమణీయయశస్కుఁ డైనయా
తనికడ కేఁగి నీవు సముదగ్రవచోరచనానుకూలతన్. 25

క. ఉపదేశము లొనరిచి య
చ్చపుదేశికవృత్తిఁ బంచసంస్కారంబుల్
కృప మెఱయ నెఱపి యతనిం
బ్రపత్తిమార్గంబు గఱపి మనుపఁగ వలయున్. 26

సీ. నెలవుగఁ గొన్నినాళ్లచట నీవు వసించుచు విష్ణుచిత్తము
ఖ్యులు స్వమతిప్రవృత్తి కుపయుక్తిగఁ జేసినగ్రంథకోటులం
గలుగురహస్యముల్ దెలిపి క్రమ్మఱ వశ్యుఁడుగా నొనర్చి ని
స్తులగుణశాలి యౌనతనిఁ దోఁకొని రమ్మిటకుం బ్రియంబునన్

మ. ఇటు లావైష్ణవు లెల్ల వేఁడికొన వల్లే యంచుఁ బూర్ణార్యుఁ డు
త్కటమౌభక్తి దలిర్ప రంగవిభునాజ్ఞం బూని వేవేగ మా
దట నచ్చోటుననుండి వెల్వడెఁ బ్రసిద్ధక్షేత్రరాజంబు నాఁ
బటుకీర్తిం గనుకాంచికానగరికిం భార్యాత్మజాన్వితుఁ డై.

క. అకలుషమతి యగునతఁ డు
త్సుకమతి నారీతి వెడల దొరఁకొని మధురాం
తక మనునూరికిఁ జనునం
తకు మున్నట కరుగుదెంచెఁ దగ లక్ష్మణుఁడున్. 29

క. అచ్చటను లక్ష్మణార్యుఁడు
ముచ్చట దీరంగఁ బూర్ణమునిఁ గవి వినయా
ఖ్యచ్ఛయ మచ్చుపడంగం
గ్రచ్చుఱఁ దచ్చరణములకుఁ గావించె నతుల్. 30

క. భక్తి మెయి నట్టు లొనరిచి
భుక్తియు ముక్తియు నొసంగి ప్రోచుట కెంతే
శక్తి గలరంగధామము
వ్యక్తమమత్త్వైకసంపదభిరామంబున్. 31

గీ. విడిచి సకుటుంబముగ నీవు విబుధవర్య
యెచటి కిపు డేఁగుచుంటివి ? హేతు వెద్ది ?
సర్వమును దెల్పు మన సవిస్తరత నతఁడు
నంతయు వచించె రామానుజార్యమణికి. 32

ఉ. భూరియశుండు పూర్ణగురుపుంగవుఁ డంతయు నట్లు దెల్పుడున్
గూరిమి లక్ష్మణాఖ్యబుధకుంజరుఁ డాతనితోడఁ బంచసం
స్కారము లాచరించి యధికం బగుసత్కృప మీఱ ఘోరసం
సారపయోధినుండి ననుఁ జయ్యన నియ్యెడ నుద్ధరింపు నాన్.

క. పూర్ణగురుం డది విని సం
పూర్ణకృపారసము డెందమునఁ బెనఁగొనఁ గా
నర్ణవసమగాంభీర్యో
దీర్ణుం డగులక్ష్మణాఖ్యదేశికుతోడన్. 34

క. ఎల్లియె కాంచీపురమున
కల్లన మన మెల్ల నరిగి యచ్చోటున నీ
యుల్లమునం గలతలఁపుం
జెల్లించెద వరదరాజుచెంగట ననుడున్. 35

సీ. రామానుజాచార్యుఁ డామాట లాలించి
యతనిఁ గన్గొని యోమహానుభావ !

తనువు విద్యుత్ప్రాయ మని యెఱింగియు నిట్లు
వచియింపఁగా నీకుఁ బాడి యగునె ?
నాఁడు యామునమౌనిఁ జూడ వేడుకతోడ
మనము శ్రీరంగధామమున కరిగి
వ్యర్థాభిలాషుల మై యంతలోననె
మదిఁ గుంది టది నీవు మఱచితయ్య !
కావునను నన్నుఁ బంచసంస్కారయుక్తు
ధన్యునిగఁ జేసి కాపాడఁ దగును వేగ
జనుల కుపకృతి యొనరించి మనుచుకంటె
నవని వేఱొకధర్మకార్యంబు గలదె ? 36

చ. మహిని శుభస్య శీఘ్ర మనుమాట ప్రసిద్ధము కాదె కావునన్
మహితగుణాంబుధీ ! యిపుడె మానక నన్ను సమగ్ర మౌనను
గ్రహమునఁ బంచసంస్కృతుల రాజిలఁజేయుచుఁ బ్రోవుమీయన
న్నహజకృపాఢుఁ డౌపెరియనంబియు దానికి సమ్మతించుచున్.

సీ. లక్ష్మణార్యుని నక్కాలంకునఁ గ్రుంకి ర
మ్మని చాపశరధరుం డై తనర్చు
నలరామచంద్రుదివ్యం బగుసన్నిధా
నంబున విధివిధానంబు గాఁగ
జపహోమముఖ్యముల్ సలిపి సుదర్శన
పాంచజన్యంబులఁ బరమనియతి
విమలగంధసుమాక్షతములతోఁ బూజించి
భక్తిమైఁ దనపురోభాగమునను

స్నాతుఁ డై మోడ్పుఁ గే లొప్ప సవినయముగఁ
గూరుచున్న రామానుజసూరివరుని
భవ్యలక్షణయుత మైనబాహుయుగము
దప్తశుభశంఖచక్రాంకితం బొనర్చె. 38

క. ఆపగిదిఁ బంచసంస్కా
రోపేతుని జేసి వెండియును బూర్ణగురుం
డాపన్నులఁ గాపాడఁగ
నోపెడుతిరుమంత్ర మతని కుపదేశించెన్. 39

క. అంతన్ లక్ష్మణుఁ డెంతయు
సంతుష్టస్వాంతుఁ డగుచు శారదరజనీ
కాంతునివలె నిర్మలుఁ డై
కాంతం బగుకాంతిచేఁ బ్రకాశించెఁ గడున్. 40

క. శ్రీవైష్ణవలక్ష్మీసం
సేవితుఁ డై బాలసూర్యచెలువునఁ దగునా
ధీవరుని గని మహాపూ
ర్ణావనిసురమౌళి యిట్టు లనియెం బ్రీతిన్. 41

ఉ. యామునదేశికోత్తమునియాదట వైష్ణవసమ్మతప్రతి
ష్ఠామితకీర్తిలక్ష్మిసముపార్జనముం బొనరించి వారలన్
వేమరు వేలుధీవరుఁడు నీ వొకరుండవు దక్కఁ లేఁ డటం
చోమహితానుభావ ! భవదుజ్జ్వలతేజము చూడఁ దోఁచెడున్.

క. అనవుడు మహాప్రసాదం
బని వినయ మెలర్ప లక్ష్మణాఖ్యుఁడు పూర్ణా

ర్యనకుం బహుబహుమానము
లొనరిచి పెరవారిఁ దనిపె నురుసత్కృతులన్. 43

గీ. పెరియనంబిని దోడ్కొని పిదప నతఁడు
కాంచికాపురి కరిగి ప్రాకటయశంబుఁ
గాంచి మించెడునలతిరుకచ్చినంబి
కయ్యుదంతంబు దెలిపెను సాంతముగను. 44

గీ. మఱియు నాతఁడు తనదుసద్మమున కరిగి
విత్త మెంతేని గురుని కర్పించి వాని
సన్నిధిని బూని యాఱుమాసములలోన
ద్రావిడామ్నాయముల నెల్లఁ దగఁ బఠించె. 45

శా. అంతన్ లక్ష్మణదేశికేంద్రుఁ డొకనాఁ డభ్యంగకైంకర్యవి
శ్రాంతింగ్లాంతి వహించి యాఁకొనినగోత్రాదేవిపుత్త్రిం గృపా
స్వాంతుం డై పరికించి పర్యుషితశేషం బున్నచో వీని కో
కాంతా! పెట్టు మనంగ వానిసతి నిక్కం బింతయున్ లే దనన్

క. భూతదయాళుం డై తగు
నాతఁడు తత్క్షణమ లోని కరిగి చరయుచున్
శీతోదన మొకచోఁ గని
యాతత మగుకినుక దోఁప ననె నంగనతోన్. 47

శా. ఔనే! యోసి నికృష్టురాల! తగునే యన్నం బిటు ల్లే దనన్
దీనత్రాణపరాయణత్వమునఁ గాదే యైహికాముష్మికా
నూనాభంగసుఖంబు సేకుఱుట యోహో! క్రౌర్యభూయిష్ఠముల్
గా నీరేజదళాయతేక్షణలయుల్లంబుల్ విమర్శింపఁగన్. 48

క. అని యెన్నేనివిధంబుల
వనితాతతి దూఱనాడి పాయనికోపం
బున మనములోనఁ దనభా
మినిఁ గూరిచి హేయపడుచు మిన్నక యుండెన్. 49

క. పిదప నొకానొకదినమున
నుదకార్థము రక్షకాంబయును బూర్ణకళా
విదునువిదయు నొకనూతికిఁ
బదపడి చని దానిలోనివారిం గొనుచోన్. 50

మ. అమితాగారవిధిస్పృహారచితవేగాకర్షణాలోలతన్
గమలాంబాత్మజునాతిచేతియకలంకస్ఫూర్తిమై నొప్పుపా
త్రములోనుండి పయఃకణం బొకటి యారక్షాంబికాసాధ్వీపా
త్రములోనం బడుమాత్ర నాపె యతిమాత్రక్రోధసంవిష్టయై.

క. కొన లెఱ్ఱువాఱఁ జెందొవ
లను గ్రేణియొనర్చుచూడ్కులం గురుపత్నిన్
గని కొఱకొఱలాడంగా
ననె నాసతి యిట్లు రక్షకాంబికతోడన్. 52

క. నాపై నీ వీపగిదిన్
గోపింపఁగఁ దగునె ? నీకు గురుసతిని గదా
నాపాదతీర్థ మేనియు
నోపుఁజుమీ నీదుపాప మొయ్యనఁ బాపన్. 53

క. కావున మద్ఘటజలములు
తావకపాత్రమునఁ బడుట తరుణీమణిరో !

పావన మగుటకుఁ గాదే
కేవల మీలీలఁ గోపగింపఁగ నేలా ? 54

క. అనవుడు నారజాంబా
వనితాజనతిలక మలుక స్వాంతములోనన్
బెనఁగొని కడుఁ దొలుకాడం
గను గాంచీపూర్ణతరుణిఁ గాంచి వచించెన్. 55

మ. అవునే నీకుల మేడఁ? జూడఁగ మదీయం బౌకులం బేడ? నీ
నవుఁబాట్లం బడుభాగ్య మేడ? ఘన మౌనావైభవం బేడ? న
న్నవివేకంబు దలిర్ప కిక్కరణి నత్యంతావలేపంబుచే
నవమానం బొనరింప నేల? యిది నీ కర్హంబుగాఁ దోఁచెనే?

క. హీనకులంబునఁ బుట్టి య
నూనమదావేశవృత్తి నొడ లెఱుఁగవు గా
పూని పయఃకణముల నా
పై నీగతిఁ జిమ్మ నీకుఁ బాడియె కొమ్మా! 57

క. వారిరువు రిటులఁ జటుల
ప్రారంభోజ్జృంభమాణభాషణభణితిన్
బోరాడి యాడి స్వీయా
గారంబుల కేఁగి రపుడు కడు వేగమునన్. 58

క. అందుం గాంచీపూర్ణుని
సుందరి తనమందిరంబుఁ జొచ్చి మగనితో
నందలివృత్తాంతము వెత
నొందుచు విజ్ఞాపనంబు నొనరించుటయున్. 59

క. ఇచ్చోట నుండఁ దగ దిఁక
నెచ్చోటికి నైన నరుగ నెక్కుడుసౌఖ్యా
భ్యుచ్చయ మగు నని తలఁచుచు
విచ్చఁ దిరుక్కచ్చినంబి హెచ్చినకూర్మిన్. 60

ఉ. ఆక్షణమందె వెల్వడుచు నంబురుప్రోక్షణతోడ నేఁగెఁ దా
నక్షయమోక్షసౌఖ్యకల నైకవితీర్ణవిచక్షణాత్మసం
వీక్షణసంవిధానకృతకృత్యమహాజనమండలప్రచా
రక్షణకారి యై యలరురంగవిభూత్తమురాజధానికిన్. 61

సీ. మఱునాఁడు కేశవమఖితనూజుఁడు తిరు
క్కచ్చినంబిగృహంబు సొచ్చి యచట
నతనిఁ గానక కుటుంబాన్వితుఁ డై రంగ
పురి కేఁగె నని విని పెరియనంబి
కడకును జని కతం బడుగంగ నతఁడు కూ
పసమీపమునను మీవనజముఖులు
కలహమాడిరి దానఁ గావించె నతఁ డట్లు
వరదునకే గాని వైరహేతు
వరయ రా దని వచియింప నధికదుఃఖ
పరవశుం డౌచు లక్ష్మణగురుఁడు స్వగృహ
మునకు నరుదెంచి పోరాటమును గుఱించి
యతివవలనను సకలంబు నాలకించి. 62

క. అంత నమర్షోత్కర్షా
త్యంతారుణనయనుఁ డయ్యె నిజాంగనఁ గని య్యో

కాంతా ! నాయెడల న్నీ
వింతకు ము న్నోసి ! జేసి తెన్నియొ తప్పుల్. 63

క. ఆనేరము లెల్లం గృపఁ
బూని సహించితిని గాని పొలఁతిరో ! యింకన్
నేనోర్పు నేయఁ జాలన్
సీ ! నీ కీయననుకూలశీలం బేలా ? 64

సీ. అనుకూలశీల యై తనరెడునిల్లాలు
తనమాటజవదాఁట కొనరుసుతుఁడు
మర్యాదఁ గాపాడి మన్నించునెకిమీఁడు
కలకాల మొకరీతి మెలఁగుసఖుఁడు
కష్టసుఖంబులఁ గడఁగి తోడ్పడుబంధు
వుపధావిశుద్ధిచే నొప్పుమంత్రి
క్షమయు సామర్థ్యంబు గలిగి వక్తలునొజ్జ
యమృతహస్తం డౌచు నలరువెజ్జు
కుశల మొనగూర్పఁజాలువాక్శుద్ధి గాంచి
యెసఁగుసత్కవివర్యం డభీష్టసిద్ధు
లొసఁగునిలువేల్పు గలుగు టనూనపూర్వ
పుణ్యసముదాయపరిపాకమునను గాదె. 66

క. నీ వట్లు గాక మామక
భావవ్యతిరేకవృత్తి వర్తించెద వౌఁ
గావున నోవనితరో ! యిపు
డే వేగమ పుట్టినింటి కేఁగుము నాఁగన్. 66

క. గడగడ వణఁకుచు నొడయని
యడుగులపైఁ బడి పడంతి యతిదీనతతోఁ
గడు వేఁడుకొనినఁ గోపం
బుడిగి దయాజలధి యాతఁ డోర్మి వహించెన్. 67

మ. కరుణాళుం డగువానికోపమును నైకస్తోత్రపాత్రక్రియా
పరతంత్రుం డగువానిపాపము జగద్భర్తృప్రపూజావిధా
దరుఁ డై యొప్పెడువానినిర్భరమహాతాపత్రయాటోపమున్
ధరపైఁ గల్గవు గల్గినన్ క్షణములోనం జెందవే లోపమున్.

గీ. మఱియు నొకనాఁడు పిదప లక్ష్మణగురుండు
వరదరాజాంఘ్రికైంకర్యపరతనుండు
నపు డొకానొకవిబుధుఁ డౌనవనివిబుధుఁ
డరిగి యాఁకొంటి నని యన్న మడుగుటయును. 69

క. ఆఁకొన్నవాని నార్తున్
భీకరదారిద్ర్యదుఃఖపీడితు నతిమా
త్రాకలితబుణనిమగ్నుం
జేకొని రక్షించుఫలముఁ జెప్పఁగ వశమే? 70

చ. అని మది నెంచి లక్ష్మణబుధాగ్రణి యాబుధమౌళిఁ గాంచి యో
యనఘ! వెసన్ మదీయనిలయంబునకుం జనుమయ్య! స్వామినే
వనమున నుంట నే నటకు వచ్చుటకుం గొఱ గాదు దీని నా
వనితకుఁ జెప్పు మన్న మిడు భక్తి దలిర్పఁగ నీకు నావుడున్.

మ. అతఁ డానంద మెలర్ప లక్ష్మణునిగేహం బంతటం జొచ్చి త
త్సతి కాసంగతి దెల్పి యన్న మిడి నన్ దల్లీ! వెస న్బ్రోవు నావ్

మతిలోనం గృపమాలి యన్నమును గిన్నం బేమియు న్లేదటం
చతికోపంబున నాపె నిష్ఠురతరవ్యాహారముల్ పల్కుచున్.

గీ. నిలువ నిచ్చోట నీ కింక నిముస మైన
వలదు వలదయ్య ! భూసురప్రవర ! యిపుడె
పొమ్ము పొ మ్మనఁ గ్రన్ననఁ బోయి యాతఁ
డంతయును దెల్పె రామానుజార్యమణికి. 73

చ. అనఘుఁడు కోవిదుండు నగునయ్యవనీసురుఁ డట్లు తెల్పుడున్
విని యనివృత్తకోపుఁ డయి వేయివిధంబుల నాతఁ డాత్మలోఁ
దనసతిఁ గూర్చి హేయపడి తప్పక యిప్పుడె పుట్టినింటికిం
బనిచెద నెద్దియే నొకనెపంబున నిచ్చెలి నంచు నెంచుచున్.

గీ. తమ్మునకుఁ బెండ్లి గావున ర మ్మటంచు
నాపె జనకుండు లిఖియించినట్టు లొక్క
కమ్మ సృజియించి నూత్నాంశుకమునఁ గట్టి
పనిచె నొకవిప్రుచేఁ దనవనితకడకు. 75

క. అనృతమున కిట్లు పాల్పడి
తనరెడులక్ష్మణబుధావతంసం బెన్నన్
ఘన మైనజగద్గురుపద
మనువొందఁగ నధిగమింప నర్హం బగునా ? 76

క. తనయంగన యపమార్గం
బునఁ జొచ్చిన నరసి నేరుపున మఱలింపం
జనుఁ గాని యెద్దియేనిం
బెనుఁబూవికఁ బూని దాని విడువం దగునా ? 77

గీ. అనుచు నీరీతిగా నెల్లజనుల కవని
మదిని సందియ మొదవిన నొదవుఁ గాక
గురునిభుం డగులక్ష్మణగురువరేణ్యు
పూన్కి మాత్రంబు గర్హ్యతఁ బొరయ దరయ. 78

సీ. అణుమాత్ర మేనియు నాత్మలాభము లేక
ప్రాణిహింసకుఁ గాక పరఁగు నెద్ది
యభయప్రదానకార్యైకనిర్వహణ మై
యార్తరక్షణప్రౌఢి నలరు నెద్ది
యసమానకారుణ్యరససూచకం బౌచు
నఖిలోపకారార్థ మైన దెద్ది
ఐహికనిస్తులపుణ్యఫలపరిణామ మై
నిష్కపటనిరూఢి నెగడు నెద్ది
యట్టియనృతంబు నాడిన నాడవచ్చు
దాని నెట్టిసుధీవరుం డైన మెచ్చు
నరసి పరిశీలన మొనర్ప నదియుఁ దుదకు
స్థిరతరంబుగ నొప్పు సత్కీర్తి నిచ్చు. 79

క. ధర్మములు కొన్ని పైకి న
ధర్మంబులుపోలెఁ దోఁచు ధాత్రీస్థలిపై
ధర్మంబులట్ల కొన్ని య
ధర్మంబులుగూడఁ బైకిఁ దప్పక దోఁచున్. 80

చ. ఫలములు కొన్ని పైకిఁ గడు బాగుగనున్న భుజించుచో రుచుల్
గొలుపవొకించుకేనియును గొన్ని యసహ్యములయ్యుఁ జూడ్కికిన్

బలురచు లీనుఁ గా దినిన; మర్త్యు లొనర్చెడుచేఁత లట్లు యా
పలనుగఁ గర్తృభావములు పర్యవసానమునం గనంబడున్.

క. సతి విడుటకంటెఁ బాపము
క్షితిలో లే దండ్రు గాని కేవల మాత్మ
ప్రతికూల యేని దానిన్
హితిమతి విడినను విరాగి కె గ్గేల యగున్? 82

మ. అనవద్యంబు ననామయంబు ననపాయం బప్రమేయంబు పా
వనముం బాపవిదూర మై తగుపరబ్రహ్మంబు మల్లంబునం
దనిశంబున్ విషయస్పృహారహితుఁడై ధ్యానించుధన్యాత్ముఁ డే
పనిఁ గావించినఁ గాని వాని నిల సంభావింపరే మానవుల్.

గీ. అట్లు తనభార్యఁ బుట్టింటి కనిచి పిదపఁ
దపము దానంబు నెద్దియు నుపమ గావు
భావుకం బగుసన్న్యాసపదవి కనుచు
బుద్ధి నెంచి వివేకవిస్ఫురణఁ గాంచి. 84

క. ధనకనకవస్తువాహన
ఘనసంపద లెల్లఁ గొల్లగా బీదలకున్
వినియోగం బొనరిచి దై
వనియోగంబుననుజేసి వైరాగ్యమునన్. 85

శా. లోకం బుద్ధరణం బొనర్పఁ గరుణాళుం డై త్రిదండాదులన్
వీఁకం గైకొని లక్ష్మణార్యవరుఁ డావేదండశైలప్రభుం
డౌకంజాక్షుసమక్షమం దసమదీక్షారూఢిఁ దుర్యాశ్రమ
స్వీకారం బొనరించె యామునగురుం జిత్తంబునం దెన్నుచున్.

క. శఠకుమతారణ్యానీ
కుఠార మగులక్ష్మణార్యకుంజరుఁ డొకస
న్మఠమున నచట వసించెన్
శఠజిన్ముఖనిత్యసూరిసంఘాగ్రణి యై. ॥

క. కాంచీనగరనివాసులు
ప్రాంచితనయవినయభక్తివైరాగ్యంబుల్
మించఁగ లక్ష్మణగురు సే
వించఁగఁ జనుచుంద రెపుడు విడువనివేడ్కన్. ॥

చ. వితరణదీనరక్షణవివేకగుణస్ఫురణాఢ్యుఁ డైనభూ
పతియును నాయకానుగుణపావనవర్తనకీర్తనీయ యా
సతియు నహంక్రియారహితసర్వసమానవిరాగశీలుఁ డౌ
యతియు నశేషపండితగణాదరణీయతఁ గాంచి మించరే। ॥

గీ. సొగసు మీఱెడుకాంచికానగరమునకుఁ
దూర్పుదెస నొప్పు విస్తృతదురితసముద
యైకపరిహార మగునొక్కయగ్రహార
మనిశసంవీక్ష్యవిద్వద్విహార మగుచు. ॥

చ. పొడువు వెడల్పు గల్గి యిరుపొంతల నారికెడంపుమ్రాఁకు శే
ర్పడ సొబగొందువీథులును బా గగుతీయనినీటికూపముల్
గడుసొగ సౌగృహంబులు చెలంగఁ గనుంగొనువారు సంతసం
పడ నది సొంపుగన్ బురుషమంగళసంజ్ఞ నెసంగు నిమ్మహిన్.

చ. అచట ననంతదీక్షితసమాఖ్యుఁ డఖండలసత్సమాఖ్యుఁడున్
రుచిరగుణౌఘధామ్యుఁడు నిర్ధూతతమోజనితైకధామ్యుఁడున్

ప్రచురకలాకలాపకుఁ డపారకృపాలహరీకలాపకుం
డచలమనోవిభాసురుఁడు నౌనౌకభూసురుఁ డుండె నర్మిలిన్.

గీ. అతఁడు కేశవమఖికూర్మిసుతను సుతను
విలసితను బెండ్లియాడి యావెలఁదియందుఁ
గొమరు భరతాంశమును గాంచి యమరువాని
శరధిగంభీరుఁ గనియె దాశరథినాము. 93

మ. భరతాళ్వారులపావనాంశమున భూభాగంబునం బుట్టి శ్రీ
హరిభక్తిం దనరారుదాశరథి లోకాతీతమాహాత్మ్య ని
ర్భరతేజున్ దనమేనమామ యగునారామానుజుం గాంచికా
పురిఁదుర్యాశ్రమవృత్తినుంటవినియామోదంబునన్ మించుచున్

శా. అంతం గాంతిమతీతనూభవవిలోకాపేక్ష డెందంబునం
దెంతే ప్రేరణ మాచరింప స్వసదైశైకస్ఫురద్వేగవ
త్యంతర్వారి సకృద్విగాహమున లోకానీకతాపత్రయ
క్లాంతిం బాపఁగ నోపు కాంచికి సముత్కంఠాత్మకుండై చనెన్.

క. దాశరథిసహజసముఁ డా
దాశరథి యటుల్ ముదంబు దనరఁగ దైవా
దేశమున నరిగి లక్ష్మణ
దేశికుదర్శన మొనర్చి స్థిర మగుభక్తిన్. 96

గీ. అతనిచరణారవిందంబు లాశ్రయించి
యలరుచుండ ననంతభట్టార్యమణికి
రఘువరాంశంబునను బుట్టి ప్రబలునట్టి
కూరనాథుండు నాతనిఁ గొలువ వచ్చె. 97

క. వా రిరువురుఁ దత్పదసే
వారూఢి మెలంగుచుండ నయ్యతిపతియున్
గూరిమి నుపదేశించెన్
వారలకు నశేషవైష్ణవగ్రంథములన్. 98

క. ఇట్టు లుండఁగ నొకనాఁ డు
త్కటయశుఁ డగుయాదవప్రకాశుజనని వి
స్ఫుటనియతి గుడికిఁ జనుచోఁ
దటుకున నొకమఠముఁ గాంచి తన్మధ్యమునన్. 99

సీ. ఒప్పుమీఱెడుద్వాదశోర్ధ్వపుండ్రంబుల
జనులచూడ్కికి విందు సలుపువాని
మహితత్రిదండకమండలుకాషాయ
వసనంబులను దాల్చి యెసఁగువానిఁ
దరుణారుణప్రభాతతుల నల్గడల నీ
నెడుపావనం బగునొడలివాని
వేదవేదాంగముల్ వెయినోళ్ల శిష్యుల
కుపదేశ మొనరింపుచున్నవాని
సకలసద్గుణసాంద్రు లక్ష్మణయతీంద్రుఁ
గాంచి సాక్షాదనంతుని గాఁగ నెంచి
మించినప్రపత్తితోడ నర్మిలి భజించి
మఱలి తనమందిరంబున కరుగుదెంచి. 100

క. తనతనయుఁ డైనయాదవుఁ
గనుఁగొని యి ట్లనియె నీవు కడునమ్మికతో

వినవయ్య లక్ష్మణార్యుం
డనంతుఁ డగు సుమ్ము నమ్ముమయ్య కుమారా! 101

క. ఘనుఁ డయ్యు లక్ష్మణార్యుఁడు
వినయంబునె చూపుచుండుఁ బెద్దలకడ స
జ్జనుల కది సహజ మౌ నెం
దును గనుఁగొన నిండుకుండ తొణఁకునె? వత్సా!

క. శ్రీమన్నారాయణుఁ డన
రామానుజగురువరుండు రాజిలుచుండెన్
కోమలము లైనతత్పద
తామరసంబుల భజించి ధన్యుఁడ వగుమీ. 103

క. అవమానబుద్ధి నాతని
నవలోకింపకుము తొంటియట్ల యతండీ
భువి ధర్మము నిలుపుటకై
యవతరణ మొనర్చె శౌరియనుమతివలనన్. 104

క. ఆలింపు మయ్యపటువి
ద్యాలసదాచారముఖ్య మై తగుబాహ్యో
ద్వేలపరిధవము నిర్జి
వాలంకారంబుపగిది వ్యర్థంబె కదా. 105

చ. భువనములన్ సృజింపఁగను బ్రోవ నణంపఁగఁ దాన కర్త యై
యవిరళతేజ మొప్ప జగ మంతయు నిండి వెలుంగు నెవ్వఁ డా
ప్రవిమలుఁ డైనవిష్ణునిఁ బరాశరముఖ్యులు గొల్చి నిత్యపై
భవమును గాంచి రట్లగుట భావనసేయుము నీవు నవ్విభున్.

క. ఉరువడి లక్ష్మణగురువరు
తిరువడిపు ళ్లాశ్రయించి దివ్యానందా
కర మగుపదవిం గనుమీ
ధరమీఁదన్ వానిఁ గొలిచి తప్పక మనుమీ. 107

మ. అని బోధించిన యాదవాహ్వయసుధీంద్రాగ్రేసరుం డాత్మలో
ననుమానించుచుఁ దన్మతంబునకు శిష్యగ్రామణుల్ వెంట రాఁ
జని యాలక్ష్మణు శంఖచక్రయుతు విస్ఫారోర్ధ్వపుండ్రాంకితుం
గని యౌరా! యిది యేటిపై ఖరి మదిం గర్వ్యాంబుగాఁ దోఁచదే.

శా. స్ఫారప్రజ్ఞ దలిర్పఁగా నుపనిషద్భాష్యార్థతత్త్వవగా
హారూఢిం గని నిర్జితేంద్రియత సన్న్యాసాశ్రమప్రాభవ
శ్రీ రంజిల్లఁగఁ దాల్చి నిస్పృహుఁడ వై చెన్నొందునీ కీగుణి
త్వారోపం బొనరించు టెన్న నుచితంబా? నిర్గుణబ్రహ్మపైన్.

గీ. శంఖచక్రోర్ధ్వపుండ్రలాంఛనము లీవు
బాహుకాంగంబులను దాల్చి పరఁగియుంట
నిర్గుణుం డగుపరమాత్మునికి గుణిత్వ
కల్పనము సేయుచున్నట్లు కానిపించు. 110

క. దానికి శాస్త్రములం దెం
దైనఁ బ్రమాణంబు కలదె? యన లక్ష్మణుఁ డా
ధీనిధితో నుడువఁగ వి
ద్యానిలయుని గూరనాథు నాజ్ఞాపించెన్. 111

క. గురునాజ్ఞ నౌదలం గొని
గురువిజ్ఞానమునఁ దనరుకూరేశుం డా

గురుసన్నిభుఁ డగుయాదవ
గురున కిటుల్ దెలుపఁ దొడఁగె గురువాక్ప్రౌఢిన్. 112

ఉ. సాదరబుద్ధిఁ జిహ్నముగ స్వాంగములం గమనీయశంఖచ
క్రాదులఁ దాల్పఁగా వలయు నంటకు విష్ణువె దేవతాళిలో
నాదిముఁడుత్తమోత్తముఁడునంటకుఁజూపెదనేఁబ్రమాణముల్
యాదవదేశికేంద్ర! వినుమా యనుమానము మాని నానుడుల్.

మ. ధరపైఁ గల్గుముముక్షువుల్ నిజభుజాదండాగ్రభాగంబులన్
బరితప్తామలశంఖచక్రముల భాస్వల్లీలమైఁ దాల్చి భీ
కరసంసారపయోధి దాఁటుదురు వీఁకన్ స్వప్రతీకంబులన్
వరభక్తిం ధరియింత్రు విష్ణునితరప్రాచీనచిహ్నంబులన్. 114

గీ. సహజపావనశిఖి శౌరిచక్రమునకు
వేయియంచులుగా నొప్పు; వెలయు నదియె
నేమి యై; దానిచేఁ దప్తుఁ డౌమనుష్యుఁ
డలరు సాలోక్యపదవి బ్రహ్మమును గూడి. 115

సీ. జన్నిదంబులరీతి శంఖచక్రాదుల
నెల్లవైష్ణవులు వహింప వలయు
బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులు కృత
చిహ్నులై హరిని బూజించు టొప్పు
నష్టాక్షరీమంత్ర మట్టిద నటనర్త
కాదుల కేని చక్రాంకనంబు
శూద్రుఁ డేనియుఁ జక్రముద్రితుం డొందు స్వ
ర్గము విప్రుమాట వల్కంగ నేల!

తొడరి యజ్ఞోపవీతంబుఁ దొడుగకున్నఁ
దప్తచక్రాంకనంబును దాల్పకున్న
నెలమి ద్వయమంత్రమును జపియింపకున్న
బ్రాహ్మణుం డేని చండాలభావ మొందు. 116

గీ. ఆపదలు వోవఁ జక్రితో నైక్య మొంద
నెల్లకర్మమ్ములును ఫలియింప ద్విజులు
దక్షిణభుజంబునందు సుదర్శనంబు
వామమున శంఖమును దాల్పవలయు నెపుడు. 117

తరల. హరిపదాకృతిసుందరం బయి యంతరంబున శూన్య మై
తరము మీఱెడునూర్ధ్వపుండ్రముఁ దాల్చువా రతిపుణ్యు లై
పరమపూరుషు నాదిదేవుని బంకజాక్షు నెఱింగి సం
సరణబంధము వాసి పోదురు సర్వపాపవిముక్తు లై. 118

సీ. శంఖచక్రాంకితుల్ జలజాక్షమాలికా
ధరులు లోకముఁ బవిత్ర మ్మొనర్తు
రతిభక్తి శంఖచక్రాంకితులకుఁ బ్రణ
మిల్లిన దొరకు సామీప్యముక్తి
శంఖచక్రాంకులస్మరణమ్ముఁ గావింపఁ
బాపపుంజము పటాపంచ మగును
ధరణి గోష్పదమాత్రం బేని శంఖచ
క్రాంకుల కిడిన రాజ్యము లభించు
శంఖచక్రాంకితుం డయి జానుమీఱు
హరియొకఁడె సర్వలోకపరాయణుండు

వెన్నుఁడె సనాతనుం డెల్లవేల్పులందుఁ
గాన నారాయణుని గొల్వఁగా వలయును. 119

క. అని కూరనాథుఁ డతనికి
మన మలర శ్రుతిస్మృతిప్రమాణములం జూ
పెను నిజమతసంస్థాపన
మొనరింపఁగఁ జాలువాని నొగి నెన్నెనిన్. 120

గీ. అట్టు లయుతప్రమాణవాక్యముల నతఁడు
హరిపరత్వంబు శంఖచక్రాదిధార
ణైకముఖ్యత్వమును బరమాత్మునెడల
గుణసనాథత్వమును నిరూపణ మొనర్ప. 121

క. విని యాదవుఁ డచ్చెరువుం
గని యేమియుఁ బలుక లేక కడు లజ్జితుఁ డై
తనమతముఁ జేరి సంశయ
మునఁ గింకర్తవ్యతావిమూఢాత్ముం డై. 121

క. ఆరేయి న్నిదురింపఁగ
నీరేజదళాక్షుఁ డాతనికి స్వప్నములో
నారామానుజుఁ గొలిచిన
పారం బగునిత్యసుఖము సమకుఱుఁ గానన్. 123

క. శయములను మోడ్చి నిస్సం
శయముగ నాలక్ష్మణార్యసత్పాదకుశే
శయముల నిపు డకలంకా
శయమున సేవింపఁ జనుము సయ్యన నాఁగన్. 124

క. వరదునియాజ్ఞన్ యాదవ
గురుమణి శిరసా వహించుకొని లక్ష్మణునిం
బరిచర్య సలుపు తలఁపున
నరిగెన్ నిష్కపటవృత్తి నలరుప్రపత్తిన్. 125

గీ. క్షిప్రముగ నట్లు చని యాదవప్రకాశ
గురుఁడు లక్ష్మణదేశికుచరణకమల
ములకు వలగొని సాష్టాంగముగను మ్రొక్కి
వినయపూర్వకముగ నిట్లు వేఁడుకొనియె. 126

గీ. ఓమహాప్రాజ్ఞ! గురువర్య! యోమహాత్మ!
శరణముగ నీదుచరణముల్ గరము మదిని
నమ్మి వచ్చితి నిఁక భవార్ణవమునుండి
పృథులకృప మీఱ న న్నుద్ధరింపు మయ్య! 127

సీ. శరణాగతత్రాణబిరుద మూనుటకంటె
వసుధ నింకొకమహావ్రతము లేదు
దీనరక్షాదీక్షఁ దేజరిల్లుటకంటెఁ
దలపోయ నొండొకతపము లేదు
ఆడి తప్పనిసూనృతాప్తి నొప్పుటకంటె
నిర్ణయింప మఱొండునియతి లేదు
పరవధూవైముఖ్యపరత నుండుటకంటె
మఱి వేఱె యాచారగరిమ లేదు
సమధికస్ఫూర్తి సర్వభూతములయందు
దయగనుటకంటె నిఁక సుకృతంబు లేదు

అలయహింసానిరూఢిచే మెలఁగుకంటె
లెక్కఁగొన నొండుధర్మంబు లేదు లేదు. 128

మ. అనుచుం బ్రార్థన మాచరింప విని యయ్యత్యగ్రగణ్యుండు ప్ర
సన్నుఁ గారుణ్యరసార్ద్రమానసుఁడు గానన్ యాదవార్యాగ్రణిన్
మనుపం బూని స్వకీయదివ్యమతసీమన్ బంచసంస్కారవం
తుని గావించెను గూరనాథముఖు లెంతో వేడ్కఁ వీక్షింపఁగన్.

గీ. మఱియు గోవిందదాసనామం బొసంగి
వైష్ణవమహామతావలంబనము లైన
గ్రంథరాజంబు లెల్ల లక్ష్మణగురుండు
యాదవార్యున కుపదేశ మాచరించి. 130

క. మును వైష్ణవసన్న్యాసుల
ననఘాత్ముల దూఱనాడినట్టియఘంబుల్
మునుకొని తుత్తుము రై చన
ఘనవిద్వజ్జనము మెచ్చఁగను గడఁగి రహిన్. 131

క. క్షితిపైఁ ద్రిదండసన్న్యా
సి తైకవిధిబోధనంబు సేయఁగ వను వౌ
యతిధర్మసముచ్చయ మను
కృతి నొకటి రచింపు మనుచుఁ బ్రేరేపించెన్. 132

మ. పరమోత్కృష్టగుణుండు యాదవపరివ్రాజర్షభుం డయ్యనం
తర మాలక్ష్మణదేశికప్రవరుచెంతం గొంతకాలం బటుల్
దిర మౌభాగవతప్రపత్తి గని భక్తిజ్ఞానముల్ మించ శ్రీ
హరినిధ్యానపరాయణైకహృదయుం డై యుండి కొన్నాళ్లకున్.

క. సదమల మగు వైరాగ్యం
బెదఁ బొదలఁగ నొక్కనాఁడు పృథుమహిమశ్రీ
పదము ననిర్వాచ్యసుఖా
స్పదమును నై పొదలుపరమపదముం గాంచెన్. 134

శా. ఆరామానుజుఁ డందుఁ జూపఱకు నేత్రానందముం గూర్చుచున్
ధీరంజిల్లఁగ నెల్లవారలకు భక్తిజ్ఞానవైరాగ్యముల్
తోరం బొగతి సంఘటింపుచు సుధీంద్రుల్ మెచ్చఁగన్ సత్ప్రథా
వారాధిం గని లోకరంజనకరుం డై యుండె నిట్లుండఁగాన్.

సీ. యామునార్యునిసూనుఁ డై యొప్పుతిరువరం
గప్పెరుమాళు లక్ష్మణదిదృక్ష
శ్రీరంగపురినుండి యారంగవిభునాజ్ఞఁ
గంచికిఁ జని తిరుక్కచ్చినంబి
పురుషకారంబుచే వరదరాజస్వామి
నృత్తగీతంబులఁ దృప్తిపఱిచి
తనతోడ లక్ష్మణార్యునిగూడ శ్రీరంగ
పురికిఁ బంపెడునట్లు వరముఁ బడసి
యంతఁ గూరేశదాశరథ్యాదిశిష్య
పరివృతుం డగులక్ష్మణగురువరేణ్యు
రంగధామంబునకు వరరంగవిబుధుఁ
డపుడు దోడ్కొని చనెఁ గుతూహల మెలర్ప. 136

మ. చని మోదం బలరంగ రంగనగరాసన్నప్రదేశంబునన్
గని రయ్యందఱు మర్త్యలోకవిరజన్ గల్లోలవేగోచ్ఛల

ద్వనజాళీవరడోలికావిహరణవ్యాసంగభృంగవ్రజన్
వినిమజ్జద్ద్విజతైర్థికామరకుజన్ శ్రీమత్కవేరాత్మజన్. 137

చ. కనుఁగొని యప్పు డయ్యతిశిఖామణి యానదిలోనఁ దానముల్
బొనరిచి తత్తటంబునను బొందుగ నొక్కెడఁ గావివన్నియం
దనరెడునట్టిశాటికలఁ దాలిచి తిర్మణికాపు దీర్చి నె
మ్మనమున నిష్ఠ దోఁపఁదిరుమంత్రజపం బొనరించుచుండఁగన్.

మ. మును మున్నావరరంగసూరి పురికిన్ మోదంబుతో నేఁగి యా
ఘనవార్తన్ వచియింపఁ బూర్ణగురుఁ డుత్కంఠాతిరేకంబునన్
గనకచ్ఛత్త్రము చామరంబులు మొదల్గాఁ గల్గుమేల్చిహ్నముల్
గొని శ్రీవైష్ణవకోటి గొల్వఁగఁ ద్రయీఘోషంబు శోభిల్లఁగన్

క. వరరంగార్యుండును దా
వరరంగాధిపునియాజ్ఞఁ బరువడిఁ జనియెన్
నిరుపమగుణాళి లక్ష్మణ
గురుమౌళిన్ వెంటఁ బెట్టుకొని యేతేరన్. 140

చ. ఎలమి నిటుల్ చనం గని యతీంద్రుఁడు శిష్యులతోడఁగూడిసాఁ
గిలఁబడి మ్రొక్కి వెండియును గేవలగౌరవలీల వారలం
గలయుచుఁ బూర్ణదేశికశిఖామణి కిట్లను నోమహాత్మ ! ని
న్వల నగుభక్తిమై మరల భాగ్యవశంబునఁ జూడఁ గల్గితిన్.

ఉ. నావుడుఁ బ్రీతుఁడై పెరియనంబియుఁ బంబినకూర్మి నాదటన్
శ్రీవరుఁడై నరంగవిభుసేవ యొనర్పఁగ నయ్యతీంద్రు శి
ష్యావళితోడఁ దోడుకొని యాయతవైభవశోభమాన మా
కోవెల కేఁగె వైష్ణవులు గుంపులు గుంపులుగా భజింపఁగన్.

క. ఆవిధమునఁ బూర్ణార్యుఁడు
కోవెలకున్ వారి నెల్లఁ గొంపోవం గా
నావేళ యతీంద్రుఁడు భ
క్త్యావేశనితాంతపరవశాత్ముం డగుచున్. 143

శా. ఆకల్పస్థిర మైనయప్పురమునం దంభోధిసంఖ్యాస్పద
ప్రాకారాంతరసీమఁ దామరసభాస్వత్కోశసంకాశ మై
నైకశ్రీరచనావిశేషలసమానం బౌవిమానంబునన్
బ్రాకట్యంబు దలిర్ప నొప్పుఫణిరాట్పర్యంకభాగంబునన్. 144

సీ. పెనుసోయగముఁ జిమ్మకనుదమ్మ లఱ మోడ్చి
యసమనిద్రాముద్ర నెసఁగువాని
విమలాశయ మెలర్పఁ గమలావధూమణి
యడుగుఁదామర లొత్త నలరువానిఁ
గోటిసూర్యప్రభల్ మాటిమాటికి నీనఁ
జాలెడుమేటితేజంబువాని
సజలబలాహకచ్ఛాయానుకారి యై
కడుఁజక్క నగుమేనికాంతివాని
భువనమోహనమూర్తి యై పొదలువాని
నసదృశానందదాయకుం డైనవాని
రంగనాయకుఁ గన్నులారంగ నపుడు
గాంచి హర్షించి వినుతిఁ గావించె నిట్లు. 145

సీ. లసమానలక్షణలక్ష్మీకరం బగు
నీకరం బభయదానాకరంబు

క్రతుభుక్త్తరంగిణీప్రభవాస్పదం బగు
నీపదం బఘపరాగాపదంబు
ఘనసజ్జనాభీష్టకలనాదరం బగు
నీవరం బవితథశ్రీవరంబు
సంతతామోఘతాసంభాసురం బగు
నీశరం బున్మీలితాశరంబు
మనసుతోఁ గూడి యెవ్వానిఁ గనుఁగొనంగఁ
జాల కొయ్యన మరలుఁ బ్రాఁజదువు లట్టి
నీస్తవం బెన్న నత్యంతవాస్తవంబు
రంగదయుతార్కనిభతేజ ! రంగరాజ ! 146

క. ఈరీతి రంగవిభుఁ గై
వారంబు లొనర్చి యెదుట బద్ధాంజలి యౌ
నారామానుజసూరిం
గూరిమితోఁ గాంచి పూర్ణగురుఁ డిట్లనియెన్. 147

సీ. మున్నలశఠకోపముని ప్రపంచంబున
నజ్ఞాను లగువారి నరసి యరసి
యాజవంజవబాధ నపనయింపఁగ నెంచి
కనికరంబు మనంబునను వహించి
వైకుంఠపురినుండి వసుధపైఁ బ్రభవించి
యట్టు లప్పు డొనర్ప నలవి కాక
యిఁకమీఁద నవనిపై నొకమహాపూరుషుం
డుదయించి వీరల నుద్ధరించు

నమచు నాత్మీయ మౌగ్రంథమున లిఖించె
నట్టిమహనీయుఁడవు నీవ యని తలంచు
లోకమంతయు నిస్తులాస్తోకచర్య !
లలితసుమహితగుణధుర్య ! లక్ష్మణార్య ! 148

క. ప్రియ మొప్ప నవ్విభూతి
ద్వయ మిప్పుడె నీకు రంగధాముం డొసఁగున్
దయ మీఱఁగ ఖగనాయక
హయభక్తిం గూర్చుచుండు మఖిలజనులకున్. 149

ఉ. శ్రీపతిపై నపారగతిఁ జెన్నగుభక్తిరసంబుఁ గూర్చుచున్
బాపము లెల్లఁ బాపుచును మానవవర్యుల నెల్ల ముక్తికాం
తాపరతంత్రశీలుర నొనర్చుచు విష్ణుమహామతైకసం
స్థాపన మాచరించుచు నెసంగుచు నుండుము పెక్కువర్షముల్.

శా. ఆమాట ల్విని రంగనాయకునిపై నాలోకముల్ నిల్పి యో
స్వామీ ! నీ వెటు లాచరింపు మని యాజ్ఞాపింతువో యాగతిన్
జేమోడ్పు ల్ఘటియించుచున్ మెలఁగుదున్ నిక్కంబుగా నంచు నెం
తే మోదంబున నిశ్చయించుకొనియుండెన్ లక్ష్మణార్యుం డెదన్.

సీ. అంతఁ బూర్ణాచార్యుఁ డది గాంచి రంగనా
యకునాజ్ఞ రామానుజార్యమణికి
ధనభూషణశ్రేణిఁ దనరుభాండాగార
ముల నెల్ల స్వాధీనముగ నొనర్చి
స్వామియాలయముపై సర్వాధికారంబు
లిడి ముద్రికాదు లేర్పడ నొసంగి

యుడయవ ర్లనునామ ముంచి మించినవేడ్క
నసమవైభవలీల నెసఁగఁ జేయ
నపుడు ఘనచర్యుఁ డైనరామానుజార్య
వర్యుఁడును దత్తదుచితకైంకర్యములను
బరమభాగవతాళి కేర్పాటు నేసి
యరయుచుండెను దగ సహస్రాక్షుఁ డనఁగ. 152

మ. భావింపన్ యతిలోకశేఖరునియేర్పా టేమియో కాని యా
సేవావేళలలీలలుం బురవరశ్రీవీథికాయానముల్
దేవాగారవిహారవైభవగతుల్ నిత్యోత్సవాదుల్ ప్రశం
సావాల్లభ్యముఁ గాంచి మించు బళిరా! సర్వోన్నతప్రక్రియన్.

ఉ. తమతమయూడిగంబులను దప్పక భక్తి దలిర్ప సేవకుల్
క్రమముగఁ జేయుచుండఁ గని క్రమ్మఱ సమ్మద మిమ్మడింపఁగా
సమధికరీతి హెచ్చెరిక సల్పుచు భూమిపిరాట్టినెయ్యపుం
గొమరుఁడు రంగనాయకునికొ ల్వొనరించుచు నుండె నప్పురిన్

క. ఒకనాఁ డాయతిపతి యు
త్సుకమతి యై పెరియనంబిఁ జూచి గురువరా!
యిఁక నర్థవిశేషములం
బ్రకటించుచు నన్నుఁ దేల్పవలె నని వేఁడన్. 155

గీ. అపుడు ద్వయమంత్రరాజంబు వ్యాససూత్ర
సముదయంబును గీతార్థసంగ్రహంబు
న్యాసతత్త్వంబుఁ బూర్ణార్యుఁ డర్థయుక్తి
నయ్యతీంద్రున కుపదేశ మాచరించె. 156

సీ. అతులవీర్యాన్వితం బతిబలాంచితమును
బహుపుణ్యనికరసంవర్ధనంబు
శ్రీకరంబు నశేషలోకవశ్యకరంబు
వేదసారము విద్వదాదృతంబు
శ్రేయస్కరంబు నక్షీణపాపహరంబు
ప్రచురతరంబు పురాతనంబు
సకలమంత్రోత్తమ మకలంకభావంబు
ఘోరసంసారైకతారకంబు
నగుచు లోకైకమాన్యత నధిగమించి
ప్రబలుచుండెడుద్వయమంత్రరాజమునకుఁ
గలుగుమాహాత్మ్యమును దెల్ప నలవి యగునె ?
నలువచెలువకు నైన రాచిలువ కైన. 157

మ. ద్వయమంత్రంబును బూర్ణదేశికుఁ డటుల్ దత్త్వావబోధంబుగా
నియతుం డై యుపదేశమున్ సలిపి యానిష్ఠాముఁ డౌలక్ష్మణా
హ్వయవిద్వన్మణి కాదటన్ దనసుతుం డౌపుండరీకాక్షునిన్
బ్రియశిష్యాగ్రణిఁ గా నొనర్చి మఱియుం బ్రీతాత్ముఁ డై యిట్లనెన్

క. గోష్ఠిపురమున భగవ
ద్గోష్ఠిరతమానసుండు గుణనిధియుఁ దపో
నిష్ఠాగరిష్ఠుఁ డై తగు
గోష్ఠీపూర్ణుఁ డనునొక్కగురువరుఁ డలరున్. 159

క. కొనియాడఁ దగినచొక్కపు
గొనములఁ బరిపూర్ణుఁ డైనగోష్ఠీపూర్ణుం

దనవద్యకీర్తి పూర్తిం
దనరుఁ దిరుకోట్టియూరునంబి యనంగన్. 160

చ. అనువుగ వానిఁ గొల్చి యఖిలార్థవిశేషములం గ్రహింపుమీ
యనవుడు నంత సంతసిలి యాయతిరాణ్మణి తత్పురీవరం
బునకుఁగుతూహలంబుననుబోయిమహామహుఁడైనయాతనిం
గనుఁగొని భక్తిపూర్వకముగాఁ బలుమాఱు నమస్కరించుచున్.

మ. కరుణాసాగర ! యోగురుప్రవర ! సాకల్యంబుగా నీయెడం
దిరుమంత్రార్థవిశేషముల్ దెలిపి ప్రీతిం బ్రోవుమీ యంచు సు
స్థిర మౌభక్తి దలిర్ప వేఁడుకొన గోష్ఠీపూర్ణుఁడుం దాని కు
ర్వర లేఁడే యధికారియంచు విముఖత్వంబూనియుండెంగడున్.

క. అది గని లక్ష్మణదేశికుఁ
డెద నెంతయుఁ జింత నొంది యేఁగెన్ మరలన్
సదమలతరప్రభావా
స్పద మై తనరారురంగపట్టనమునకున్. 163

సీ. అటమీఁదఁ గొన్నాళ్ల కలరంగవిభునుత్స
వాలోకనాపేక్ష యాత్మఁ గదుర
శ్రీరంగపురికి గోష్ఠీపూర్ణుఁ డేతెంచి
రంగనాయకునిదర్శన మొనర్చి
సద్భక్తిమైఁ దీర్ఘశఠకోపములఁ గొనఁ
జనఁగ నాస్వామి యర్చకునివలన
నతనికి గుణశాలి యతిమౌళి మంత్రోప
దేశార్హుఁ డగు నంచుఁ దెలియఁబఱిచె

నంత లక్ష్మణదేశికుఁ డతనికడకు
వేడ్కమై నేఁగి వెండియు వేఁడికొనఁగ
వెంటనే మాఱు పలికి మున్నింటిలీల
నూరకుండెఁ దిరుకోట్టియూరునంబి. 164

క. అష్టాదశవారము లటు
లిష్టాప్తిం బడయఁగోరి యేఁగుచు విఫలా
భీష్టుం డై లక్ష్మణయతి
స్పష్టముగా నెంచె నింక సాగ దటంచున్, 165

క. యతిపతి యీగతి ననుకొని
యతిదుఃఖాయత్తచిత్తుఁ డై తనయింటన్
మతి మంత్రార్థంబునకై
వితతగతిన్ సతముఁ బరితపించుచు నుండన్. 166

ఉ. ఆపయి నొక్కనాఁ డొకమహామహుఁ డై తగువైష్ణవుండు గో
ష్ఠీపురినుండి రంగవిభుక్షేత్రలలామముఁ జొచ్చి యప్పటన్
వ్యాపృత మైనచింతను నిరంతరముం ద్వయమంత్రసిద్ధికై
తాపము నొందులక్ష్మణబుధప్రవరుం బరికించి యాదటన్.

సీ. మరల గోష్ఠీపురీవరమున కరుదెంచి
యతఁడు గోష్ఠీపూర్ణయతిని గాంచి
యనఘాత్ముఁ డగులక్ష్మణాచార్యునికిఁ గల్గు
మంత్రార్థమందలి మహితభక్తి
ధ్యాసక్తియును దెల్పి యమ్మౌని దానికై
పొందెడుపరితాపమ్మును వచింప

నపుడు గోష్ఠీపూర్ణుఁ డామాట లాలించి
మదిని బశ్చాత్తాపమగ్నుఁ డగుచు
శిష్యు నొక్కని రావించి శీఘ్రముగను
రంగపురి కేఁగి యయ్యతిపరికరమౌళి
సమ్మదంబునఁ దోడ్కొని ర మ్మటంచు
నాజ్ఞ నిడుమాత్రమున నేఁగె నపటి కతఁడు. 168

క. చని యయ్యంతేవాసియు
ననఘాత్ముం డైనలక్ష్మణాచార్యనకున్
వినతుం డై గురునిమడుల్
వినయంబున నిట్లు విన్నవింపఁ దొడంగెన్. 169

గీ. దండమును జన్నిదంబును దక్క నింక
నొరులు లేకుండఁగ నొకండ వరుగుదేర
నపుడు మంత్రార్థ ముపదేశ మాచరింతు
నని తిరుకోట్టియూర్నంబి యానతిచ్చె. 170

క. నిన్నుం దోడ్కొని ర మ్మని
నన్నుం గృపఁ బంపెఁ గాన నానాభీష్టా
భ్యున్నతిని బడయఁ జాలుదు
క్రన్నన మద్గురునికడకు రమ్ము మునీంద్రా! 171

మ. అని వేఁడన్ విని వేడుకన్ యతికులాధ్యక్షుండు గోష్ఠీపురం
బునకుం గూరవిభుండు దాశరథియున్ మోదంబుతో వెంట రాఁ
జని యాశిష్యులతోడ వానికి నమస్కారంబు గావించి పా
యనిభక్తిస్ఫురణంబుతో నెదుట నత్యానందుఁ డై యుండఁగన్

ఉ. ఒక్కఁడ వీవు రాక యిటు లొప్పనె శిష్యులతోడఁ గూడి రా
నక్కట! చాల గోప్యతర మాద్వయమంత్రము గాన దాని నీ
కెక్కరణిం గడంగి యిపు డే నుపదేశ మొనర్పువాఁడ నిం
కొక్కవిధంబుగాఁ దలఁప కొయ్యన నేఁగుము వచ్చిన ట్లనన్.

గీ. యతిపతియుఁ దాపకాజ్ఞ యె ట్లటుల వచ్చి
నాఁడ ననుడుఁ బవిత్రదండములు మాత్ర
మలర ర మ్మంటి నొంటిగా నటులు కాక
శిష్యయుగ్మంబుతోడ రాఁ జెల్లునయ్య! 174

చ. అన విని లక్ష్మణార్యుఁ డిటు లాడెఁ ద్రిదండపవిత్రముల్ గనుం
గొనఁగను నాకు దాశరథి కూరవిభుండును గాన వారితో
ననుపమసద్గుణోన్నతిఁ ద్వదానతి మీఱక వచ్చితిం జుమీ
యనఁ దిరుకోటియూరిగురుఁ డాయతిరాయనితోడ ని ట్లనెన్,

క. వా రిర్వురకుం దక్కఁగ
నారూఢిగ నొరుల కీమహామంత్రంబుం
గూరిమి నుపదేశింపకు
మోరామానుజ! యటంచు నొప్పించెఁ గడున్. 176

క. అప్పగిదిన్ వాగ్దానము
లొప్పగ నెన్నని వడసి యురువిశ్వాసం
బొప్పఁగ గోష్ఠిపూర్ణుం
డప్పుడు సందియము మాని యతివిమలమతిన్. 177

మ. అవివేకం బెడఁబాప నోపి ప్రణవాద్యం బై నమోమధ్య మై
భువి నారాయణసత్పదాంతికము నై పొల్పొందుచున్ వైష్ణవా

ద్యవనంబున్ శుభదాయకంబు నగునయ్యష్టాక్షరీమంత్రమున్
సవిశేషార్థము గాఁగ వాని కుపదేశం బాచరించెం దగన్.

ఉ. అంతటివాఁడు సర్వజనతావనతత్పరవృత్తి మాని య
త్యంతపరోపకార మగునద్ద్వయమంత్రము నెట్టకేలకున్
శాంతుఁడుదాంతుఁడున్ గుణనిశాంతుఁడునౌయతిమౌళికయ్యయో
యెంతయు గోపనీయ మనియే యుపదేశ మొనర్చె నర్మిలిన్.

క. తొల్లి భువిం గొందఱు బుధు
లుల్లమునం గలమహోపయోగార్థములం
దెల్లముగఁ దెలుపరై రను
నల్లజనశ్రుతిని గల్ల యన రాదు గదా! 180

శా. ఆగోష్ఠీపురి కొక్కనాఁ డలనృసింహస్వామిదివ్యోత్సవా
భోగంబుం గన వేనవేలుగ జనంబుల్ గూడి రా నయ్యెడన్
భోగీంద్రాంశజుఁ డైనలక్ష్మణసుధీముఖ్యుండు వీక్షించి వే
వేగన్ వారలఁ గావ నౌ ననుచు నావిర్భూతకారుణ్యుఁ డై.

ఉ. గోపురమున్ స్పృశింపుచును గోవెలముంగిట నొప్పుచున్నగో
ష్ఠీపురగోపురంబున వసించి సమంచితమంత్రరాజమున్
శ్రీపతి నాత్మలో నిడి యశేషవిశేషతరార్థయుక్తిగం
బ్రాపుగ నెల్లవారు వినుభంగిని జాటెను మాటిమాటికిన్. 182

గీ. అయ్యుదంతంబు నానంబి యాలకించి
యతివరేణ్యు రప్పించి గుర్వాజ్ఞ మీఱి
మెలఁగుచుండుటచే నేమిఫల మనంగ
నారకం బని యతిరాజు మాఱు పలికె. 183

క. అంతట నతఁ డాయతితో
నింతయు నెఱిఁగియును నీ విదేల మదాజ్ఞన్
జింతింపక మంత్రార్థం
బంతయు వెదచల్లినాఁడ వన యతిపతియున్. 184

శా. స్వామీ! దేవరవారిదివ్య మగునాజ్ఞన్ మీఱి వర్తించుటన్
భూమం బౌనరకంబు నా కొకనికే ముఖ్యంబుగాఁ జేకుఱున్
బ్రేమం ద్వత్ప్రదము ల్భజించి మనుజుల్ వేలాదిగా నిత్యసౌ
ఖ్యామోదస్థితిఁ గాంచుచుండఁగను నా కాసందియం బేటికిన్.

మ. తనకష్టంబుల కోర్చియుం బరుల కత్యంతంబు మే ల్గూర్చువాఁ
డనిశంబుం దనకార్యహాని యయినన్ న్యాయప్రచారంబు మా
ననివాఁ డాఁకలిఁ గుందువాని కెలమిన్ దా మాని యైనన్ రయం
బున నన్నం బిడువాఁడు నివ్వసుధపై ముఖ్యప్రశంసాస్పదుల్.

క. అనవుడు గోష్ఠీపూర్ణుం
డెన లేనిముదంబు నొంది యెంబెరుమానా
రనుతిరునామం బయ్యతి
జనపతికి నొసంగి మఱియు సత్కృప ననియెన్. 187

క. ఓయెంబెరుమానారా!
నీయధ్యవసాయమునకు నే మెచ్చితి నౌ
నీయెడ వైష్ణవమతమున్
న్యాయమతిం బ్రోవ నీవ యర్హుఁడవు సుమా! 188

క. వరమతి నిటు లాలక్ష్మణ
గురు నెన్నుచు నతని కఖిలగుహ్యతమం బై

పరమరహస్యం బై తగు
చరమశ్లోకార్థముం బ్రసాదించెఁ దగన్. 189

చ. ఘన మగుదీని నాస్తికులకర్ణములం జొరనీక ప్రోచికా
మ్మని నియమింప నయ్యతికులాగ్రణి యాతని గౌరవంబునం
గనుచు మహాప్రసాద మని కైకొని వెండియు రంగపట్టనం
బునకుఁ దదాజ్ఞచొప్పునఁ బ్రమోదమునం జనె శిష్యయుక్తుఁడై.

సీ. తరువాత లక్ష్మణగురుమౌళి తనచెంత
కురువడిఁ గూరేశుఁ డరుగుదెంచి
మహనీయ మగుచరమశ్లోకమునకుఁ ద
న్నర్థంబుఁ దెలుపు మం చాశ్రయింప
నావత్సరాంతంబు నతనిచే శుశ్రూష
వడసి స్వీయాలయద్వారసీమ
నొకమాస ముపవాస మొనరింపఁ జేసి త
దర్థంబు నుపదేశ మాచరించి
దాశరథియుఁ దదర్థంబుఁ దన్నుఁ గోర
నప్పు డానంబికడ కంప నాఱునెలలు
గొలిచి తదనుజ్ఞఁ గొని యాత్మగురునివలన
దానియర్థంబు గ్రహియించి ధన్యుఁ డయ్యె. 191

క. ఖ్యాతజయా ! స్ఫీతనయా !
క్ష్మాతనయానాథభక్తిగరిమసనాథా !
వీతభయా ! భూతదయా
న్వీత ! విఘాతత్వరహితవిబుధవరహితా ! 192

చ. నిరుపమసద్గుణప్రకరనిత్యవిభూషణ ! సత్యభాషణా !
పరమకృపారసప్రచురపావనభావన! పండితావనా !
ధరణీధరోపమానఘనధైర్యకలాపక ! వంశదీపకా !
వరగుణరామరాయనృపవర్యతనూభవ ! భూరివైభవా ! 193

తోటకము. వరరేచరలాన్వయవార్ధిసుధా
కర ! ధైర్యరమామిహికావసుధా
ధర ! సంతతనిస్తులదానవిధా
దర ! పోషితసజ్జనతావిబుధా ! 194

గద్యము.

ఇది శ్రీజానకీరమణచరణారవిందమిళిందాయమానమానసభావుక
రావుకులతిలకసూర్యరాయభూమండలాఖండలసమగ్రాను
గ్రహపాత్రకౌండిన్యసగోత్రపవిత్రదేవులపల్లివంశ
సంభూతసీతారామశాస్త్రివిద్వన్మణిపౌత్రవేంకట
కృష్ణశాస్త్రీంద్రపుత్రసుబ్బరాయసుధీవర
సోదరతమ్మన్నశాస్త్రిప్రసిద్ధాభిధానాం
తరవిబుధజనవిధేయవేంకటకృష్ణ
శాస్త్రినామధేయప్రణీతంబైన
యతిరాజవిజయమున

దృతీయాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ.



# యతిరాజవిజయము.

## చతుర్థాశ్వాసము.



శ్రీభవ్యకావ్యకాంతా
శోభావహసుగుణరత్న ! శుభకరయత్నా !
క్ష్మాభృత్పరిపరిసదృశ
ప్రాభవనిస్తంద్ర ! సూర్యరాట్ప్రభుచంద్రా .

గీ. అవలికథ చిత్తగింపు మయ్యాదిశేషుఁ
డలవికుంఠంబునను బోలె యతివిభుండు
శిష్యులను గూడి హరిపాదసేవనైక
పరత నుండెను శ్రీరంగపట్టనమున. 2

మ. అటు లాలక్ష్మణసూరి శౌరిపదసేవాసక్తచిత్తాబ్జుఁడై
యట వర్తించుచునుండ వానికడ కుద్యద్వేషభాషాదికా
ర్భటితోడం జనెయజ్ఞమూర్తి యనుస్మార్తబ్రాహ్మణుం డొక్కఁడు
త్కటనానావిధశాస్త్రసమ్మతమతగ్రంథప్రసంగస్పృహన్. 3

క. చని యతఁ డయ్యతిపతితోఁ
దనతలఁపు నెఱుంగఁజేసి తా నోడినచో
నను వగు వైష్ణవమతమునఁ
బనివడి చొచ్చెద నటంచుఁ బ్రతిన యొనర్పన్. 4

క. విని యతిపతి వాదమునన్
మునుకొని తా నోడెనేని బుధవరు లెల్లం
గనుఁగొన గ్రంథత్యాగం
బును జేసెద నని ప్రతిజ్ఞఁ బూనెన్ మరలన్. 5

క. ఇరువురు నప్పగిది పర
స్పరవిజిగీషం బ్రతిజ్ఞవట్టి సుధీంద్రుల్
గర మచ్చెరువుం జెందఁగ
నురువడి వాదింపఁ దొడఁగి రుత్సాహమునన్. 6

సీ. పదియేడుదినము లప్పగిది వా రిర్వురు
        శాస్త్రవాదైకదీక్షానిరూఢి
నలరుచో నీడు దీయక యజ్ఞమూర్తియుఁ
        బ్రతిభావిభాసి యై ప్రబలు చునికి
నరసి రామానుజగురుఁడు నాతని గెల్వ
        నేరీతి నగు నంచు నెంచుచుండ
నారేయి గలలోన నీరేరుహాక్షుఁ డ
        య్యతిశిఖామణికిఁ బ్రత్యక్ష మగుచు
యామునాచార్యవిరచితం బై తనర్చు
గ్రంథ మొకటి మాయావాదఖండనాఖ్య

ధానమున నొప్పుఁ బరికించి తేని దాని
యలఘుసాహాయ్యమున వాని గెలువఁ గలవు. 7

క. అని రంగవిభుఁడు సెల విడి
కనుమొఱఁగిన మేలుకాంచి కాంతిమతీనం
దనుఁ డాతనితో వాదం
బొనరింపఁ గడంగె వెండియును వేడ్కమెయిన్, 8

క. మూర్తిం దాల్చినతేజ
స్స్ఫూర్తి యనం దనరువానిభూరితనురుచుల్
కీర్తించుచుఁ గాంచుట కా
స్మార్తాగ్రణిచూడ్కి కపు డశక్యము లయ్యెన్. 9

ఉ. ఆయనఘాత్ముతేజమున కప్రతిమప్రతిభానిరూఢి క
త్యాయత మౌ ప్రభావమున కబ్బురముం గని యజ్ఞమూర్తి నే
నీయనవద్యకీర్తియు నహీనగుణాస్పదుఁ డౌయతీంద్రుతోఁ
జేయఁగఁ జాల వాద మని చిత్తమునం దలపోసె నయ్యెడన్.

సీ. ఒరుశక్తి దనశక్తి నరయ నేరనివాఁడు
సమయానుగుణరీతిఁ జననివాఁడు
మించినపనికిఁ జింతించుచుండెడువాఁడు
భావ్యర్థముల కాసపడెడువాఁడు
పరమసాధులపట్లఁ గరుణఁ బూననివాఁడు
కపటశీలురచెల్మిఁ గనెడువాఁడు
ప్రత్యయశీలురపట్ల నల్గెడువాఁడు
చెలులకు మన సిచ్చి మెలఁగువాఁడు

లోకమున వీఁకఁ జెడు; నట్లు గాక యితఁడు
పన్నగాధీశ్వరాంశంబువలనఁ బుట్టి
యలరులక్ష్మణగురునిపాదాబ్జములను
భక్తి సేవించి ధన్యతఁ బడయ నెంచె. 11

గీ. అట్టు లయ్యజ్ఞమూర్తి త న్నాశ్రయింప
నతని కయ్యెడ లక్ష్మణయతివిభుండు
పూనుకొని పంచసంస్కారపూర్వకముగ
ద్రావిడగ్రంథముల నెల్ల దయను దెలిపె. 12

క. అరుళాళప్పెరుమాళెం
బెరుమానా రనెడునట్టివిఖ్యాతం బౌ
తిరునామం బిడి యొకమఠ
మరుదుగఁ గట్టించి వాని నచ్చట నునిచెన్. 13

క. తరువాత నొక్కనాఁ డా
కర్ణశైలమునుండి భక్తి గడలుకొనంగా
నిరువురు వైష్ణవు లచ్చటి
కరుదెంచిరి లక్ష్మణార్యు నవలోకింపన్. 14

ఆ. ఇట్లు వచ్చి వార లెంబురుమానారి
మఠము నడుగ నచట మసలుమనుజు
లిరువు రుండి రిచట నెంబెరుమానారి
పేర; వారిలోన-నేరి దనిన. 15

చ. అలయిలయాళువారిమఠ మర్మిలి మా కిఁకఁ జూపుఁడీ యనన్
సలిపిరి వార లట్లపుడు సంతసమందిరి వైష్ణవోత్తముల్

గలయఁగ నయ్యుదంతమును గ్రక్కున నారసి యజ్ఞమూర్తియుం
బొలుపఱఁ జేసి యాత్మమఠమున్; వసియించె యతీంద్రుసన్నిధిన్.

క. అతిభక్తి నిట్లు శిష్య
ప్రతతులు సేవింప విష్ణుపదపంకజసం
గతమతి శ్రీరామానుజ
యతిపతి యచ్చోటనుండి యంత నొకతఱిన్. 17

చ. తిరుమలనంబి గొల్వఁగ మదిం గుతకంబు జనింప శేషభూ
ధరమున కేఁగి యందుఁ గలి దైవత మై చెలువొందు వేంకటే
శ్వరు భజియించి యాతని ప్రసాదముఁ గైకొని భక్తి నయ్యెడ
న్నిరశనుఁ డై దినత్రియము నిల్చె సుఖంబుగ నంబియానతిన్.

గీ. అచట నామూఁడుదినములు నట్లు గడపి
యవల నాలక్ష్మణార్యుఁ డాయంజనాంద్రి
యధిపువలన విభూతిద్వయంబు వడసి
దురితహరము ఖగేంద్రభూధరము డిగ్గి. 19

గీ. పరమపావన మగుతదుపత్యకోర్వి
నలరు శ్రీశైలపూర్ణుగృహంబుఁ జేరి
యచట నాతనివలన రామాయణమునఁ
గలవిశేషార్థముల నెల్లఁ దెలియుచుండె. 20

సీ. అట్లుండి యొక్కనాఁ డాలక్ష్మణార్యుఁడు
బహువిధఫలపుష్పభరిత మగుచుఁ
బొలుపొందు శ్రీశైలపూర్ణుని యుపవన
మందు వేడుకతో విజానుజన్ముఁ

దైనగోవిందార్యుఁ డనుగమింపఁ జరించు
చుండి తద్వనసీమ నొక్కచోట
నొకపామునాల్కఁ గంటకము నాటుకొనంగఁ
బలువిధంబుల బాధపడుటఁ గాంచి

గీ. అద్ది గోవిందునకుఁ జూప నాక్షణంబ
యాభుజంగమవక్త్రమునందుఁ జేయి
చొనిపి ముల్లు దీసి యవగాహమును బొనర్చి
వచ్చె వెండియు నిరుపద్రవముగ నతఁడు. 21

మ. సములన్ భూతదయార్ద్రచిత్తుల నిరస్తద్వేషులన్ మోహసం
తమసాంధాఖిలలోకరక్షణవిధానప్రౌఢవిజ్ఞానులన్
విమలాచారపవిత్రవర్తనుల గోవిందార్యునింబోనిస
త్తములం గన్గొనఁగ్రూరజంతువులుమాత్రం బెగ్గుఁగావించునే?

గీ. చతురమతి లక్ష్మణుఁడును శ్రీశైలపూర్ణు
వలన రామాయణమునకు వైష్ణవమత
పక్షముగఁ బదునెనిమిదిభంగు లైన
యర్థములు వత్సరములోన యవధరించి. 23

గీ. మరల శ్రీరంగపురమున కరుగఁ దలఁచి
తనతలంపు శ్రీశైలపూర్ణునకుఁ దెలుప
నతఁడు లక్ష్మణునెడల బద్ధానురాగుఁ
డగుటఁ బ్రియ మొప్ప ని ట్లనె నతనితోడ. 24

ఉ. ఓయి సమస్తసద్గుణగణోజ్జ్వల ! నీయెడఁ బ్రీతి పుట్టె న
త్యాయతబుద్ధివై భవసమగ్రుఁడ వై యొకయబ్దమందె రా

మాయణకావ్యగుంభితరహస్యము లెల్ల నెఱుంగఁ జాలి తిం
క్రీయెడ నే నొసంగెడునభీప్సిత మెద్ది వచింపు నావుడున్.

అనఘ ! యీ వొసఁగవలసినది యొసంగి
తింక వెండియు నా కేమి యీయ వలయు ?
దయకలిమి నేదియే నీయఁ దలఁతు వేని
యిమ్ము గోవిందు నిదియె నాయీప్సితంబు. 26

అని వేఁడి యతనియనుమతిఁ
గొని లక్ష్మణుఁ డనుజుఁ దోడుకొని శ్రీరంగం
బున కేఁగువాఁడు మార్గ
మ్మున గోవిందార్యువదనముం గనుఁగొనుడున్. 27

కమలినతమ్మిపోలిక వికాసము దక్కి విచారయుక్తభా
వము వెలిపుచ్చునట్లు గనుపట్టుటయున్ నిజసోదరుండు దై
న్యముఁ గనినట్టికారణము నారసి యామహితుండు దేశికో
త్తమవిరహంబు సైఁపనివిధంబు గ్రహించెఁ బరేంగితజ్ఞతన్.

ఇట్లు గోవిందుతలఁపు గ్రహించె లక్ష్మ
ణార్యుఁ డనుజన్మగురుభక్తి కలరి మరల
నతనిఁ గొందఱువైష్ణవసుతులతోడ
నచటనుండియె తిరుమల కంపె నంత. 29

అనఘుఁడు గోవిందుఁడు ముద
మునఁ దిరుమల నంబిగేహమున కేఁగుడుఁ గ
న్గొని యేల తిరిగి వచ్చితి
వని తిరుమలనంబి కనలె నాతనిమీఁదన్. 30

మ. అపు డాతిర్మలనంబిగేహిని కృపాత్యంతార్ద్రచేతస్క యై
కుపితుం డైననిజేశుఁ జేరి యనఘా ! గోవిందుఁ డిప్పట్ల మా
ర్గపరిశ్రాంతి వహించి ఖిన్నుఁ డగుచుం గన్పట్టుచున్నాఁడు నే
నిపు డీనెంతుఁ బ్రసాద మీతనికి నీయిష్టం బెఱింగించినన్.

క. అని విన్నవింప నెవరై
నను బరులకు విక్రయించినపశువునకు మేఁ
త నొసఁగువారలు గలరే
యని యతఁ డాపరమసాధ్వి నాక్షేపించెన్. 32

గీ. అంత గోవిందుఁ డాపల్కు లాలకించి
హృదయమునఁ గలయాసల నెల్ల వీడి
గురువరుగృహమ్మునకు భక్తిపరత మ్రొక్కి
చనియెఁ గాంచీపురమువంక సత్వరముగ. 33

గీ. అయ్యుదంతంబు విని లక్ష్మణార్యుఁ డాత్మ
లోన శ్రీశైలపూర్ణవిజ్ఞానమునకు
నలరి గోవిందుఁ దోడ్కొని యరిగె రంగ
ధామమునకుఁ బ్రవర్ధితక్షేమమునకు. 34

చ. వరమతి యైనశిష్యుపయి వత్సలభావము వీడి యట్టి లా
తిరుమలనంబి వానియెడఁ దీక్ష్ణతఁ జూపి నిరాకరించె న
ద్దిరః యిది యేటినీతి యని తేలికసేయుట పాడి గా దతం
డరయఁగ వానిమేలునకె యట్లొనరించెఁ గరంబు నెమ్మితోన్

క. తనయొద్ద నుండి నేరిచి
కొనవలసిన వెల్ల నేర్చికొనెఁ గావున నిం

కను గోవిందుఁడు తనయొ
ద్దనె యుండుట వ్యర్థ మనుచుఁ దలపోసి మదిన్. 36

మ. తనకంటెన్ ఘనుఁ డైనలక్ష్మణునియొద్దం బెక్కు సందర్భముల్
విని యెంతేనియుఁ బ్రాజ్ఞతంబడయుగోవిందార్యుఁడంచుందలం
చి నితాంతప్రియచిత్తవృత్తి మెయి నా శ్రీశైలపూర్ణార్యుఁ డా
తని నారీతి నిరాకరించె మదిఁ గ్రోధం బింతయున్ లేకయే.

గీ. అదియునుంగాక రామానుజార్యువలనఁ
దనకుఁ జేకూరుమేలును దలఁప కితఁడు
మౌఢ్యమున వెండి వచ్చె నిమ్మాడ్కి ననుచుఁ
దలఁచి కోపించెఁ గాని క్రోధమునఁ గాదు. 38

మ. అనుజన్మం గొని లక్ష్మణుం డటు ముదం బారంగ శ్రీరంగప
త్తనముం జొచ్చి నిజాగమోత్సుకతచేఁ దండోపతండంబు లై
జను లెల్లం దనవెంట నంటి పరమోత్సాహంబునం గొల్వఁ ద
మ్మునితో శిష్యులతోడ వెండియు మఠమ్ముం జేరె సేమంబుగన్.

గీ. అగ్రజుం డగులక్ష్మణు నాశ్రయించి
తద్యతివరేణ్యతరణి సాధనము గాఁగ
నిజగురువియోగదుఃఖవార్నిధిఁ దరించి
యతిముదంబున గోవిందుఁ డచట నుండె. 40

మ. అతఁ డప్పాట నిజాగ్రజన్మకడ నాయాధర్మబోధల్ సమా
హితచిత్తుం డయి సంగ్రహించుచుఁ బరావృత్తాన్యచింతానుషం
గతి నుండంగ నొకప్డు కాంతిమతి సోత్కంఠాత్మ యై తత్సుత
ద్వితయం బున్నెడ కేఁగుదెంచి కని గోవిందార్యుతో ని ట్లనెన్.

చ. ఋతుమతి యయ్యెఁ జారుచమరీకబరీక దినాదివిస్ఫుర
చ్ఛతదళపత్త్రనేత్ర వికసన్నవయౌవనమోహనాంగి నీ
సతి యటు గాన నీవు నిఁకఁ జయ్యన నింటికి వచ్చి శిష్టస
మ్మతగృహమేధిధర్మపథమాన్యుఁడ వై సుఖియింపు దానితోన్.

చ. అనవుడు మందహాసరుచిరాననుఁ డై జనయిత్రి యట్లు వ
ల్కినను దు లాలకించియుఁ జలింపక సంతతభూరి దైత్యమ
ర్దనపదపద్మభక్తిపరతంత్రుఁ డతం డిహలోకతుచ్ఛసౌ
ఖ్యనిరతిఁ బాఱఁ దోలి వినయం బలరం దనతల్లి కి ట్లనున్.

క. అమ్మా! నాయెడఁ గడునె
య్యమ్మలరఁగ నీవు ప్రియమె యాడితి వదియు
క్తమ్మ యగు నైన దానికి
సమ్మతిపడఁజాల నన్ను మన్నింపుము తల్లీ! 44

గీ. అస్థిర మ్మగుసుఖమున కాస పడక
యనఘమతి యైనరామానుజార్యుఁ డాత్మ
సతిని విడనాడి నిశ్చింత సన్న్యసించె
నట్టి యొనరింపఁగా నేను నభిలషింతు. 45

క. అనుటయు ద్యుతిమతి గోవిం
దునివృత్తము లక్ష్మణార్యుతోఁ జెప్పి యెటై
నను గోవిందుని దనతో
ననుపంగా వలయు నింటి కని కోరుటయున్. 46

క. ద్యుతిమతివచనమ్ములు విని
యతిపతి గోవిందు సువ్రతా! గాఢతమో

వృతశయనగేహమున నీ
సతికిన్ బుతుశాంతిఁ జేయఁ జను మని పనిచెన్. 47

ఉ. ఎందుల కిట్లు సెప్పె గురుఁ డేటిప్రసంగము లివ్వి నాక యా
నందముతోడ భ్రాతృవచనమ్ముల నౌదలఁ బూని తల్లివెం
టం దనయింటి కేఁగె నొకటన్ వికటావరణంబు లేనిగో
విందుఁడు సర్వతోముఖవివేకలసద్హృదయారవిందుఁ డై. 48

ఉ. భానుఁడు గ్రుంకఁ దల్లి పనుపం బనుకింటికిఁ బోయి శయ్యపై
మౌనివిధంబుఁ గైకొనినమన్మథుమాడ్కి వసించి భార్యకున్
జ్ఞానము భక్తియుం దెలుపుఁగాని యొకప్పుడుఁగామతంత్రముం
బూనఁ డతండు గాంతయును ముగ్ధతనంబునఁబల్కదేమియున్.

క. సకి నేఁడో రేపో నా
యకునకు రాగంబు గలుగు నని కొలువంగా
నొకనాఁటికన్న నొకనాఁ
డకటా ! వేదాంతబోధ లధికం బయ్యెన్. 50

ఉ వాడనిపూవులో యనఁగ వచ్చెద, రాల్మగ లుండుపోఁడుముల్
చూడఁగరావు వీరి, కిది చోద్యముగా, యని యత్త సన్నగాఁ
గోడలిఁ బిల్చి మేలమునకుం బలె రాతిరిచెయ్దిఁ జెప్పఁగా
వేఁడఁ ద్రపావిషాదములు వెన్కొన సర్వముఁ దెల్పెనాపెయున్.

క. కొడుకువిపరీతవృత్తికి
నుడుకుచు ద్యుతిమతి యతీంద్రునొద్దకుఁ జని కు
య్యిడ నాతఁడు గోవిందుని
దడయక రావించి సస్మితమ్ముగఁ బలికెన్. 52

శా. ఓయీ! వైష్ణవశేఖరా ! సుఖముగా నున్నాఁడవే నీవు ? నీ
ప్రోయాలు న్భవదీయవాంఛితములం బూరించి ప్రేమించునే
కా? యాకామిని నీవును న్వలచి వేడ్కం గొల్చుచున్నాఁడవా
క్షో? యన్న న్విని విన్నవించెనిటు లాగోవిందుఁడున్ నమ్రుఁడై.

గీ. అంధకారావృతం బైనయట్టిచోట
భార్యను భజింపుమీ యని పలికి తీవు
యతిశిఖామణి ! యంతరయామి యెపుడు
వెలుఁగుచుండఁగఁ దమ మెందుఁ గలుగుఁ జెపుమ. 54

క. అనుగోవిందునివచన
మ్మున కాశ్చర్యప్రమోదములు వొడమఁగ నా
తని గఱపుచు రామానుజ
ముని యి ట్లని పలికెఁ గరుణ పొంపిరివోవన్. 55

క. తనయాశ్రమమునకుం దగు
పనులం బొనరింపకున్నఁ బాతిత్యం బౌ
నని శాస్త్రమ్ములు వలుకున్
జనవు సుమీ నీయథేష్టసంచారమ్ముల్. 56

ఉ. భూసురవర్య! నీవు పరిపూర్ణగృహస్థుఁడ వయ్యుఁ దత్క్రియా
భ్యాసము నుజ్జగించి విషయమ్ముల రోసి చరింతు వేని స
న్న్యాసము సంభవించు ననినన్ విని యాతఁడు లక్ష్మణార్య వి
శ్వాసముతో యతిత్వముఁ బ్రసాదము సేయఁగ వేఁడె నెంతయున్

గీ. అతనివైరాగ్యమునకు రామానుజుండు
మెచ్చి కరుణించి సన్న్యాస మిచ్చి స్వీయ

మైనమన్నాథనామధేయంబు వెట్టె
నంత గోవిందమునియు భీతాత్ముఁ డగుచు.

శా. అన్నా! సర్వజగద్గురుండ వహిరాజాంశావతీర్ణుండ వా
పన్నత్రాణపరాయణుండవు మహాభాగుండ వీ వట్టిసీ
మన్నాథాహ్వాయ మేను బాపుఁడ ననన్మార్గుండ మూఢుండ వి
చ్ఛిన్నాచార్యుఁడఁ దాల్పఁగాఁ దగుదునే? చెప్పంగదే నావుడున్.

గీ. అనుజుపలుకుల కెంతయు నలరుచు యతి
రాజు మన్నాథనామపర్యాయ మయిన
ద్రవిడభాషాపదంబునఁ దనరునాద్య
చరమవర్ణమ్ములను మాత్ర సంగ్రహించి. 60

క. ఎంబా రనంగఁ దగునా
మం బిడె గోవిందుఁ డాక్రమంబున సన్న్యా
సం బంది విషయవాంఛా
సంబంధము లేక లోకసంస్తుతుఁ డయ్యెన్. 61

ఉ. అంత నొకప్డు లక్ష్మణమహాముని పూర్వము దాను యామునా
ర్యాంతిమవేళ రంగపురమందు నదీతటి వైష్ణవోత్తమా
భ్యంతరసంస్థితుం డగుచు భాష్యము లోకహితార్థమై విని
ర్మింతు న టన్నవాక్యము స్మరించుచుఁ దద్రచనావిచారుఁ డై.

క. మునుపుగ బోధాయనవృ
త్తిని జూడక భాష్యరచనఁ దీర్ప నశక్యం
బని సారస్వతపీఠ
మ్మున కరిగెం గూరనాథమునిముఖ్యునితోన్. 63

గీ. శారదాపీఠమున నున్నసకలబుధుల
శాస్త్రవాదమున న్మించి జయముఁ గాంచి
భారతీదేవి సంతోషపఱిచె నచట
నమలవిజ్ఞానఘనుఁడు రామానుజుండు. 64

క. వేధఃకుటుంబినియుఁ దన
మేధాప్రతిభానమునకు మెచ్చి యొసంగన్
బోధాయనకృతిఁ గొని మ
న్నాథుఁడు శీఘ్రముగ రంగనగరికి మరలెన్. 65

గీ. శారదాపీఠబుధులు పుస్తకము లరయు
వేళ నల్లబోధాయనవృత్తిఁ గనక
జాతసంశయు లై యతీశ్వరుఁడు చన్న
జాడ వెదకుచుఁ బోయిరి సత్వరముగ. 66

ఆ.వె. మాసమునకు వారు మార్గమధ్యంబున
లక్ష్మణార్యుఁ గని బలాత్కరించి
కోశ మపుడ పుచ్చుకొని శారదాపీఠ
మునకు మగిడి చనిరి ముదితు లగుచు. 67

క. అతికష్టంబునఁ బడసిన
ప్రతిఁ గోల్పడి యతివరుండు పరితాపమునన్
మతి నెడి యుండుటయు సమీ
హితఫణితిం గూరనాథుఁ డి ట్లని పలికెన్. 68

ఉ. చింతిల నేల? యింత గురుశేఖర! నే నలపుస్తకమ్ము నా
ద్యంతము రాత్రికాలములయందుఁ బఠించితి నద్ది యెల్ల నా

స్వాంతమునందు నున్నది భవత్కరుణన్ వినుపం గలాఁడ నా
వంతయుఁ దప్పకుండ నన నయ్యతిరాజు ముదంబు నొందుచున్

శా. శ్రీరంగమ్మున కేఁగి యొక్కతఱి నర్థిన్ దాశరథ్యాదు లౌ
ధీరశ్రేష్ఠులఁ గూర్చి లోకహితబుద్ధిం దత్త్వమస్యాదివా
క్సారంబు న్వివరించి దుష్టమతముల్ ఖండింప భాష్యక్రియా
ప్రారంభం బొనరించువాఁడ నన వారల్ సంప్రహృష్టాత్ము లై.

క. ఇది మేలు మేలు గురువర!
విదితమ్ముగ నట్టు సేయవే వేగమె మా
హృదయాంధకార ముడుపం
గదవే యని పల్కి రైకకంఠ్యము గాఁగన్. 71

గీ. అంతఁ గూరేశుఁ జూచి రామానుజుండు
నేను రచియించుభాష్యములోనిపలుకు
నీకు రుచియించినన్ వ్రాయు. లేకయున్న
మాను మన వల్లె యనివ్రాయఁ బూనె నతఁడు. 72

సీ. అం దొకచోట రామానుజయతిరాజు
జీవాత్మునకు విష్ణుశేషభావ
రహితవేతృత్వముం బ్రతిపాదనము సేయు
వాక్యమ్ము వల్కి శ్రీవత్సచిహ్నుఁ
డది తాను లిఖియింపఁడయ్యె లక్ష్మణమౌని
పలుమాఱు సెప్పి కోపంబు నొంది
యిటు లైనఁ గూరేశ! యీవె భాష్యంబును
విరచింపు మని వాని విడిచి పోయె

గీ. నప్డు శ్రీవైష్ణవులు గొంద అరుగుదెంచి
కూరనాథుఁడ! నీపయి గురుఁడు కుపితుఁ
డయ్యె నే మన నతఁడు గుర్వాజ్ఞఁ దెలిపి
యాత్మదోషము లే దని యనిపె వారి. 73

గీ. అంత లక్ష్మణమౌనియుఁ గొంతతడవు
స్వాంతమునను నవ్వాక్యముఁ జింతచేసి
యంతయు నెఱింగి యనుతాపవంతుఁ డగుచుఁ
జెంతకుం జీరి కూరేశు నెంతొ మెచ్చె. 74

క. యతివరుఁడు జీవునకు శ్రీ
పతి శేషత్వప్రయుక్తపరివేతృత్వ
ప్రతిపాదక మగువాక్యముఁ
గుతుకమ్మునఁ జెప్ప వ్రాసెఁ గూరేశుండున్. 75

శా. శ్రీరంగేశ్వరుశాసనమ్మున జగచ్ఛ్రేయోనుసంధాత యై
శ్రీరామానుజమౌనిశేఖరుఁ డిటుల్ శీఘ్రమ్ముగా భాష్యమున్
సారశ్లాఘ్యము లైనవాక్యములతో సంపూర్తిఁ గావించి స
ద్ధీరుల్ మెచ్చఁగ యామునార్యఋణముం దీర్చెం బ్రమోదమ్మునన్.

గీ. అవల వేదాంతదీపవేదాంతసార
ములును వేదార్థసంగ్రహమ్మును మొదలుగఁ
బెక్కుగ్రంథము లొనరించి పృథివి నిలిపి
యధికహర్షమ్ముఁ జెందె రామానుజుండు. 77

క. పిమ్మట శ్రీవైష్ణవబృం
దమ్ము యతికి మ్రొక్కి గురువతంసమ! శ్రీభా

ష్యమ్మను రచించి దుష్టమ
తమ్ములఁ జించితివి యది ముద మ్మొనగూర్చెన్.  78

చ. ఇటుపయి నెల్లదిక్కులకు నేఁగి మతాంతరులన్ జయించి య
చ్చోటఁ భవదీయదర్శనముఁ జొప్పడ సిల్పి పవిత్రతీర్థప
ర్యటనముఁ జేసి రాఁ దగదె యన్న యతీంద్రుఁడు వార లాడుచ
క్కటులను మెచ్చి వైష్ణవశిఖామణులెందఱొ తన్నుఁ గొల్వఁగన్.

సీ. శ్రీరంగపతియాజ్ఞఁ జేకొని పయన మై
చోళమండలమును జొచ్చి యందుఁ
గలకుంభకోణాదికక్షేత్రముల కేఁగి
శాస్త్రవాదముల నచ్చటివిబుధుల
గెల్చి వారలఁ దన్నుఁ గొల్చుశిష్యుల జేసి
యటఁ బాండ్యమండలి కరిగి యందు
రమణించుకురుకాపురమ్మనకుం జని
శఠవిరోధికి నమస్కారము లిడి

గీ. తత్ప్రబంధముఁ జదివి తీర్థప్రసాద
ములను గైకొని లక్ష్మణమునివరుండు
భక్తిపరవశుఁ డయి శఠవైరి నొక్క
వృత్తమున నీవిధమ్మన వినుతిచేసె.  80

మాలిని. వకుళధవళమాలావక్షు నామ్నాయపక్షున్
ప్రకటవికటవాదాపాయు భక్తప్రమేయున్
సకలసుకృతిపూజాస్థాను శ్రీకారిసూనున్
స్తుకవిగురుకనాథున్ శుద్ధబోధున్ భజింతున్.  81

గీ. అట్లు కొనియాడి పిదప శఠారియొద్ద
సెలవుఁ గైకొని యతిరాజశేఖరుండు
రంగుమీఱెడునట్టికురంగనగరి
కరిగి యందలిశ్రీపూర్ణు నాశ్రయించె. 82

ఉ. అంతములేని వైష్ణవమహాజనులున్ బదిరెండువేలయే
కాంతులు నట్లు డెబ్బదియు నాపయి నాలుగు నైనపీఠముల్
సంతతమున్ భజింపఁగ నెసంగెడులక్ష్మణమౌనిఁ జూచి వి
భ్రాంతమనస్కుఁ డై యలకురంగపురీవరపూర్ణుఁ డిట్లనెన్.

శా. ఓరామానుజ ! సర్వలోకహితకార్యోద్యోగి నై లక్ష్మితో
శ్రీరామాద్యవతారరూపముల ధాత్రిం బుట్టి దుష్టప్రతీ
కారంబుం బొనరించి శిష్టజనులం గాపాడితిం గాని నన్
దూరాలోచన లేనిమానవులు మర్త్యుం డంద్రు దుర్వారు లై.

క. వారల వశపఱుచుకొన
న్నేర నయితి నేను నౌర ! నీ విందఱ నే
తీరున లోఁబఱచితివో
పేరుకొను మనంగ యతియు బింకముతోడన్. 85

గీ. అడుగ వలసినరీతిగ నడుగు దేని
యది సమస్తముఁ దెలిపెద ననఁ గురంగ
నగరపూర్ణుఁడు గద్దియ డిగి వినమ్రుఁ
డగుచు నాపీఠ మొసఁగె రామానుజునకు. 86

చ. నిరుపమభక్తియుక్తి ధరణీస్థలిపై నుపవిష్టుఁ డైనశ్రీ
హరిఁ బరికించి విస్మయము నందుచు లక్ష్మణమౌనియున్సకృ

త్స్మరణమునన్మహోన్నతపదప్రదమౌద్వయమంత్రమున్సమా
దరమునఁ బూర్ణదేవునకు దక్షిణకర్ణమునందుఁ జెప్పుచున్.

గీ. ఇంబుమీఱంగ వైష్ణవనంబి యనెడు
దాస్యనామం బిడెన్ జగద్రక్షకునకు
శ్రీమహావిష్ణువును బ్రీతిఁ జెంది గురువ
తంసమున కంత బ్రహ్మరథంబు వట్టె. 88

ఉ. ఆయతిరాజశేఖరుఁడు నంజలి వట్టి నమస్కరించి నా
యీయపరాధముల్ సయిఁపుమీ పురుషోత్తమ! యంచు వేఁడియా
శ్రీయుతునాజ్ఞఁ గొంచుఁ దనశిష్యసమూహముతోఁ బ్రయాణమై
పోయెను గేరళమ్మునకుఁ బూర్ణుఁడు దూరము సాగనంపఁగన్.

గీ. కేరళావనిలోఁ దనపేర నొక్క
మఠముఁ గట్టించి యటనుండి మధురనైమి
శమ్ము బృందావనమ్ము పుష్కర మయోధ్య
మున్నుగాఁ గలక్షేత్రము లెన్నొ మెట్టె. 90

గీ. పిదప యతిపతి శారదాపీఠమునకు
నరుగ భారతి యతనివిద్యాప్రభావ
మాలకించిన దౌటఁ గప్యాస మనెడు
శ్రుతికిఁ దాత్పర్యముం జెప్పు చూత మనియె. 91

మత్తకోకిలము.

ఓసరస్వతి! క మ్మనన్ జలమొప్పు; దానివి గ్రోలుటం
జేసి యొఁ గపిసూర్యుఁ; డాతనిచే వికాసముఁ గొంటఁ గ

ప్యాస మంబుజ మయ్యెః శ్రీహరియక్షి లాకమలంబటుల్
భాసమానము లంచు భావముఁ బల్కె లక్ష్మణమౌనియున్.

గీ. దాని విని హర్షపరవశ యైనబ్రహ్మ
దేవి శ్రీభాష్యమును శిరసా వహించి
యతిపతికి భాష్యకారాహ్వయం బొసంగి
కరుణ పొంపిరివోవ నీకరణిఁ బలికె. 93

సీ. ఓయి రామానుజయోగి! పూర్వము శంక
రాచార్యుఁ డిచ్చటి కరుగుదేర
నాతని నేను గప్యాసశ్రుతికి భావ
మె ట్లని యడిగితి నంత నతఁడు
చర్చించి మర్కటాసనసదృశం బని
హాస్యకరంబుగా ననియె నీవు
స్వాభావికార్థంబుఁ జక్కఁగాఁ జెప్పితి
విది లెస్స యని వచియించె వాణి
అంత నచ్చటియద్వైతు లది యెఱింగి
సైఁపఁగా లేక వచ్చి శాస్త్రమ్ములందు
వాద మొనరించి తుద కోటుపడి పలాయ
నంబు నేసిరి లజ్జాభరంబు గూర. 94

శా. ఆవృత్తాంతము గర్ణపారణముగా నాలించి విస్మేరుఁడై
యావీ డేలెడురాజు తత్క్షణమ తానై వచ్చి రామానుజున్
సేవించెన్; యతిరాజు నానరపతిన్ శిష్యుండు గా నొప్పి సం
భావించెన్ ద్వయమంత్రరాజ మిడి పాపధ్వాంతముం బాపుచున్

ఉ. లక్ష్మణమౌని కోపమిఁ బలాయితు లైనవిపశ్చిదుత్తముల్
సూక్ష్మవిచారదూరు లగుచున్ యతికై యభిచారహోమముల్
పక్ష్మలకోపవృత్తిఁ జలుపన్ యతిరాజున కవ్వి యెట్టిదు
ర్లక్ష్మము సేయఁ జాలక పరాస్తము లై నొగిలించె వారలన్.

క. పరుసము లాడుచుఁ దెలియని
వెఱపునఁ గు య్యిడుచు వీధివీథులఁ దా మై
తిరుగం జొచ్చి రకట ! య
ప్పురి బుధు లభిచారహోమములు వికటింపన్. 97

గీ. భూపుఁ డిది యంతయుం జూచి బుధులఁ గావు
మనుచు రామానుజాచార్యు నాశ్రయింప
సర్వపండితులకును స్వాస్థ్యంబు గలుగఁ
జేసె; వారును యతిరాజుశిష్యు లై రి. 98

క. తరువాత లక్ష్మణయతీ
శ్వరుఁ డచ్చటనుండి కదలి వారాణసిలో
సురనది మునింగి మాధవు
నెరఁగి జగన్నాథమునకు నేతెంచె నొగిన్. 99

శా. శ్రీరంగమ్మునయందుఁబోలె నట శాస్త్రీయంబుగా నర్చనా
ప్రారంభంబులు లేమి కేవపడి శ్రీరామానుజార్యుండు సం
స్కారంబుం బొనరించుకోరిక నృపాజ్ఞం బొంది యాత్మక్రియా
పారమ్యంబునకై జగత్పతి హరిం బ్రార్థించి నిద్రం గనెన్.

గీ. వేగి మేల్కాంచునప్పు డయోగివరుఁడు
శిష్యులును దాను శ్రీకూర్మసీమ నుంట

కద్భుతము నొంది సంస్కారణాశ వదలి
దైవ సంకల్పమును బహుధా నుతించె. 101

గీ. కోవిదులు గానివారు శ్రీకూర్మవిభుఁడు
శివుఁ డని వచించుటను నందు శ్వేతమృత్త
సంభవింపమి హరిపూజ సాగ కొక్క
పవలు రామానుజుఁడు నిత్రుపాస ముండె. 102

సీ. శ్రీకూర్మపతి యతిశేఖరునకు రాత్రి
స్వప్నంబునందుఁ బ్రసన్నుఁ డగుచు
వాస్తవంబుగ నేను వైకుంఠుఁడనె కాని
శివుఁడను గా నని చెప్పి శ్వేత
మృత్తిక కోనెలమీఁద నున్నది దానిఁ
గొని యూర్ధ్వపుండ్రంబులను ధరించి
మన్నివేదిత మగునన్నంబు భుజియింపు
మనియు నంతర్ధాన మయ్యె నంత
లక్ష్మణుఁడు మేలుకాంచి యుల్లాస మంది
యచ్యుతునియాజ్ఞ చొప్పడ నాచరించె
నదియ మొదలుగ శ్రీకూర్మ మతిశయిల్లి
విష్ణుపుణ్యస్థలం బయి వెలయుచుండు. 103

గీ. పిదప యతిపుంగవుం డహోబిలముఁ జూచి
యవల సింహాచలమ్మున కరుగుదెంచి
క్రమముగాఁ బుణ్యతీర్థముల్ గనుచు వేంక
టాద్రి కేతెంచె విభవనిర్ణిద్రుఁ డగుచు. 104

ఉ. అందు మహావిభూతిఁ దనరారెడుదేవుఁడు వేంకటేశ్వరా
హ్వాం దగుపద్మనాభుఁ డని వైష్ణవపాళియు,స్కందరూపియౌ
నిందుకళావతంసుఁ డని యెల్లరు శైవులు వాదులాడుకొం
చుందురు విష్ణుశంకరుల కొప్పెడుచిహ్నము లెవ్వి లేమిచేన్.
ఉ. ఈవిధ మంతయుం గని యతీంద్రుఁడు వారలపోరుఁ దీర్పఁగా
శైవుల నందఱం దనదుసన్నిధికిం బిలిపించి మీర లీ
దేవుఁడు విష్ణువో శివుఁడొ దేల్చుకొనం దలఁ పూన కూర కీ
ఠేవ వివాదమాడుదు రటే యని చల్లఁగ మందలించుచున్.
క. హరిహరచిహ్నము లీరా
తిరి గర్భగృహమ్మునందు దిగవిడుతము శ్రీ
హరి యైనఁ జక్రధరుఁ డగు
హరుఁ డైనన్ శూలపాణి యగు రేపటికిన్. 107
చ. అరయుద మంచు లక్ష్మణమహామునిన్యాయపథంబుఁ దెల్పఁగా
సరి సరి యట్లె చూత మని శైవులు సమ్మతినేసి రంత నా
కరణి నొనర్చి వేగి కనఁగాఁ గమలాపతి శంఖచక్రముల్
కరములఁ దాల్చి యొప్పె నది గాంచి ముదంపడి రెల్లవైష్ణవుల్
గీ. శైవులు విషణ్ణులై శేషశైలము విడి
పోయి రంతట లక్ష్మణమునివరుండు
వేంకటాద్రిని గావఁ బ్రవీణు లైన
యతుల నిరువుర నియమించి యచొటు వాసి. 109
గీ. మొదట సత్యవ్రతక్షేత్రమును భజించి
యవల మధురాంతకమ్మున కరుగుదెంచి

వీరనారాయణపురాదివివిధతీర్థ
ములను సేవించి శ్రీరంగమునకుఁ జేరె. 110

ఉ. కాంచికిఁ బశ్చిమంపుదిశగా నొకక్రోశములోనఁ గూరనా
మాంచిత మైనగ్రామ మలరారు నటన్ నిరతాన్నదాతృతా
సంచితపుణ్యకీర్తి బహుశాస్త్రవిదుండు సిరిం గుబేరునిం
గొంచెముసేయువాఁడు తగుఁ గూరవిభుం డనఁగాఁ గుటుంబియై.

గీ. అర్కుఁ డుదయించినదిమొద లర్ధరాత్ర
మగుదనుకఁ గూరనాథుగృహమ్మునందు
నన్నసంతృప్తు లగుచుఁ బంగ్వంధకృపణు
లెంద తెందఱొ ప్రతిదిన మేఁగుచుండ్రు. 112

సీ. ఒకనాఁడు కూరనాయకు నన్నశాలకు
ఘటియింపఁబడియున్నకంచుతల్పు
లను మూయుచోఁ గల్గుఘననిస్వనంబును
గాంచికాలక్ష్మి యాలించి యద్భు
తం బంది చక్కఁగాఁ దత్కారణంబును
వరదరాజస్వామివలనఁ దెలిసి
కూరనాథుని జూడఁ గుతుకమ్ము గలుగఁ ద
త్క్షణమ యిందిర తిరుకచ్చినంబిఁ
జీరి నీ వేఁగి యిచటికిఁ గూరనాథుఁ
బిల్చికొని ర మ్మటంచుఁ జెప్పిన నతండు
వోయి కూరేశుపూజలఁ బొంది పూర్ణ
హర్షుఁడై యాతనికి లక్ష్మియాజ్ఞఁ దెలిపె. 113

మ. మృడపద్మాసనముఖ్యదేవతలు పేర్మిం గొల్చుశ్రీదేవి యె
క్కుడఁ బాపాత్ముఁడ గర్వదూషితుఁడ దుష్కార్యుండ నే నేడ నా
బిడ దర్శింపఁగ నెంతవాఁడ నని తృప్తిం జెందకే కూరనా
థుఁడు స్వార్థం బఖిలంబు నర్థిజనసందోహంబుపాల్సేయుచున్.

గీ. అబలయుం దాను శ్రీరంగయాత్ర కపుడ
కదలె నిది యంతయును దిక్కు కచ్చినంబి
యేఁగి లక్ష్మికి వరదున కెఱుఁగఁజేయఁ
గూరనాథుని గడు మెచ్చుకొనిరి వారు. 115

మ. తనయర్థంబును బీదసాదులకునై దానంబుఁ గావించి వే
డ్కను గూరేశుఁడు యాత్ర కేఁగుతఱి నాండాళమ్మ తత్పత్ని యా
తనికిం దీర్థ మొసంగ స్వర్ణమయపాత్రం బొండు గూఢంబుగాఁ
గొనితెచ్చెన్ సతులెందుభర్తృసుఖముంగూర్పంగయత్నింపరే?

గీ. విపినమార్గంబునం బోవువేళఁ గూర
నాథుఁ గని యాండాళమ నాకు భీతి
గలుగుచున్నది యిచట దొంగలభయమ్ము
లేదు గద యని పల్కు నాలించి యతఁడు. 117

చ. జలమునయందు మత్స్యములుశ్వాపదముల్భువిపైఁబతంగమం
బులు దివమందునుం బలలముం దినుకైవడి నెందు విత్తవం
తులను భుజింత్రు మానవులు తొయ్యలి నీకడ ద్రవ్య మెద్దియో
గల దని యెంతు లేనియెడఁ గారణ ముండదు భీతి పుట్టఁగన్.

క. అనుటయు నాసాధ్వియు మీ
కని యొకబంగారుగిండియను జాటుగఁ గై

కొని వచ్చితి నని చూపినఁ
గని యా నియ్యదియె భీతికారణ మనుచున్. 119

శా. కూరేశుండు హిరణ్యపాత్రమును వైగెకొంచున్ వడిం దానిఁగాం
తారక్షోణిని బాఱవైచి విగతాంతర్భీతి యాభార్యతో
శ్రీరంగమ్మున కేఁగి యుంఛమునఁ గుక్షిం దన్పుచున్ భక్తితో
శ్రీరామానుజపాదపద్మముల సంసేవించు నెల్లప్పుడున్. 120

సీ. ఒకనాఁడు పవ లెల్ల హోరున వర్షంబు
గురియుచుండుటఁజేసి కూరనాథుఁ
డాహారసంపాదనార్థము వో వీలు
పడమి సాలగ్రామవారిఁ గ్రోలి
భార్యయుఁ దానును బస్తుండి రంతఁ గో
వెలలోన నైవేద్యవేళఁ గాహ
ళీనాద మగుడు నాలించి యాండాలమ్మ
భర్తృప్రతత్పర యయి పద్మనాభుఁ

దొడరి నీదాసుఁ డాఁకలితోఁ బరుండ
హాయిగా నీవు భుజియింతువే యనంగఁ
గేళి శ్రీరంగపతి యాలకించి కరుణ
పంబి యుత్తమనంబిస్వప్నమునఁ దోఁచి. 121

మత్తకోకిలము.

అన్న ! నీ విపు డేఁగి వేగమె యాజ్యభక్ష్యసమేత మా
నన్నపాత్రముఁ గూరనాథున కర్పణమ్మొనరించి ర

మ్మన్న నాతఁడు లేచి శ్రీహరియానతిం బరమాన్నముం
దిన్నఁగాఁ గొనిపోయి యిచ్చెను దేవతాదృతిఁ దెల్పుచున్.

ఉ. శ్రీరమణుండు నాకుఁ గలచింతల నన్నిటిఁ దీర్చె నిప్పు డా
హారము వేఱుగాఁ దనకు నంపఁగ నేల? యటంచు భార్యతోఁ
గూరవిభుండు నీ వెదియుఁ గోరఁగ లేదుగదా యనంగ నా
నారియుఁ గొంకుచుం దనమనంబున నైనతలంపుఁ దెల్పినన్.

ఉ. చేడియమాట కద్భుతముఁ జెంది యతం డటు లైన నీవె యా
కూడు భుజింపుమీ యనఁగఁ గోమలి సాపడె నేమి మాఱుమా
టాడక తన్మహత్త్వమున నామెకు గర్భము నిల్చి చంద్రుతో
నీడగునందనుల్ గలిగి రిర్వురు సర్వకళాసమృద్ధులై. 124

గీ. పురుడు పదినాళులుం బోవఁ బురుడులేని
లక్ష్మణార్యుఁడు వచ్చి సలక్షణు లగు
కూరకులదీపకుల నాకుమారులఁ గని
పరమసంతోషపరిపూర్ణభావుఁ డగుచు. 125

గీ. ఘను లగుపరాశరవ్యాసమునులపేర
వారికిఁ బరాశరవ్యాసభట్టరు లని
నామకరణమ్ము చేయించి యామునార్యు
నభిమతము పూర్తిచేసి కృతార్థుఁ డయ్యె. 126

క. శ్రీరంగపురమునం గా
వేరీతీరమున నున్నవెలిపల్లియలో
శ్రీరమణీనాయకపద
నీరజపరుఁ డైనమారనేర్నంబి తగున్. 127

గీ. పంచమకులీనుఁ డైనను భాగవతుఁడు
గాన వానిని యామునమౌని మెచ్చి
పంచసంస్కారములను గావించి మిగులఁ
బ్రీతి శిష్యుఁడుగా నురరీకరించె. 128

ఉ. వానికిఁ బూర్వకర్మపరిపాకమునన్ వ్రణ మైన నెట్టులో
దాని సహించుచున్ హరిపదమ్ముల నెంచుచు యామునార్యవి
జ్ఞానపథజ్ఞుఁ డౌపెరియనంబి యొసంగెడునట్టియన్నముం
బానముఁ గొంచునయ్యధమవర్ణుఁడు కాలముపుచ్చుచుండఁగన్.

సీ. క్రమముగా వ్రణబాధ ఘన మౌటయును మార
నేర్నంబి మసలఁగా నేరకున్నఁ
బెరియనంబియు రేయి యరుదెంచి నిత్యమ్ము
సకలోపచారముల్ సలుపుచుండె
నాజాడ నెఱిఁగి రామానుజుం డొకరాత్రి
గూఢంబుగా నేఁగి గురుఁడు సేయు
నుపచారములఁ గాంచి యపరిమితానంద
తుందిలహృదయారవిందుఁ డయ్యు
మారనేర్నంబి పడెడుశ్రమంబుఁ జూడ
నోపఁగా లేక వంత నిట్టూర్పు విడువ
నాసడి యెఱింగి మారనేరాహ్వయుండు
గట్టిగా నెలుఁగెత్తి తా నిట్టు లనియె. 130

క. ఆసర్వశేషి నాకుం
జేసెడి యుపకృతి కసూయఁ జెందెడువా రే

ర్తో సూడఁబడ రనంగా
నే సుముఖత లక్ష్మణార్యుఁ డెదుటికి వచ్చెన్. 131

గీ. వచ్చి వానిప్రపత్తికి మెచ్చె నంత
మారనేర్నంబి యిళయాళవారె వచ్చి
రని తెలిసి యేను ధన్యుఁడ నైతి భవముఁ
బాసితి నటంచు వైకుంఠపదము నొందె. 132

క. హరినామస్మరణంబున్
నెరపుచుఁ జనినట్టిమారనేర్నంబికి ను
త్తరలోకక్రియ లొనరిచి
యరిగె మహాపూర్ణుఁ డింటి కతిదుఃఖితుఁ డై. 133

సీ. అది గని రామానుజార్యుఁ డద్భుతమంది
స్వామి! యే మిది కడజాతివానిఁ
దాఁకి సమస్తవిధమ్ములఁ బరిచర్య
నాచరించుటె కాక హరినివేది
తాన్నంబు నొసఁగితి రౌర్ధ్వదైహికకర్మ
ములును జేసితి రిది పోలునొక్కొ?
యనుటయు నవ్వి మహాపూర్ణుఁ డోలక్ష్మ
ణా! నీ వెఱుంగనినయము గలదె?
రాముఁడు జటాయుదహనకర్మము సలుపఁడె?
శ్లాఘ్యుఁ డనె నేను శ్రీరామచంద్రుకన్నఁ
బక్షికంటెను లఘువె యీభాగవతుఁడు
చెప్పు మన లక్ష్మణుఁడు సంతసించె మిగుల. 134

క. నగవైరిపురమునకు మి
న్నగ వైభవసంపదలఁ దనర్చి పుడమికిన్
నగవైఖరిఁ దగు నిచుళా
నగరమ్ము గరమ్ము మన్ననకుఁ బాత్రంబై. 135

గీ. అందు నప్రతిమానబాహాబలాఢ్యుఁ
డగుధనుర్దాసుఁ డనుజెట్టి యధివసించు
నవవయఃప్రౌఢి నొప్పుపొన్నాచ్చి యనెడు
నబ్జలోచన తనకు నిల్లాలు గాఁగ. 136

చ. అనుపమరూపసంపదల కాశ్రయ మై సుగుణాలవాల మై
చనునిజధర్మపత్ని దనుఁ జాల నయంబుఁ బ్రియంబు మీఱఁగా
ననయముఁ గొల్చుచుండుటయు నా పెమెడం గలితానురాగుఁడై
మన మలరంగ నాతఁడు సమస్తసుఖమ్ములఁ దేలు నిచ్చలున్.

మ. శతపత్రిమ్ముల నెన్నుకన్నుఁగవతో సంపూర్ణరాకాశశి
ప్రతిమానం బగుముద్దునెమ్మొగముతోఁ బ్రాంచత్తనూవల్లితో
రతిచందంబున నొప్పుచుండురమణీరత్నంబు పొన్నాచ్చియున్
బతియే దైవ మటంచు నెమ్మనమునన్ భావించు సేవించుచోన్.

గీ. అట్టు లొండొరులందు బద్ధానురాగు
లగుచు క్షీరోదకమ్ములయట్లు కలసి
మెలసి యేభేదమును లేక మెలఁగుచుందు
రన్నివేళలయందు నయ్యాలుమగలు. 139

క. ఈరీతి నుండి యొకనాఁ
డారమణీరమణు లుత్సవాలోకనమో

దారూఢచిత్తు లగుచున్
శ్రీరంగముఁ జేరి యట వసించుచు నొకటన్. 140

ఉ. తూరుపు తెల్లవారుతఱిఁ దోయజలోచనయుం బ్రియుండుఁ గా
వేరికిఁ బోయి యన్నదిపవిత్రజలమ్ముల నాడి వచ్చుచో
నీరజభర్త పూర్వధరణీధరశృంగమునందుఁ దోఁచి వి
స్ఫారకరావళిం దనప్రచండతఁ జూపఁదొడంగె నయ్యెడన్.

గీ. ఉష్ణకిరణుమహోగ్రమయూఖపాళి
సుదతిముఖమండలమ్మున సోఁకకుండ
నాత్మచేలాంచలమ్ముఁ బై నడ్డు వట్టి
పురమువంక ధనుర్దాసుఁ డరుగఁ జొచ్చె. 142

గీ. అపుడు కావేరిలో స్నాన మాచరించి
శిష్యపరివృతుఁ డగుచు వేంచేయుచున్న
లక్ష్మణుండు ధనుర్దాసులక్షణమ్ముఁ
గని యతనియజ్ఞతకు జాలిఁగొనుచు మదిని. 143

క. ఇతఁ డిప్పు డిట్లు సుదతీ
జితుఁ డై యున్నను స్వభావసిద్ధ మగుదృఢ
స్థితియుఁ దదేకవ్యాపా
రతయుం గలవాఁడె; పామరత ని ట్లయ్యెన్. 144

క. కనువారలు నవ్వుదు రని
మనమున సిగ్గు వడ కిట్లు మగువకుఁ బరిచ
ర్యను జేయు టితనిహృదయం
బనితరనిష్ఠాగరిష్ఠ మగుటం గాదే? 145

శా. బుద్ధిస్థైర్యముగల్గువాఁ డగుటచేఁ బూఁబోఁడియందే సదా
బద్ధాత్ముం డయి వేఱొకం డెదియు సంభావింపఁ డీతండు స
న్నద్ధాబ్జోదరభక్తి యైనయెడ నన్యంబున్ విసర్జించి సం
శుద్ధాత్ముం డయిమేలు సెందఁగలఁ డంచుం గూర్మి సంధిల్లఁగన్

గీ. తరుణితోఁ గూడి ధనుర్దాసుఁ బిలిచి
యోమహాప్రాజ్ఞ ! నీ వుండునూరు నీదు
పేరును వినంగ వలతుఁ జెప్పెదవె ? యనిన
నతఁడు సవినయముగ యతిపతికి మ్రొక్కి. 147

క. ఓసామీ ! యే నిచుళా
వాసుండను జెట్టికొలమువాఁడ నను ధను
ర్దాసుం డందురు నా విని
యాసంయమి యిట్టు లనియె నాతనితోడన్. 148

చ. అనఘమతీ ! ప్రబుద్ధుఁడవె యౌదువు గాని యి దేల దారిలోఁ
గనుఁగొనువార లెల్లరు వికావిక నవ్వఁగ సిగ్గుమాలి యం
గన కిటు సేవ సేయ సమకట్టితి ? పౌరుషముం ద్యజింపఁగా
మన సెటు వుట్టె నీజనసమాజమునం దిటు సేయు టొప్పునే ?

చ. అన విని యాతఁ డి ట్లనె మహామునివర్య ! మదీయపత్నినే
త్రనళినముల్ సదా హృదయరంజనముం బొనరించు నాకుఁ గా
వున నవి యిప్పు డుద్ధతనభోమణిదీప్తులు సోఁక వాడునం
చును భయమంది యీపగిది సుందరికిం బరిచర్య సేయుదున్.

గీ. అనుడు రామానుజుం డది యాలకించి
యోధనుర్దాస ! యిప్డు నీయువిదనేత్ర

జలజములు నీకు హృదయరంజకము లగుచుఁ
దనరునవి యయ్యు నివి శాశ్వతములు గావు. 151

క. సత్యమ్మ గానివస్తువు
నిత్యానందమ్ము నొసఁగ నేరదు. గుణసం
స్తుత్యా ! కావున నీ విటు
లత్యంతము వీనిఁ దవులు టనుచితము సుమీ. 152

గీ. శాశ్వతానంద మొసఁగంగఁ జాలునట్టి
పుండరీకాక్షులోచనాంబురుహయుగము
గలదు నీ కది గాన్పింపఁగలను; దానిఁ
గొలిచెదవు గాక ర మ్మని పిలుచుటయును. 153

మ. నరకోత్తారకుఁ డై యెసంగుబదరీనారాయణుంబోలి యు
ద్ధురతేజస్థితి నొప్పుమీఱెడుయతీంద్రుం గాంచి యానందని
ర్భరితాంతఃకరణాంబుజుం డయి ధనుర్దాసుండు నమ్మౌనిశే
ఖరునాజ్ఞన్ శిరసా వహించి వినతుల్ గావించుచున్నమ్రుఁడై.

గీ. అతనితో రంగనాథాలయమున కరిగి
నతజనావనుఁ డగురంగనాథుదివ్య
మూర్తి సేవించి తన్నేత్రపుండరీక
ములఁ గనుంగొని యానందజలధిఁ దేలి. 155

క. శ్రీరామానుజపాదాం
భోరుహముల నాశ్రయించి పొలఁతియుఁ దానున్
బేరిమిఁ దము రక్షింపఁగ
స్వామికిఁ బ్రార్థించి రతని సవినయఫణితిన్. 156

గీ. అంతఁ గారుణ్యజలధి రామానుజార్యుఁ
డాతనికిని దత్కాంతకు నాక్షణంబ
పంచసంస్కారములను గావించి యాత్మ
శిష్యులం దెక్కుడుగఁ బ్రీతి సేయుచుండె. 157

గీ. యతివరుం డిట్టు లొకశూద్రు నతిశయముగ
నాదరముసేయుచుండుట యరసి యితర
వైష్ణవావళి యెల్ల నోర్వంగ లేక
రోసము వహించె నలధనుర్దాసునెడల. 158

క. ఆసంగతి యెఱిఁగి ధను
ర్దాసుని సౌగుణ్యసంపదనిరూపణముం
జేసి తనశిష్యులకుఁ గల
యీసుం దొలఁగింప నెంచి ఋషివర్యుండున్. 159

సీ. ఒకనాఁడు భాగవతోత్తముఁ డగుధను
ర్దాసునితో రహస్థ్సలమునందు
వైష్ణవపాళిదోవతులలోఁ గొపీన
ములకుఁ జాలినభాగములను వార
లెఱుఁగకుండఁగఁ జించి యిటకుఁ దె మ్మని యాన
తీయంగ నాతఁడు నేఁగి యట్లు
సలిపి వచ్చుటయు వైష్ణవు లొండొరులపయి
దోషమ్ము ఘటియించి రోషవివశు
లగుచుఁ బలువిధములఁ దిట్టులాడుకొనఁగఁ
జొచ్చి రప్పుడు యతిరాజు వచ్చి హితముఁ

గఱపి తమ్ముఁ నివారించువఱకు వారు
గలహ మొక్కింత యేనియు నిలుపరైరి. 160

సీ. ఆమరునాఁడు రామానుజాచార్యుఁ డా
వైష్ణవులను బిలువంగఁ బంచి
యారేయి మీ రెల్ల రేఁగి ధనుర్దాసుఁ
డతివతో నిద్రించునట్టివేళ
వానియంగనయొంటిపై నున్ననగ లెల్ల
హరియించి తెం డని యాజ్ఞ యొసఁగె
నంత ధనుర్దాసునందు నెక్కొనియున్న
యీర్ష్యఁ దీర్చికొనంగ నిదియె సమయ
మనుచు సంతోషపారవశ్యమున నరిగి
వార లానాఁటినడురేయి ఘోరవృత్తు
లయి ధనుర్దాసుఁ డున్నగృహమ్ములోనఁ
జొచ్చి నిదురించుచున్నపొన్నాచ్చిఁ జేరి. 161

క. ఒకప్రక్కనున్నభూషణ
నికరము నొలిచికొనునంత నిద్దుర మేల్కాం
చి కనుగవఁ దెఱచి పొన్నా
చ్చి కనుంగొనె నెదుట నున్నశ్రీవైష్ణవులన్. 162

గీ. అంత నావైష్ణవోత్తము లది యెఱింగి
యాత్మచౌర్యంబు వెల్లడియయ్యె ననుచు
మది భయభ్రాంతు లై పెక్కుమార్గములను
బరువులెత్తిరి పిక్కలబలముకొలఁది. 163

శా. వారల్ వోఁ బనకొంత సేపటికిఁ బూర్వక్షోణిభృన్మస్తకం
బారోహించెఁ బ్రయీమయుండు ద్విజలోకారావముల్ దిక్కులన్
మీఱెం దారకపంక్తి దాఱె ఘనతామిస్రమ్ము విచ్ఛిన్నమై
పాఱెం దూరుపు తెల్లవాఱె నతిశోభల్ గూరె నబ్జాళికిన్. 164

గీ. అప్డు రాత్రి జరిగినట్టివృత్తాంతంబు
నెల్ల ధర్మపత్ని యెఱుక సేయ
నమలినస్వభావుఁ డగుధనుర్దాసుండు
దానిఁ దెలిసి యాత్మతరుణిఁ జూచి. 165

చ. జడమతికాన! యింత యపచార మొనర్తురె? వైష్ణవాళి భీ
పడఁ గదలంగ నేమిటికి? వారలె నిన్ బొరలించి యింక నీ
యొడలఁ గలట్టిభూషణము లొల్చి గ్రహింతురు గాదె యేటికీ
వెడఁగుఁదనమ్ముఁ బూనితి? వివేకము లేదుగదా యొకింతయున్.

సీ. అని కోపపడుచు భార్యను వెంటఁ గొని యతి
రాజుచెంతకు సత్వరముగ నరిగి
యఖిలవృత్తాంతము నాగురూత్తమునకు
విన్నవింపఁగఁ దద్వివేకమునకు
నలరి యాతఁడు వైష్ణవులఁ బిల్చి యాతని
యధ్యవసాయమ్ము నరసినారె?
మీరలు కౌపీనమితఖండములు దోవ
తులఁ జింపఁబడె నంచు నలుకఁ బూని
తొలఁగక పరస్పరమ్మును దూఱుకొంటి
రితఁడు తనభార్యనగలు వోయె నని వ్యసన

మందకుండుటె కాక మి మ్మాపె తొడవు
లన్నియును గొనసీయ లే దనుచుఁ గనలె. 167

గీ. ఏనె దోవతులందుఁ గొపీనములను
జించి తె మ్మని యీతనిఁ బంచినాఁడ
ననుచుఁ జెప్పఁగ వైష్ణవు లది యెఱింగి
చిన్నవోవుచు లోలోన సిగ్గువడిరి. 168

క. అది మొదలుధనుర్దాసుని
సదమలవర్తన మెఱింగి సౌహార్ద మెడన్
గదియించి గౌరవింపఁగ
మొదలిడి రావైష్ణవోత్తములు సత్తము లై. 169

మ. ఖలులం దోలి సమస్తదుష్టమతముల్ ఖండించి విద్వత్త చె
న్నలరన్ దిగ్విజయ మ్మొనర్చి సువిశిష్టాద్వైతసిద్ధాంతమున్
నిలువంబెట్టి యశోవిశాలుఁ డయి నిర్ణిద్రప్రభావమ్మునం
జెలువొప్పారుచు లక్ష్మణార్యుఁ డటు లాశ్రీరంగమం దుండఁగన్.

సీ. శైవుండు విష్ణుదూషకుఁడు నౌక్రిమికంఠుఁ
డనుభూవిభుండు నిరంకుశాధి
కారుఁ డై చోళాఖ్యధారుణీమండలం
బెలమి మీఱంగఁ దా నేలుచుండి
స్వాధికారబలమ్ముచే ధరాతలమందు
శైవమతవ్యాప్తి సలుప నొక్క
పత్త్రిమ్ము పై 'శివా త్పరతరం నాస్తి'యం
చు లిఖించి యెల్లవారలకుఁ జూపి

వారు దానికి సమ్మతివడినయట్టు
లందుఁ జేవ్రాలు నేయుఁ డటంచు వార
లను బలాత్కృతి నేయుచు విననివారిఁ
జెనకి యతికఠినముగ శిక్షింపఁ దొడఁగె. 171

క. కొందఱు రాజభయమ్మునఁ
గొందఱు స్వస్థలము వదలికొని యెచ్చటకే
నిం దరలఁజాల లేకయు
నందుల కొడఁబడఁ దొడంగి రచ్చటివారల్. 127

ఉ. కొం కొకయింత లేక మఱి కొందఱు వైష్ణవవర్య లేము ని
శ్శంకముగా వచించెదము శైవముఁ గైకొన మంచు జేనితో
బింకము లాడి యానృపుని పేరలుకం బడి క్రూరశిక్షలం
గ్రుంకిరి యాలుబిడ్డలను ఘోరవిచారపయోధి ముంచుచున్.

గీ. పందతనమున మఱికొంతమంది బ్రదికి
యున్న నెపుడేని సుఖముల నొంద వచ్చు
ననుచుఁ దమగృహక్షేత్రపశ్వాదుల విడి
తెరువువట్టిరి వేఱొండుదేశములకు. 174

ఉ. అత్తఱి లక్ష్మణార్యునిమహత్త్వ మెఱింగినయట్టియొక్కవి
ప్రోత్తముఁ డానరేశ్వరునియొద్దకుఁ బోయి నృపాల! యిట్లు గో
డెత్తఁగ వైష్ణవాగ్రణుల నేమిటి కేఁచెద వయ్యయో! మహో
దాత్తుఁడు లక్ష్మణార్యుఁడు ప్రధానము విష్ణుమతప్రశస్తికిన్.

గీ. అతఁ డిపుడు రంగపత్తనమందుఁ గలఁడు
నీ వతని శైవుఁ గావింప నిఖిలవిష్ణు

భక్తవరులును నీకు లోఁబడుదు రనుచుఁ
బలుక నౌ నని క్రిమికంఠపార్థివుండు. 176

సీ. ఆక్షణమందె రామానుజు బంధించి
కొనితేర భటులను బనుపుటయును
వారలు శ్రీరంగపట్టనంబున కేఁగి
యచ్చోట లక్ష్మణు నరయుచుండ
యతిరాజునకు మజ్జనార్థము కావేరి
నుండి తీర్థముఁ దెచ్చుచుండి కూర
నాథుఁ డాభటులదుర్నయ మంతయు గ్రహించి
చయ్యన గురునియాశ్రమముఁ జొచ్చి
తీర్థకుంభంబు నచ్చోట దింపి మౌని
ముఖ్యునిత్రిదండకాషాయములు ధరించి
వెలుపలకు వచ్చి భటులచేఁతలకుఁ జిక్కిఁ
దెగి పెరియనంబియును దదధీనుఁ డయ్యె. 177

ఆ. అది యెఱింగి లక్ష్మణాచార్యుఁ డిఁక నట
నుండ రా దటంచు నూహ సేసి
సత్వరముగఁ దాను సన్నిధిశిష్యుల
తోడఁ బశ్చిమంపుఁద్రోవఁ జనియె. 178

ఆ. అట్లు చనుచు మార్గమం దొక్కభీకర
వనమునందు క్షుత్పిపాస లొంది
కష్టపడుచు నుండఁగా నందుఁ గలబోయ
వాండ్రు గొంతమంది వారిఁ జూచి. 179

క. చెలువొప్పువారిలక్షణ
ములు గని వైష్ణవు లటంచుఁ బోలిచి యాబో
యలు నల్లానార్యునిశి
ష్యలు గావునఁ బరమభక్తి శోభిల్లంగన్. 180

సీ. వారలు శ్రీరంగవాసు లౌట యెఱింగి
యతిరాజునకు నేమమా యటంచు
నడుగుటయును దాని కావైష్ణవోత్తము
లాశ్చర్య మొంది రామానుజార్యు
నేవిధమ్మున మీర లెఱిఁగితిరో చెప్పఁ
డన బోయ లామాట లాలకించి
మాగురుఁ డెఱిఁగించె మహితాత్ము నాతనిఁ
దత్కీర్తి ధరఁ బ్రసిద్ధంబు గాదె?
యనుచుఁ బలికిరి వైష్ణవు లంత బోయ
వాండ్రు కెల్లర కిలయాళువారిఁ జూప
భక్తిపరవశు లయి వ్యాధవరులు యతికి
శిష్యులకు నుపచారముల్ చేసి రపుడు. 181

క. మఱునాఁడు తన్మహావన
పరిసరమున నున్నయొక్కపల్లియకు యతీ
శ్వరుఁ డరిగెఁ గిరాతవరుల్
సరణి నివేదింప శిష్యసహితుం డగుచున్. 182

గీ. అందుఁ జేలాంచలాంబాహ్వయమునఁ దనరు
సాధ్వి రామానుజుని గాంచి సంభ్రమించి

దాసురాలిడుభుక్తిసత్కారములను
గొని కృతార్థను జేయుఁడీ యనుచు వేఁడె. 183

క. యతిపతి తద్భక్తికి న
ద్భుతమందుచు మేము వైష్ణవుల మీవు ననం
చితపంచసంస్కృతివి యే
గతి నీగృహమున భుజింపఁగా వచ్చు ననెన్. 184

మ. అనఁ జేలాంచల నమ్రయై గురువరేణ్యా! యేను మీశిష్యురా
లను గానే నను వేఱుసేయు టిది యేలా? దాసురాలిం గృతా
ర్థ నొనర్పం దగదే యనంగ యతిమూర్ధన్యుండు తద్వాక్యముల్
విని మా కెట్టులు శిష్యురా లయితి? వావేదింపుమీ నావుడున్.

సీ. ఆచార్య! యీదేశమందు మున్ బండ్రెండు
వత్సరమ్ములు గర్వు వట్టె నట్టి
తఱి నేను శ్రీరంగపురమున నాతండ్రి
యింటికి వచ్చి యందుంటి నప్పు
డొకనాఁడు మేడపైనుండి నే బిక్షకై
దేవర యిల్లిల్లుఁ దిరుగఁ గంటి
నామఱునాఁడు నే నట్టులే మేడపై
నుండ దేవరయే మహోర్వీపతులు
వేదవేదాంగవిదులైనవిబుధవరులు
చుట్టికొని కొల్చుచుండఁగాఁ జుక్కలందుఁ
జందురునిమాడ్కి నొప్పుచుఁ జనుటఁ గంటి
నప్డు నా కెంతయును విస్మయంబు గలిగె. 186

ఉ. అంతట సంతసంబు వినయంబు భయంబును దోఁప నేను మీ
చెంతకు వచ్చి యుంఛమున జీవనముం బొనరించుచున్నమీ
కింతమహత్త్వ మెట్లు లభియించెనొ తెల్పుఁ డటంచు వేఁడ నా
చింతకు మెచ్చి మీరు దయసేసితి రెద్దియొ దివ్యమంత్రమున్.

క. పిమ్మట నే నీకుగ్రా
మమ్మున కరుదెంచి పతిసమారాధనమున్
సమ్మతిఁ జేయుచు నామం
త్రమ్మును మఱచితిని మందతన్ గురువర్యా! 189

సీ. మరల నా కిప్పు డామహితమంత్రముఁ బ్రసా
దింపవే యనుచుఁ బ్రార్థించుటయును
భక్తవాత్సల్యకూపార మౌరామాను
జార్యుఁ డామెప్రపత్తి కలరి యపుడు
ద్వయమంత్రరాజంబు దయచేసి శుద్ధిగా
నాపె వందినబోన మారగించె
నాసాధ్వి పతియు నిజాంగనచే లక్ష్మ
ణార్యమహత్త్వమ్ము నాలకించి
దాసుఁ డై యతిరాజుపాదములు వట్టి
పంచసంస్కారములను జేయించుకొనియెఁ
బిదప మన్నాథుఁ డటనుండి వెడలి వహ్ని
పుష్కరిణిమీఁదుగ మిథిలాపురికి నరిగె. 189

క. రామానుజముని యాపురి
లో మాయావాదు లెల్ల లోఁబడ సాల

గ్రామం బని క్రొత్తగఁ దిరు
నామం బాపట్టనంబునకుఁ గీలించెన్. 190

క. క్రిమముగ నరసింహక్షే
త్రమునకు విచ్చేసి స్వామి దర్శించి గత
శ్రముఁ డై లక్ష్మణవాచం
యమి భక్తగ్రామమునకు నరుదెంచి యటన్. 191

ఉ. ఆపుర మేలువిఠ్ఠలధరాధిపునాత్మజ భూతపీడచే
దూపిలుచుండఁగా దెలిసి తోడనె యచ్చటి కేఁగి యాపెకున్
శ్రీపదతోయ మింత గృపచేసి పిశాచభయమ్ముఁ బాప నా
భూపతియున్ యతీంద్రునకుఁ బూజలొనర్చెఁ బ్రహృష్టచిత్తుఁడై.

చ. ప్రయతిని దన్ను విఠ్ఠలనృపాలుఁడు గొల్వఁగ విష్ణువర్ధనా
హ్వయమిడి పంచసంస్కృతులఁ బావనుఁ జేసె యతీంద్రుఁడా క్షమా
ప్రియుదరి బౌద్ధపండితులు పెక్కురు శాస్త్రపథమ్మునం బరా
జయమును బొంది వైష్ణవము సమ్మతిఁ గైకొని రూర్జితాత్ములై.

క. ఈతీరుగా విశిష్టా
ద్వైతము వెలయించి విష్ణువర్ధనువీటన్
స్ఫీతయశుం డయి శిష్యస
మేతముగా నతఁడు వేడ్కమెయి నివసించెన్. 193

గీ. అట్లు సుఖముండియును లక్ష్మణార్యుఁ డందు
శ్వేతమృత్తిక దొరకమిఁ జింత గదిరి
యుండఁగా దిరునారాయణుం డొకప్డు
కలను గనుపట్టి యారీతిఁ దెలియఁ బలికె. 195

సీ. యాదవాచలమున నలరారుకల్యాణ
తీర్థంబుదక్షిణతీరమందుఁ
గనవచ్చుతులసిప్రక్కనె యొక్కవల్మీక
మున్నది యందునే నొప్పుచుంటి
నుత్తరతటమున నుత్తమం బగుశ్వేత
మృత్తిక గలదు సమృద్ధిగా న
టంచు నంతర్హితుం డయ్యె లక్ష్మణుఁడును
విష్ణువర్ధనున కవ్విధముఁ దెలిపి
వేగ నచ్చటి కేఁగి త్రవ్వించి చూడఁ
గోటిసూర్యప్రకాశము గొమరుమిగులు
చుండఁగాఁ దిరునారాయణుండు వెలసె
దివ్యమైనట్టిశ్వేతమృత్తికయు దొరకె. 196

క. గురువర్యునియానతి యదు
వరశైలమునందు విష్ణువర్ధనుఁ డొకమం
దిరమును గట్టించి యటం
దిరునారాయణుని సంప్రతిష్ఠింపించెన్. 197

మ. హరినిత్యోత్సవవిగ్రహం బొకఁడులేదంచున్ యతీంద్రుం డెదం
బరితాపంబును జెందుచుండుటయు స్వప్నంబందు సాక్షాత్తుగాఁ
దిరునారాయణమూర్తి కానఁబడి యర్థిం దాను ఢిల్లీపురీ
శ్వరుసౌధంబున నుంటఁ దెల్పెఁగడునాశ్చర్యంబు సంధిల్లఁగన్.

మ. యతినాథుం డట విష్ణువర్ధనునితో నాత్మీయసచ్ఛాత్త్రసం
తతితో రాతిరి స్వప్నమం దయినవృత్తంబుం బ్రసంగింప నా

నతులై వారలు నెల్లి ఢిల్లిపయికిన్ దండెత్తి మావిక్రమో
ద్ధతి రామప్రియుఁ దోడితెత్తు మని యుత్సాహంబు దీపింపఁగన్.

సీ. ధవళోర్ధ్వపుండ్రముల్ దనరారువారలు
పద్మాక్షమాలికల్ ప్రబలువారు
తులసీదళమ్ములు పొలుపారువారలు
పట్టుచేలమ్ములఁ బరఁగువారు
ధాటిపంచకముఁ బెద్దగఁ బఠించెడువారు
శ్రీచందనమున వాసించువారు
స్వర్ణవేత్రమ్ములఁ జళిపించువారలు
గరుడపతాకలఁ గ్రాలువారు
బ్రాహ్మణులు క్షత్రియులు విశుల్ పాదజులును
లక్ష్మణమునీంద్రునాజ్ఞ దలన్ ధరించి
విజయసన్నద్ధులై దాడివెడలి ఢిల్లిఁ
జుట్టుముట్టిరి పాదుషా చూచి బెగడ. 200

క. వారలరాకకు హేతువు
చారులచే నెఱిఁగి పాదుషా మంత్రులతో
శ్రీరామానుజుసన్నిధిఁ
జేరి వినమ్రత సలాము చేసి యిటు లనెన్. 201

శా. ఓసద్వైష్ణవులార! యింతపనికై యుద్ధంబు గా నేల? మా
ప్రాసాదంబున నెందునేనియును శెల్వాప్పిళ్ల గన్పడ్డచో
నేసందేహము లేక తీసికొనిపొండీ! యంచు వాక్రువ్వ సం
తోసంబందుచులక్ష్మణార్యుఁడును ధాత్రీలోఁయి శోధింపఁగన్.

క. ఢిల్లీశ్వరపుత్త్రిక రా
గిల్లి కొలువ నాపెళయనగేహమునం ద
త్యుల్లాసమ్మొమెయిన్ వ
త్త్రిల్లెడురామప్రియుండు దృగ్గతుఁ డయ్యెన్. 203

గీ. హర్షపరవశుఁ డయి యప్డు యతివరేణ్యుఁ
డస్మదీయసంపత్కుమారా యటంచు
నతని నాహ్వాన మొనరించె నదిమొదలుగ
నతఁడు సంపత్కుమారాహ్వయమునఁ బరఁగె. 204

గీ. ఉడయవరుఁ డట్లు రామప్రియుండు దనకు
దొరకుటంజేసి సంతోషభరితుఁ డగుచు
జయజయధ్వనితో శిష్యజనులు గొలువ
యదుధరాధరమునకుఁ బ్రయాణమయ్యె. 205

క. పవ లెల్ల శెల్వపిళయు
త్పవవిగ్రహ మట్టులుండి సాయం బగుడున్
యువపురుషుం డై ఢిల్లీ
ధవపుత్త్రికఁ గూడిమాడుఁ దాత్పర్యమునన్. 206

సీ. అది గాన ఢిల్లీశునాత్మజ రామప్రి
యునివియోగభరమ్ము నోర్వ లేక
యత్యంతసంతాపితాత్మ యొటయుఁ బాదు
షా గూఁతువలన విచారహేతు
వెఱిఁగి రామప్రియు నెడఁబాసి తనపుత్రి
నిలువ నేర దటంచు నిశ్చయించి

యతిరాజుఁ బిలువంగనంపి యాత్మతనూజ
నమ్మహాత్మునిచేతి కప్పగించె
నిట్లు సంపత్కుమారు ఢిల్లీశుపుత్రిఁ
గొనుచు రామానుజార్యుండు కొంతదూర
మరుగ రామప్రియునితోడ నైక్య మందెఁ
బాదుషాపుత్రి యచ్చెరుపాటు దోఁప. 207
అట్లు రామప్రియుం దెచ్చి యాదవాద్రి
యందు నిలిపి యతీంద్రుఁ డానంద మొప్ప
నుత్సవాదులఁ జేయించుచుండె నచట
వైభవముమీఱఁ బండ్రెండు వత్సరములు. 208
మ. అట రామానుజమౌనిమౌళికయి కూరాధీశునిం బూర్ణ మ
ద్భటులౌ చోళభటుల్ బలాత్కృతిమెయిన్ బంధించికొంపోయిముం
దట నిల్పం గని చోళరాజు శివుఁడే దైవం బటం చున్నసం
పుటిపై సమ్మతివ్రాలు సేయుఁ డని సంబోధించె నాయిర్వురన్.
క. కూరేశుం డానృపునెడఁ
గారుణ్యముఁజేసి పెక్కుగతులను శ్రీమ
న్నారాయణపారమ్యము
ధీరతఁ దెలిపెన్ శ్రుతిస్మృతినిరూఢము గాన్. 210
గీ. ఒకఁడు పాదాబ్జములు సోఁప నొకఁడు కడుగు
నొక్కఁ డాజల మొదల నూను నిందుఁ
దారతమ్యమ్ముఁ గను మని కూరవిభుఁడు
పలుకుట యు మండిపడి చోళవల్లభుండు. 211

శా. మీపాండిత్యము నే మెఱుంగుదుము సామీచీన్యశూన్యక్రమా
లాపంబు ల్పచరింపఁగాఁ దొడఁగు చేలా జాలముం జేయ మీ
రాపత్త్రిమ్మన వ్రాలు సేయుదురొ సేయం బోవరో యంచు దు
ష్కోపాటోపముతో నదల్చి పలుకం గూరేశుఁడున్ రుష్టుఁడై.

గీ. కను మని 'శివా త్పరం నాస్తి' యనెడుపఙ్క్తి
యవులను 'దతః పరం ద్రోణ మస్తి' యనుచు
మేలముగ వ్రాసి చూపినఁ జోళనాథుఁ
డధికరోషారుణాక్షుఁ డై హుంకరించి. 213

చ. మొఱకుఁదనంబునన్ శివుని మ్రొక్కనివారలు వీరికన్నులన్
బెఱుకుఁ డటంచుఁ గ్రూరు లగుభృత్యుల కానతివెట్ట వారు న
త్తెఱఁగునఁ జేసి భూపతికిఁ దెల్పిరి; యక్కటః మున్నె వృద్ధతన్
మఱుఁగుచునున్నయప్పెరియనంబి గతించెను దీవ్రవేదనన్.

క. కూరేశ్వరు నాభూపతి
కారాగారమునఁ బెట్టఁగా నాతఁడు శ్రీ
నారాయణపదపద్మము
లారాధించుచు వసించె నట నిశ్చింతన్. 215

ఉ. అంతటఁ గొన్నివత్సరము లట్టె చనన్ ఖలుఁ డైనచోళభూ
కాంతుఁడు కుత్తుకన్ వ్రణము గల్గ బహుక్రిమికీర్ణకంఠుఁ డై
యంతకసన్నిధిం గనియె నాయదుశైలమునందు సర్వవృ
త్తాంతము లక్ష్మణుండు విని తద్దయు ఖేదము మోదముం గనెన్.

క. శ్రీరామానుజుఁ డటుపై
శ్రీరంగంబునకు నరిగి శిష్యవరుం డౌ

కూరాధిపు నుచితవ్యా
హారమ్ములనాదరించె నధికప్రీతిన్. 217

గీ. అంత నటమండి తిరుపతి కరిగి యందుఁ
దిల్లగోవిందరాజుఁ బ్రతిష్ఠచేసి
మార్గమందుఁ దేవప్పెరుమాళ్లఁ గొలిచి
మరలి యతిరాజు శ్రీరంగమఠముఁ జేరె. 218

క. ఉడయవరునియుపదేశము
వడువునఁ గూరాధిపుఁడును వరదుఁ బొగడి యే
ర్పడ నయనమ్ములు వెందియుఁ
బడసి యథాపూర్వముగ శుభస్థితి నుండెన్. 219

గీ. పిదప యతిరాజు తాఁ దలపెట్టినపని
యెల్ల నెఱవేఱినది యని యెఱిఁగి యింకఁ
దనవతారముఁ జాలింపఁ దలఁచి కూర్మి
శిష్యులం బిల్చి యిట్లు శాసింపఁ దొడఁగె. 220

క. పరమమతులార! మీమీ
గురువులకును భాగవతులకును సతతంబున్
నిరవద్యభక్తిభరితాం
తరులై కైంకర్యమును బొనర్పఁగ వలయున్. 221

గీ. అమలినాత్ము లాద్యులైనయాచార్యోక్త
ములు వచించినట్టిపలుకు లెల్ల
నమ్ముచుండి యింద్రియమ్ముల కెన్నండు
వశులు గాక మెలఁగ వలయు మీరు. 222

క. ఇలఁ గలశాస్త్రమ్ములలో
పల సాధారణము లైనవానిఁ జదువఁ గాఁ
దలఁపక భగవద్విషయక
ము లయినపరిశుద్ధశాస్త్రములె నేర్వఁ దగున్. 223

మ. పరమాచార్యకృపావిశేషపరిలబ్ధజ్ఞానసంపన్ను లై
యరిషడ్వర్గము నిగ్రహించి విషయవ్యాలోలతం బాసి భో
గరతిం దవ్వులఁ బెట్టి భక్తజనరక్షాదీక్షితుం డైనశ్రీ
హరిఁ గీర్తించుచుఁగాలయాపనము సేయన్ మీకులగ్గయ్యెడున్.

క. భగవంతుని గీర్తించెడు
పగిదిన్ సతతముఁ దదీయభక్తులఁ గీర్తిం
పఁగ వలయు సుజనులకు మే
లగు భగవద్భక్తకీర్తనామృతమహిమన్. 225

క. ముక్తికి భగవత్ప్రాప్తికి
భక్తులె కారణ మటంచు భావించుచు సం
త్యక్తాన్యవిషయు లై యా
భక్తులనే యాశ్రయింప వలె నెల్లపుడున్. 226

గీ. భోగపరతఁ జొక్కి రాగాదులకుఁ జిక్కి
విష్ణుదేవునియును వైష్ణవులయు
సేవ మఱచి మూఢభావు లై వర్తించు
వారు తుదకుఁ గీడువడి నశింత్రు. 227

సీ. అర్చావతారమ్ము లన్నియు శిల లంచు
గురువులు మనబోఁటినరులె యనుచు

విష్ణుదేవునియును వైష్ణవులయును శ్రీ
చరణతీర్థము నొక్కజలమె యనుచు
నఖిలపాతకహరం బైనతన్నామమం
త్రంబు సామాన్యశబ్దంబ యనుచు
సర్వేశ్వరేశ్వరేశ్వరుఁ డైనశ్రీశుండు
సయితమితదితరసముఁడె యనుచుఁ
దలఁచి మది భక్తివిశ్వాసములు త్యజించి
పాపభీతి విసర్జించి పరము రోసి
మెలఁగువారలు సముపాత్తకలుషు లగుచుఁ
విష్ణుసాయుజ్యముక్తికి వెడల లేరు. 228

గీ. జ్ఞానవైరాగ్యభక్త్యాదిసద్గుణములు
గలుగుమహితాత్ము లైనభక్తులనె పూజ్యు
లని తలఁచి వారలకె మ్రొక్కుఁ డట్టివారి
యందె విశ్వాస ముంపుఁడో యనఘులార! 229

చ. అలఘుతరప్రభావులు మహాత్ములు నై తనరారువిష్ణుభ
క్తులు సనుదెంచుటం గనినతోడనె ము న్నెదురేఁగి వారి కం
జలి ఘటియించి గౌరవము సల్పి పదంపడి వార లేఁగుచోఁ
బొలుపుగఁ గొంతద వ్వనిపిపుచ్చఁగవెంబడిఁ బోయిరాఁదగున్.

సీ. భగవంతు నర్చించుపరమార్థమునకంటె
భాగవతార్చనాపరత లెస్స
శ్రీవిష్ణు నవమతి సేయుటకంటెను
శ్రీవైష్ణవుల నిందసేఁత ఘనము

కమలాక్షపాదతీర్థమునకంటెను భక్త
పాదతీర్థమ్ము శుభప్రదంబు
హరిపుణ్యచరితమ్ము నాలింప నెంచుకం
టెను ప్రపన్నులకథల్ వినుట మేలు.

గీ. వైష్ణవుం డెంతదారిద్ర్యవంతుఁ డైన
నడఁగి 'యడియము దాసోహ' మనినఁ దాను
నల్లై 'యడియము దాసోహ' మననినాఁడు
హరికి నపరాధ మొనరించినట్లై యగును. 231

క. ఈరీతి మూఁడుదినము ల
హోరాత్రము శిష్యవరుల కుపదేశమ్ముల్
దీరిచి యోగపథమ్మున
శ్రీరామానుజుఁడు కీర్తిశేషుం డయ్యెన్. 232

చ. గురువరుదేహపాతమునకున్ వగఁ గూరి యతీంద్రుశిష్యు లె
ల్లరు విలపించి రాతనిఁ దలంచుచు నయ్యెడ లోకమున్ దివా
కరవిరహమ్ముచేఁ బవలు కైవడి నెంతయు నంధకారబం
ధుర మయినట్లు దోఁచె నతిదుస్సహదుఃఖపయోధిఁదోఁగుచున్.

ఉ. పంబినభక్తి నప్పరమభాగవతుల్ యతిరాజుదేహనా
శంబునకై విచారపడ సాఁగిరి గాని తదాత్మ విష్ణులో
కంబున సర్వశేషిపదకంజమునన్నిధి నాదిశేషరూ
పంబున వైష్ణవోత్తమశుభస్థితి నారయుచుండె నిప్పుడున్.

క. శ్రీరావువంశపారా
వారసుధాకిరణ ! దీనవత్సల ! కవితా
సారవిదగ్రేసర ! సూ
ర్యారాయా ! సకలసుకవిరాజవిధేయా ! 325

ఉ. అప్రతిమానదానవిభవార్జితనిర్మలకీర్తి ! సత్యవా
క్యప్రియ ! ధర్మరక్షణసమాదర ! భూధరధైర్య ! రామరా
యప్రభువర్యపుత్ర ! కలశాబ్ధిసమానగభీరభావ ! లో
కప్రథితానుభావ ! నిజగౌరవపూర్ణ! మహేంద్రవైభవా ! 236

మాలిని. వినుతసుగుణజాలా ! విస్ఫురత్సౌమ్యశీలా !
జనహితసుచరిత్రా ! సత్కవీశాబ్జమిత్రా !
దినకరసమతేజా ! దీనమందారభూజా !
ఘనవిబుధసనాథా ! కావ్యగీతిప్రబోధా ! 237

గద్యము.

ఇది శ్రీజానకీరమణచరణారవిందమిళిందాయమానమానసభావుక
రావుకులతిలకసూర్యరాయభూమండలాఖండలసమగ్రాను
గ్రహపాత్రకౌండిన్యసగోత్రపవిత్రదేవులపల్లివంశ
సంభూతసీతారామశాస్త్రివిద్వన్మణిపౌత్రవేంకట
కృష్ణశాస్త్రీంద్రపుత్రసుబ్బరాయసుధీవర
సోదరతమ్మన్నశాస్త్రిప్రసిద్ధాభిధానాం
తరవిబుధజనవిధేయవేంకటకృష్ణ
శాస్త్రినామధేయప్రణీతంబైన
యతిరాజవిజయమునఁ
జతుర్థాశ్వాసము
సర్వంబును
సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ.



# తప్పొప్పుల పట్టిక



| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 22 | వాలుగంటి | వాలుఁగంటి |
| 4 | 19 | జారుకవిత్వ | చారుకవిత్వ |
| 8 | 10 | శయముఁ | శయము |
| 18 | 21 | దప్పురంబు | దర్పురంబు |
| 20 | 13 | నచ్చటం | నచ్చటఁ |
| 23 | 11 | పతే్రక్షణా | పత్రేక్షణా |
| 26 | 4 | పట్టణం | పట్టనం |
| 30 | 4 | విరిబోణి | విరిఁబోణి |
| 36 | 15 | కాగింబ్రాప్తించి | నాగింబ్రాపించి |
| 38 | 21 | పృధివీ | పృథివీ |
| 39 | 2 | శిల్పనా | కల్పనా |
| 40 | 15 | జానకీ | శ్రీజానకీ |
| 42 | 7 | దుర్ణీతి | దుర్నీతి |
| ,, | 14 | పిశా | ఁబిశా |
| 46 | 10 | చేరు | చేరి |
| 48 | 10 | రామానుజ | రామానుజ |
| 49 | 2 | నొద్ధ | నొద్ద |
| ,, | 8 | శ్రుతికై | శ్రుతికిఁ |
| 50 | 20 | వీక | వీఁక |
| ,, | 23 | పెద్ద | ఁబెద్ద |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 51 | 11 | చ్ఛాత్ర | ఛాత్ర |
| 52 | 11 | బనిఁగొని | బనిగొని |
| 53 | 13 | ్రవాక్రుచ్చె | వ్రాక్రుచ్చె |
| 63 | 9-10 | సత్కృట | సత్కృట |
| 64 | 8 | ముంగట | ముంగల |
| 66 | 4 | మెలఁగుచుండెఁ | మెలఁగుచుండె |
| 67 | 3 | దలంచుఁ | దలంచుచుఁ |
| 71 | 9 | చిరబిర | బిరబిర |
| ,, | 17 | మదుగుల్ | మడుఁగుల్ |
| 72 | 5 | దూరఁ | దూఱఁ |
| 76 | 22 | హాద్యం | హృద్యం |
| 77 | 20 | శక్తి | సక్తి |
| ,, | 21 | మైత్రికి | మైత్త్రికి |
| 81 | 12 | ముడిచి | ముడిఁచి |
| 89 | 13 | సెలమి | సెలమి |
| 91 | 11 | దోఁకొని | దోకొని |
| ,, | 12 | వేవేగమా | వేవేగనా |
| 96 | 15 | చూడ్కులం | చూడ్కులఁ |
| 97 | 10 | కిక్కరణి | నిక్కరణి |
| ,, | 13 | భణితిఁ | ఫణితిఁ |
| 105 | 13 | ప్రేరణ | ఁబ్రేరణ |
| 119 | 14 | హెచ్చెరిక | హెచ్చరిక |
| 121 | 19 | దలిర్స | దలిర్ప |
| 131 | 16 | ఒరుశక్తి | ఒరుశక్తిఁ |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 133 | 8 | నంబి | నంబిఁ |
| 135 | 16 | గ్రహించె | గ్రహించి |
| 143 | 18 | వేతృత్వ | వేత్తృత్వ |
| 144 | 11 | వేతృత్వ | వేత్తృత్వ |
| 145 | 23 | నాఫుఁ | నాథుఁ |
| 148 | 11 | నంతనతఁడు | నెంతో యతఁడు |
| 150 | 23 | విభప | విభవ |
| 153 | 7 | దిరుక్క-కచ్చి | దిరుక్క-చ్చి |
| ,, | 15 | నాథుఁగని | నాథునిగని |
| 154 | 14 | యాండాలమ్మ | యాండాళమ్మ |
| 155 | 7 | సై న | సైన |
| 160 | 6 | ధనుర్ధాను | ధనుర్దాను |
| 163 | 18 | కనుగవ | కనుఁగవ |

